శ్రీమతి
డా॥ యం. రుక్మిణీ కృష్ణమూర్తి రావు
కానుక

# మరోమండపము

## డా॥ సి. ఆనందారామం

నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ విజయవాడ-2



# MAROO MUNDADUGU

(Serialised in Andhra Jyothi Weekly)

By

Smt Dr. C. ANANDA RAMAM

First Edition :
October '80
894 : 8133

Printers :
"Sri Venkataramana Printers"
Vijayawada-2.

Cover Design :
B A P U

Publishers :
Navajyothi Publications
Eluru Road,
Vijayawada-2.

Price :
Rs. 9-00

శ్రీమతి

డా॥ యం. [illegible] కృష్ణమూర్తి గారి

నవల

"నవజ్యోతి" ప్రచురణలు!

పుస్తకాల షాపుల్లో ప్రత్యేక ఆకర్షణలు

గ్రంథాలయాలకు అమూల్యమైన ఆభరణాలు....

ఆధునిక సాహిత్యంలో నిరంతరం చిత్తశుద్ధితో శ్రమిస్తూ

ఎన్నో వినూత్న రచనలను, పాఠకలోకానికందిస్తూ

వారిలో నూతనోత్సాహాన్ని, ఆహ్లాదాన్ని పెంచే

ఉత్తమ రచనలు ప్రచురిస్తున్నాము.

ఆ పరంపరలోనిదే ఈ నవల

"మరో ముందడుగు"

# మా నూతన ప్రచురణలు

| | |
|---|---|
| మరో ప్రేమకథ | డి కామేశ్వరి |
| మరో ముందడుగు | డి. సి. ఆనందారామం |
| రాగజ్యోతి | చిట్టారెడ్డి సూర్యకుమారి |
| నళిని | ,, ,, |
| దూరతీరాలు | వాసిరెడ్డి కాశీరత్నం |
| సుదూరతీరాలు | పాటిబండ్ల విజయలక్ష్మి |
| ఆశల పల్లకి | వనం నరసింహారావు |
| త్యాగాలరేవులో రాగాలపడవ | జొన్నలగడ్డ లలితాదేవి |
| సాముతారి సంతానం | |
| విష్ణుప్రియ | |
| సుమతి కథ | |
| ఆకాశగంగ | |
| అగ్నిపుత్రి | |

# మరో ముందడుగు

అర్ధరాత్రి వేళ వచ్చిన పీడకలకు చటుక్కున లేచికూచుంది మయూర. ఇటీవల ఇలాంటి పీడకలలు బాగా అలవాటై పోయాయి. ఎందుకో ఏమిటో ఎవరో దీనంగా ఏడుస్తున్నట్లు కల వస్తుంది. అక్కడికి పోవాలని మనసూ శరీరమూ తెగ ఆరాట పడిపోతుంటాయి. అదే సమయంలో ఎటూ కదల లేని ఏదో స్తబ్దత ఆవరించుకొంటుంది. ఆ సంఘర్షణలో మెలకువవచ్చింది.

“టక్! టక్!” తలుపు తడుతున్న చప్పుడు ఇంకా కలగంటున్నానా? అనుకొంది కొంచెంసేపు. కానీ, మళ్ళీ ‘టక్ టక్’మని మరికాస్త గట్టిగా వినిపించింది. కలకాదు. నిజంగానే తలుపు తడుతున్నారు. ఎవరో?

భయం వేసింది. మొదట అత్తగారిని లేపాలనుకొంది. అత్తగారూ, మామగారూ గదిలో పడుకున్నారు. ఈ వయసులో కూడా ఆ దంపతులు అంత అన్యోన్యంగా ఉంటారు. తన అదృష్టమే ఇలా ఉంది!

మళ్ళీ తలుపు చప్పుడు. లేచి లైటు వేసింది అత్తగారి గది తలుపుతట్టి "అత్తగారూ" అని పిలిచింది. ఆవిడ పలకదు. కొంచెం సంకోచించి మరోసారి తలుపుతట్టబోతుండగా తలుపు చప్పుడుతోపాటు, బలహీనంగా "మయూరా!" అన్న పిలుపు వినిపించింది. ఆ పిలుపు వింటూనే సర్వమూ మరిచి ఒక్క అంగలో తలుపు దగ్గరకు వచ్చి తలుపు తెరిచింది. రక్తం ఓడుతున్న బట్టలతో వంటిమీద అక్కడక్కడ కత్తి దెబ్బలతో, తూలుతూ లోపలికి అడుగుపెట్టాడు యతి. కెవ్వున కేక పెట్టింది మయూర.

ఆ కేకకు కమలా ప్రభాకర్ లిద్దరూ లేచిబయటికివచ్చారు. తూలిపోతున్న యతిని తన హృదయానికి ఆనించుకొని 'మామయ్యా!...' అంది మయూర ఏం చెప్పాలో ఎలా చెప్పాలో తెలియక ప్రభాకర్ అదేమీ వినిపించుకోలేదు. యతని రెండు చేతులతో ఎత్తుకుని మంచంమీద పడుకో బెట్టాడు సైకిల్ వేసుకుని ఆ చీకట్లో డాక్టరుకోసం బయలు దేరాడు.

రక్తసిక్తాలైన యతి రెండు చేతులూ తన చేతిలోకి తీసుకుని మంచం దగ్గర కూలబడిపోయింది మయూర. పడు కున్న తరువాత యతి శరీరంమీద గాయాలు మరింత స్పష్టంగా కనిపిస్తున్నాయి. కళ్ళు తిరిగినట్లయి అతని భుజంమీదకి వాలి పోయింది. తెల్లబోయి చూస్తున్న కమలకు ఏమీ అర్థం కావటంలేదు. కత్తిదెబ్బలు, రక్తం.... ఆ వ్యక్తి ఎవరో? ఇక్కడి కెందుకొచ్చాడో? ఈ సందేహాలన్నింటిని మించి ముందుగా ఆమెలో మాతృహృదయమే మేల్కొంది "పాపం! పసిపిల్ల బెదిరి

పోయింది. గాయపడిన వాడిమీదకే పడిపోయింది” అంటూ మయూరను నెమ్మదిగా అతడి భుజం మీదనుండి తప్పించింది. తడి గుడ్డతో అతని గాయాలు తుడవసాగింది. “దాహం!” అన్నట్టు సైగచేసాడు యతి. లేచి వెళ్ళి మంచినీళ్ళు పట్టుకొచ్చి, తననానుకుని కూచోమని, మంచినీళ్ళు తాగించింది. తెల్లని చీరనిండా ఎర్రని రక్తపు మరకలు! తనను తాను చూసుకోగానే ఎందుకో అవ్యక్తమైన భయం కలిగింది. అయినా అతడిని ఆదరంగా దిండుమీద పడుకోబెట్టింది. ప్రక్కన తెలివిలేకుండా పడివున్న మయూరనుచూసి అతని కళ్ళు నిండుకున్నాయి ఆ వెర్రిబాగుల తల్లి “ఏడవకుబాబూ! డాక్టర్ వస్తాడు. నీకు దెబ్బలు తగ్గిపోతాయి.” అని ఓదార్చింది. అతడు మాట్లాడలేక చూపులు మయూరవైపు తిప్పాడు జాలిగా.

ఆవిడ నొచ్చుకుంటూ, “అయ్యో! నామతిమండ నీ దెబ్బలు చూసి మతిపోయి దీనిమాటే మరిచిపోయాను.” అని లేచివెళ్ళి చల్లనినీళ్ళు తీసుకొచ్చి మయూర ముఖంమీద చల్లింది. మయూర కళ్ళు తెరవగానే “ఏమ్మా! రక్తంచూసి భయపడిపోయావా?” అంది. మయూర అత్తగారికి సమాధానం చెప్పలేదు. యతి ముఖంతప్ప మరేమీ కడపడని దానిలా అతనినే చూడసాగింది. కన్నీళ్ళు చెక్కిళ్ళమీదుగా ప్రవహిస్తున్నాయనే స్పృహఅయినా లేకుండా, చూపు తిప్పుకోకుండా అతనినే చూడసాగింది.

“మయూరా! ఒకనాడు నీ సుఖం కోరి, నీ జీవితం

లోంచి దూరంగా వెళ్ళిపోయాను. ఇప్పుడు ఈ దశలో నీ దగ్గరకు వచ్చి నీ సుఖాన్ని పాడుచేస్తున్నానా!"

"నా సుఖం...." ఏదో చెప్పబోయిన మయూర కళ్ళకు ఎదురుగా అత్తగారు కనిపించింది. ఆమె నోరు మూతబడిపోయిం. పైటకొంగు నోటిలో కుక్కుకుంది.

డాక్టర్‌తో ప్రభాకర్ వచ్చాడు.

యతి నీరసంగానే అయినా మాట్లాడగలుగుతున్నాడు. "మీకు శ్రమ. అంతేకాదు! ప్రమాదంఅన్నాడు. "నువ్వా రుకో!" అని కసిరాడు ప్రభాకరం ప్రేమగా. . "అమ్మా మయూరా! ఇలాంటి సమయాల్లోనే ధైర్యం తెచ్చుకోవాలి. అలా ఏడుస్తూకూచోవటంకాదు-రా! కొంచెం సాయంచెయ్యి! ఇతనిప్రక్క లోపల ఏర్పాటు చేద్దాం!" అన్నాడు ప్రభాకర్. మావగారి మాటలతో ఏదో ధైర్యంవచ్చింది మయూరకి. అసలు ప్రభాకర్‌లో వున్న శక్తి అదే! అతడు పక్కనుంటే చాలు, ఎంత నిరాశలో వున్న వారికయినా ఏదో నూత్న చైతన్యం వచ్చినట్లవుతుంది.

వెంటనేలేచి "పక్కలెక్కడ ఏర్పాటు చేయమంటారు?" అంది.

"నీ గదిలో!"

"మయూర నిర్ఘాంతపోయి చూసింది.

"చెప్పినట్లు చేయి, త్వరగా...."

వెంటనే మయూర తన గదిలోనే ప్రక్క ఏర్పాటు చేసింది. డాక్టర్, ప్రభాకర్, ఇద్దరూ అండగా నిలచి, యతని

నడిపించుకొంటూ లోపలికి తీసికెళ్ళారు! మయూర ఏర్పాటు చేసిన పక్క మీద పడుకోబెట్టారు!

"మయూరా! ఇతనికి ఏక్షణంలో ఏ అవసరంవస్తుందో ఇక్కడే కనిపెట్టుకుని ఉండు" అని డాక్టర్ని, మయూరనూ. యతినీ గదిలో వుంచి తలుపులు దగ్గిరగా లాగేసాడు.

"తెల్లబోయి చూస్తూ నిలబడ్డ కమలతో 'కమలా! నీళ్ళు తీసుకురా!' అని నీళ్ళతో రక్తం మరకలన్నీ శుభ్రంగా కడిగి తుడిచేసాడు.

"ఇతనెవరండీ, మీకు తెలుసా?" ఆందోళనగా అడిగింది కమల.

"ఇంతకుముందు తెలియదు. ఇకముందు ఎలానూ తెలుస్తుంది"

ప్రభాకర్ సమాధానానికి చాలా ఆశ్చర్యపోయింది కమల. ఒక్క మొహం ఎరగనివాడి పట్ల ఈ శ్రద్ధ ఏమిటో ఆమెకర్థంకాలేదు. ప్రభాకర్ ఆమెకెప్పుడూ సరిగా అర్థం కాడు. అయినా ప్రభాకర్ చెప్పినట్లు ఇల్లంతా తడి ఆరిపోయేలా గుడ్డతో తుడిచింది.

ఆ సమయంలో వచ్చాడు తూలుకుంటూ వేణు. రోజూ అతడు ఇంటికొచ్చే సమయమే అది.... కాని, ఆ సమయానికి అందరూ నిద్రపోతూ ఉంటారు- ఆ రోజు తల్లిదండ్రులిద్దరూ మెలకువగా ఉండటం చూసి గతుక్కుమన్నాడు

"మీరింకా నిద్రపోలేదా?" అన్నాడు ముద్ద ముద్దగా

ఆదంపతులలో ఏ ఒక్కరూ ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. తమ ఏకైక సంతానాన్ని ఆ స్థితిలో చూసుకొని ఇద్ద

నికీ మనసు చెరువవుతోంది. తలదించుకొని తమ గదిలోకి వెళ్ళబోయాడు వేణు.

"ఆ గదిలోకి వెళ్ళకు. నా గదిలో పడుకో!" అన్నాడు ప్రభాకర్.

"ఎందుకు?"

"అడ్డు ప్రశ్నలు వెయ్యకు! చెప్పినట్లు విను!"

ఆ స్థితిలో కూడా తండ్రి ఆజ్ఞా స్వరాన్ని ధిక్కరించలేక పోయాడు వేణు. పిల్లిలా తండ్రి గదిలోకే వెళ్ళిపోయాడు.

తన కొడుకును అదుపులో పెట్టగలిగే శక్తి వుండీ చేజేతులా పాడుచేసుకొన్నాడు. నిజానికి ఈనాడు వేణు ఇలా తయారవటంలో తన బాధ్యత లేదా? అతని అంతరాత్మ అతని నెప్పుడూ వేధించే ప్రశ్న అది.

డాక్టర్ బయటికి వచ్చాడు.

"ఎలా వుంది డాక్టర్?" అని అడిగాడు ప్రభాకర్.

"గాయాలకు కట్లుకట్టాను. ఏన్టీ సెప్టిక్ ఇంజక్షన్స్ చేసాను. ఏదో బండ కత్తితో పొడిచినట్లుగావుంది రక్తంకూడా చాలా పోయింది. సెడిటివ్స్ ఇచ్చాను. ప్రస్తుతం విశ్రాంతి అవసరం.

డాక్టర్ చేతిలో ఫీజు పెడుతూ "డాక్టర్! ఈ విషయం రహస్యంగా ఉంచండి." అన్నాడు ప్రభాకర్. డాక్టర్ బెదురుగా చూసాడు.

"మీకేం భయంలేదు డాక్టర్! అన్ని విషయాలు నేను చూసుకొంటాను."

"మీరలా హామీయిస్తే నాకు భయందేనికి? నాకు నిశ్చింత. రహస్యంగానే ఉంచుతాను."

"థేంక్యూ డాక్టర్!"

డాక్టర్ వెళ్ళిపోయాడు.

మయూర బయటికి రాబోయింది.

"నువ్వీరాత్రికి ఆ గదిలోనే ఉండమ్మా! ఏ అవసరం వస్తుందో!" అన్నాడు ప్రభాకర్.

"ఆఁ!" అని నోరు తెరిచింది కమల. మయూరకూ అంతే ఆశ్చర్యం కలిగింది. భయమూ కలిగింది.

"పోనీ, మీరు ఉండకూడదూ, ఆయన దగ్గర!" అంది.

"నువ్వు లోపల సపర్యలు చెయ్యగలవు. నేను బయట ఏదైనా హెచ్చుతగ్గులు వస్తే సర్దగలను. ఈ రాత్రి మన మంతా జాగ్రత్తగా ఉండాలి లోపలికి వెళ్ళమ్మా! ఎందుకైనా మంచిది తలుపులు లోపల గడియ వేసుకో!"

రెండు చేతులూ జోడించి మావగారికి నమస్కారంచేసి వణుకుతున్న చేతులతో తలుపులు లోపల గడియ వేసింది మయూర.

అందరూ కళ్ళుమూసుకు పడుకున్నా, ఎవరికీ నిద్ర రావటంలేదు. ఎవరి ఆలోచనలలో వాళ్ళున్నారు. ఒక్క వేణు మాత్రమే నిశ్చింతగా గుర్రుపెడుతున్నాడు. ఈ లోకంలో రెండు రకాలవాళ్ళే అన్నివేళలా నిశ్చింతగా వుండగలరు. పరమ మూర్ఖులు! సంపూర్ణ జ్ఞానులు! చీమచిటుక్కుమన్నా వినిపించే నీరవ నిశీథి! అంతరంగాలలో మాత్రం

సముద్రపు హోరు! తలుపు తట్టినచప్పుడు. కమల, ప్రభాకర్, మయూర, ముగ్గురూ తమ తమ మంచాల మీదనుంచి చటుక్కున లేచి కూర్చున్నారు. ఏదో అనబోతున్న కమల నోటి మీదకి అడ్డుగా వెళ్ళింది ప్రభాకర్ చెయ్యి. తలుపు రెండు మూడుసార్లు తట్టిన చప్పుడు. ఈసారి మరింత బిగ్గరగా తట్టిన చప్పుడు.

"ఆ! వస్తున్నా! అని నిద్రమత్తులో అంటున్నట్లు ముద్ద ముద్దగా అరిచి లేచివెళ్ళి, ఆవులిస్తూ తలుపు తీసాడు ప్రభాకర్. లాటీలతో లోపలికి వచ్చారు పోలీసులు. పాలి పోయిన కమలతో "లోపలికి వెళ్ళి పడుకో," అని చెప్పి "ఏమిటిసార్, ఇలావచ్చారు?" అన్నాడు మరోసారి ఆవులిస్తూ.

సారీ! మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తున్నాం! యాదవ్ దేవ్ గారిని హత్యచేయ్యటానికి ప్రయత్నం జరిగింది. గుండాలు గుంపుగా వచ్చిపడ్డారు. అదృష్టవశాత్తు ఆయన మనుష్యులు హెచ్చరికలోనే ఉన్నారు. వాళ్ళకూ వీళ్ళకూ ఘర్షణ పెరి గింది. ఆ గూండాలలో ఒకడు ఇటుపారిపోయి వచ్చాడని ఆచూకీ తెలిసింది! ఈ సందులో అందరి ఇళ్ళు సోదా చేస్తున్నాం! మీ ఇల్లుకూడా..."

"ఓయస్! నా అభ్యంతరం ఏం లేదు. చూసుకో! అయినా నా సంగతి తెలిసి తెలిసి గూండా మా ఇంటి కెందు కొస్తాడండీ!"

"అఫ్ కోర్స్" మేమూ అదే అనుకున్నాంలెండి. అయినా ఫార్మాలిటీస్ తప్పవుగదా!" చూపులతో చుట్టూ పరిశీలిస్తూనే అన్నాడు పోలీస్ ఆఫీసర్.

"అవునవును! కమాన్!" అంటూ తనే ముందు దారి తీసాడు ప్రభాకర్.

ఆఫీసర్ మరోసారి చుట్టూ చూస్తూ "ఇల్లంతా కడిగినట్లుగా ఉందే!" అన్నాడు.

ప్రభాకర్ జాలిగా ముఖంపెట్టి "మాకోడలు గర్భవతి. ఇవాళే వంటింటి దగ్గర జారిపడి గర్భస్రావమయింది. ఆకారణం చేత ఇల్లంతా కడగవలసి వచ్చింది. ఇంతకు ముందే హాస్పిటల్ నుంచి తీసుకొచ్చాము. డాక్టర్ సెడెటివ్స్ ఇచ్చారు ఆ గదిలో విశ్రాంతి తీసుకుంటోంది. అందుకే మా అబ్బాయి కూడా ఈ గదిలో పడుకున్నాడు" అని మూసి ఉన్న గది తలుపులనూ, ఇంత గందరగోళంలోనూ పక్కగదిలో గుర్రు పెడుతూ పడుకున్న వేణునీ చూపించాడు.

ఆ తరువాత మూసివున్న గది తలుపులను తెరవమని పోలీస్ ఆఫీసర్ అడగలేకపోయాడు. ప్రభాకర్‌కి పెద్ద పదవు లేమీ లేవు కాని, సంఘంలో మంచి పలుకుబడివుంది. ఈ నాటికీ, అతని నీతి నిజాయితీలను, సాహసాలనూ జనం కథలుగా చెప్పుకుంటారు. ఒకనాడు అనేక నిందలకు గురయిన అతని సంఘ సంస్కరణ కార్యాలు కూడా ఈనాడు అతనికి మరింత గౌరవాన్ని తెచ్చిపెట్టాయి. నీతికి నిలబడే మనిషిగా అభ్యుదయ వాదిగా అతనికి చాలా మంచి పేరుంది.

"థాంక్యూ సార్! సారీ ఫర్ ది డిస్టర్బెన్స్" అనేసి పోలీసులు వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయాక ప్రభాకర్ తలుపు బోల్ట్ పెట్టాడు.

కమల గుండెమీద చెయ్యివేసుకుని "హమ్మయ్య" అంది. ప్రభాకర్ నవ్వాడు.

"పిచ్చిదానా! ఈ రోజుల్లో మిగిలిన అన్నీ 'కల్తీ' అయిపోయినట్లుగానే పోలీసులుకూడా కల్తీ అయిపోయారు. వీళ్ళని లొంగదీసుకోవటానికి మొదటి రెండు ఉపాయాలూ— అంటే, సామ దానాలు, ముఖ్యంగా దానం చాలు. మరేం భయంలేదు పడుకో!

కమల వెంటనే పడుకోలేకపోయింది.

"అసలివంతా ఏమిటండీ! ముక్కూ మొహం తెలియని వాడికోసం మీరెందుకింతగా అవస్థపడుతున్నారు? మన కోడల్ని అతణ్ని ఒకగదిలో పెట్టి తలుపులు వెయ్యట మేమిటి?"

"మనకు అతడి ముక్కూ మొహం తెలిసి వుండక పోవచ్చు. కానీ అతడు మన కోడల్ని వెతుక్కుంటూ వచ్చా డంటే మయూరకు అతడు తెలిసివాడవ్వాలి!"

కమల ముఖం అప్రసన్నంగా మారిపోయింది.

'అయితే మాత్రం! ఇద్దరినీ ఒక గదిలో పెట్టి...?"

"ఊఁ? ఒక గదిలో ఉంటే? ఏమవుతుంది? కత్తి పోట్లతో నరకయాతన అనుభవిస్తున్న అతడితో నీ కోడలు కులుకు తుందనా? ఎంత జీవితం చూసినా, నీ అడబుద్ధి పోనిచ్చు కున్నావు కాదు!" తీక్షణంగా పలికింది ప్రభాకర్ కంఠం. కమల ముఖం ముడుచుకొంది.

తలుపులు తెరుచుకొని, మయూర బయటికి వచ్చింది. భార్యాభర్తల సంభాషణ అంతా మయూర విన్నదనటానికి

సాక్ష్యంగా ఆవిడ ముఖం పాలిపోయివుంది. ప్రభాకర్ దగ్గిరకు వచ్చి అతని కాళ్ళకు తల ఆనించి నమస్కారం చేసింది.

"ఛీ ! ఛీ! ఏమిటమ్మా, ఇది? లే!లే!" ప్రభాకర్ లేవ తియ్యబోయాడు. మయూర లేవలేదు. ఆమె కన్నీళ్ళు ప్రభాకర్ పాదాలను కడుగుతున్నాయి.

"ఛీ! ఏమిటమ్మా ఇది? అతనెవరు? నీకెలా తెలుసు?" ఇంత సేపటికి ప్రశ్నించాడు ప్రభాకర్.

మయూర తలెత్తి కళ్ళు తుడుచుకొంది.

వణుకుతున్న పెదవులతో "అతడు మాకు దూరపు బంధువు. కొన్నాళ్ళు మా యింట్లో వుండి చదువుకొనేవాడు. చదువుకొనే రోజుల్లోనే వెంకటయ్యగారి రామదండులో చేరిపోయి చదువు మానేశాడు. చాలా రోజులయింది చూసి..." అంది.

"వెంకటయ్యగారి రామదండులో చేరాడా?...." సాలోచనగా అన్నాడు ప్రభాకర్ "వెంకటయ్యలో ఆవేశం, ఆర్భాటం వున్నంతగా సిన్సియారిటీ కనిపించదు. ఇటీవల అతను విద్యార్థి లోకాన్ని విపరీతంగా రెచ్చగొడుతున్నాడు. ఫలితం ఎలా వుంటుందో?"

మయూర సమాధానం చెప్పలేదు.

"వెళ్ళి పడుకోమ్మా!" అన్నాడు ప్రభాకర్.

"అత్తగారిని కూడా అక్కడ పడుకోమనండి. నేను కింద పడుకుంటాను," తల దించుకుని అంది మయూర.

ప్రభాకర్ హేళన చేస్తున్నట్లుగా నవ్వి "విన్నావా కమలా? కోడలికి కాపలాగా పడుకుంటావా?" అన్నాడు.

ఆ వేళన గుర్తించి కమల మూతి ముడుచుకొని "నాకెందుకూ? నేను చేసిలోనూ కల్పించుకోను!" అని తన పక్కమీద అటు తిరిగి పడుకుంది.

"వెళ్ళమ్మా! వెళ్ళి పడుకో! అతడిని ఈ రాత్రి కాస్త కనిపెట్టివుండు. అవసరమయితే నన్ను లేపు!" వాత్సల్యం వుట్టిపడుతున్నట్లు అన్నాడు ప్రభాకర్. కమల లేచి తన గది లోకి వచ్చేసింది. తలుపులు మూయలేదు. తెరిచే వుంచింది. ప్రమాదం దాటిపోయింది. కింద ఒక చాప పరచుకొని పడు కుంది. ఛాతీనిండా కట్లతో డాక్టరిచ్చిన మత్తు ఇంజక్షన్ కారణంగా మైకంలో వుండికూడా సన్నగా మూలుగు తున్నాడు. మనసుకు కూడా అతీతమైన శరీరబాధ అది!

యతి? ఎలాంటివాడు? ఎలా అయిపోయాడు? ఎక్క డున్నా నవ్వుల జల్లులుకురిపిస్తూ వాతావరణమంతా విద్యుత్పయ స్కాంత శక్తితో నింపేసేవాడు. అలాంటి వాడిని ఇలా చూడవలసి వస్తుందని ఊహించిందా ఏనాడైనా? ఇదంతా దేశంకోసమేనా? ఈ రామదండు, వెంకటయ్య వీళ్ళ వల్ల నిజంగా దేశానికి మేలు జరుగుతుందా? ఈ బలిదానానికి ఫలితం వుంటుందా??

"దూరపు బంధువు. కొన్నాళ్ళు మా ఇంట్లో వుండి చదుకొనేవాడు...." అంతే చెప్పింది మావగారితో. అంతేనా? యతి తనకు దూరపు బంధువు మాత్రమేనా? అన్ని బంధు త్వాలకు అతీతమైన అనుబంధంమాట ఏమిటి? అది ఈనాడు నశించి పోయినట్లేనా? అలా నశించి పోవటమే నిజమయితే ఈనాడు తన మనసు ఎందుకింతగా క్షోభిస్తోంది?

# 3

పల్లె, పట్నం కాని టౌన్ అది! చాలారోజుల వరకూ ఆ టౌన్‌లో కాలేజియే లేదు. హైస్కూలు వరకే ఉండేది. కొందరు పెద్దల సత్సంకల్పంతో ఇటీవలే ఒక కాలేజి నడుస్తోంది. అది కో ఎడ్యుకేషన్ కాలేజి.

రాధాకృష్ణ, జార్జి, మధుసూధనరావు, బాబూరావు వీళ్ళంతా మేనేజింగ్ బాడీ మెంబర్స్. జగపతిరెడ్డి దానికి చైర్మన్. వీళ్ళంతా వి. ఐ. పి లే!

ఏ ఒక్కరూ ప్రత్యక్షంగా పదవులలో లేరు. కానీ, పదవులన్నీ వాళ్ళ గుప్పిట్లోనే వున్నాయి. గవర్నమెంట్ సహాయం పొందుతూ కూడా, రూల్సన్నీ వాళ్ళ ఇష్టం వచ్చినట్లు మార్చుకుంటూ వుంటారు.

"చెలీ! కర్తవ్య దీక్షాబద్ధుడను- నిన్ను పరిత్యజించక తప్పదు-" అని తన పోర్షన్ కంఠతా పట్టేస్తున్నాడు యతి. హావ భావాలు సాధ్యమైనంతగా ప్రదర్శిస్తూ...

యతి పూర్తి పేరు యతీంద్ర. అతడి తల్లి దండ్రులకి అతడొక్కడే సంతానం. ఇద్దరు ముగ్గురు పిల్లలు పోయాక ఇతడు పుట్టాడు. ఇతడు బ్రతికి బాగుపడాలంటే "సన్యాసి" అని పేరు పెట్టమని సలహా యిచ్చారు కొందరు పెద్దలు. ఆధునికుడయిన ఆ తండ్రి పెద్దలమాట కాదనలేకా, మరీ

సన్యాసి వేషం పెట్టలేక, కొంత మథనపడి, చివరకు సన్యాసి వేషం కాస్త నాగరికంచేసి "యతీంద్ర" అని పెట్టాడు.

అందరూ 'యతి' అంటారు. ఆ టౌన్ చుట్టుపక్కల పల్లెటూళ్ళలోని విద్యార్థులందరూ ఆ కాలేజీలోనే చదువుకుంటారు. యతికూడా దూరపు బంధువయిన వేదాంతయ్యగారింట్లో ఉండి చదువుకొంటున్నాడు. వేదాంతయ్యగారి భార్య రాజ్యలక్ష్మి సౌమ్యురాలు కావటంవల్లా, వాళ్ళ అమ్మాయి మయూరకూడా అదే కాలేజీలో చదువుతూండటం వల్లా, యతికి, తన ఇంటికంటే ఈ ఇల్లే బాగుంది.

"ఏయ్ హీరో! చదువులక్కర్లేదా? నాటకాలేస్తూ కూచుంటావా? లేక "కర్తవ్య దీక్షాబద్ధుడవై, కాలేజీని కూడా పరిత్యజించేస్తావా!" తన పోర్షన్ రిహార్సల్ చేసుకుంటున్న యతిని అనుకరిస్తూ, వెక్కిరిస్తూ అంది మయూర.

"పోవోయ్! వెధవ కాలేజి! రాజగోపాల్‌గారు వెళ్ళిపోయాక, ఇంకా కాలేజీలో ఏముంది? చెత్త— చెత్తన్నర చెత్త!...."

మయూర వెంటనే సమాధానం చెప్పలేకపోయింది. ఆమెకూ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. నిజంగా రాజగోపాల్‌గారు ఎంత మంచి లెక్చరర్? ఫిజిక్స్ ఆయన బోధిస్తోంటే, ఎంత మొద్దు బుర్రలకైనా అర్థమయి పోతుంది. పిల్లలతో ఎంత కలిసి మెలిసి వుంటారు? క్లాస్ రూంలో వున్నంతసేపు పరమ గంభీరంగా వుపన్యాసమిస్తారు. ఒక్క విద్యార్థికయినా, మాట్లాడటానికి కాని, అల్లరి చేయటానికి కాని, అవకాశం ఇయ్యరు. ఎవరైనా అల్లరి చెయ్యబోతే పాఠం చెబుతూనే

కోపంగా ఒక్క చూపు చూస్తారు. ఆ చూపులో తీక్షణత ఎటువంటిదో కాని, ఎంత అల్లరి పిల్లవాడైనా టక్కున నోరు మూసేస్తాడు. క్లాసు రూం దాటి బయటకు రాగానే ఆయన లెక్చరర్ కాడు. పిల్లలకు స్నేహితుడు. పిల్లలతో సరదాగా కబుర్లు చెపుతాడు. నవ్వుతూ నవ్విస్తూనే దురలవాట్లు వున్న వాళ్ళని మందలిస్తాడు. ఏయే పుస్తకాలు చదవాలో చెపుతాడు ఏదైనా సందేహం వుంటే ఫ్రీగా చర్చిస్తాడు. చేరిన ఒక్క సంవత్సరం లోగానే అతను మొగపిల్లలకూ, ఆడపిల్లలకు, అన్ని క్లాసులవారికీ, అందరికీ ఆప్తుడయి పోయాడు. అలాంటి లెక్చరర్ని ఆ సంవత్సరం చివరలోనే తొలగించి వేశారంటే, కంట తడిపెట్టని విద్యార్థి లేడు.

రాజగోపాల్ గారిని ఎందుకు తీసేస్తున్నారో ఎవరికీ అర్థంకాలేదు. ఆయననే అడిగారు ఆయన నవ్వి "నాకేం తెలుసూ, నిజాయితీగా వుండడమే ఈ లోకంలో పెద్ద నేరమేమో!" అన్నారు ఆయన. నవ్వుతూనే వున్నారు. విద్యార్థులకు మాత్రం కళ్ళలో నీళ్ళు ఆగడంలేదు. ఆయనే అందరిని భుజం తట్టి ఓదార్చారు.

విద్యార్థినీ విద్యార్థులంతా రైలు స్టేషన్‌కి వెళ్ళి వీడ్కోలు చెప్పారు. అందరి మనసులలోను అది అన్యాయమనిపించింది కానీ, వాళ్ళంతా ఇంటర్ విద్యార్థులు. ఒక్కరికయినా నిండా ఇరవై ఏళ్ళు లేవు– పాపం! ఎవరి నడగ గలరు? ఏమని అడగగలరు ?

రాజగోపాలరావుగారు వెళ్ళిపోయాక ముద్దుకృష్ణ అనే ఆయన లెక్చరర్‌గా వచ్చాడు. విద్యార్థులు త్వరలోనే అతనికి

"మొద్దుకృష్ణ" అని నామకరణం చేసారు. క్లాస్‌లోకివచ్చి స్టేజిమీద నిలబడగానే ఆయనకాళ్ళు వణుకుతాయి, గొంతు పొడారి పోతుంది. పాఠం ప్రారంభిస్తాడు. కంఠతా పట్టినట్లు గబగబ అప్పగిస్తాడు. స్టూడెంట్స్ నానాగోల చేస్తారు. ఈలలూ, పిల్లికూతలూ, దరువులూ వగైరాలతో ఆ విద్యార్థులను అదుపులో పెట్టగలిగే సామర్థ్యం అతనికి లేదు. వాళ్ళ గోల వాళ్ళది. ఈయన పాఠం ఈయనది. దీనితో సిన్సియర్‌గా పాఠం వినాలనుకొనే కొద్దిమందికూడా వినలేక పోతున్నారు.

ఈ సౌభాగ్యానికి తోడు. ఆయన పాఠం చెప్తూ మధ్యలో కంఠతా పట్టింది మరిచిపోతారు. అప్పుడు అటెండెన్స్ తీయటం మొదలుపెడతారు. తన పాఠం గుర్తువచ్చే వరకూ, ఒక్కొక్కరి పేరు సాగదీసి సాగదీసి పలుకుతూ అటెండెన్స్ తీస్తాడు. ఈ లోగా గుర్తు వస్తే మళ్ళీ పాఠం అందుకుంటాడు. గుర్తురాకపోతే, అటెండెన్స్‌తో ఆ రోజు క్లాసు పూర్తవుతుంది.

"ఆ మొద్దు కృష్ణగారి క్లాసుకోసం కాలేజికి పోకపోతే, మా నాటకంలో సీత వేషం వెయ్యరాదూ!"

ఎందుకూ! నీ చేత పరిత్యజింపబడి ఏడుస్తూ కూచోవటానికా? నేను సీత వేషం వేస్తే రాముడు సీతను వదిలెయ్యడు."

"అదెలా? రామాయణంలో అలా లేదు!"

"లేకపోతే పోనీ! పాతపాతిగాథలే తవ్వుకుంటూ కూచోవాలని ఏముంది? మనం కొత్త చరిత్ర సృష్టించకూడదా!"

"ఏడిసినట్టుంది. రామాయణం పాడుచేశామని జనం రాళ్ళు రువ్వుతారు."

"ఏం రువ్వరు. మహాతల్లి సీతమ్మవారు సుఖపడిందని సంతోషిస్తారు."

"మహాతల్లీ! నీకోక నమస్కారం! నువ్వు వేషం వెయ్యక్కర లేదు. కాని, చరిత్ర మార్చకు!"

మయూర వెంటనే కోపం తెచ్చుకుని, మూతి బిగించి "నేను లేకపోతే మీ నాటకంలో సీత, సీతలా వుండదు. శూర్పణఖలా వుంటుంది." అని కాలేజికి బయలుదేరింది. కొంచెం దూరమే వెళ్ళింది. కానీ, యతి లేకుండా వెళ్ళటం ఎలాగో అనిపించింది. సావిట్లో కూర్చుని తనఖాపత్రాలు చూసుకొంటున్న వేదాంతయ్య దగ్గరకువచ్చింది. వేదాంతయ్యది ప్రధానంగా వడ్డీవ్యాపారం. ఎప్పటికప్పుడు ఆ లెక్కలన్నీ చూసుకోవడమే అతనికెంతో ఇష్టమైనపని.

"ఏమమ్మా.. కాలేజిలేదా!" అన్నాడు దగ్గరకు వచ్చి కూచున్న కూతురితో.

"ఉందినాన్నా! కానీ యతి కాలేజికి రాకుండా నాటకాల్లో వేషాలు వేస్తున్నాడు" అని చెప్పింది.

వేదాంతయ్యకు వెంటనే కోపం వచ్చింది. యతి తలిదండ్రులు లక్ష చెప్పి అతడిని తనకు అప్పగించారు. ఇప్పుడతడు చదువుకోకుండా పాడయిపోతే ఆ మాట తనకొస్తుంది. వెంటనే లేచి పెరట్లో జామచెట్టు మొదట్లో కూచుని "చెలీ! కర్తవ్య దీక్షాబద్ధుడనై ...." అంటున్న యతి దగ్గరకు వచ్చాడు.

"ఏగా! నువ్వా నీ కర్తవ్యం! నీ మొదటి కర్తవ్యం కాలేజీకి పోవటం వెంటనే బయలుదేరు,, అన్నాడు.

ఆ కంఠ స్వరం విని హడలిపోతూ లేచి నిలబడ్డాడు, యతి. వేదాంతయ్యనూ, అతని ప్రక్కనమయూరనూ చూడ గానే సంగతి అర్థమయిపోయింది అతనికి. వెంటనే లేచి కంగారుగా "వెళతాను,, మావయ్యా! అన్నాడు అప్పటికే వేదాంతయ్య అక్కడినుంచి కదలక పోయేసరికి హడావుడిగా బట్టలు మార్చుకుని కాలేజికి బయలుదేదాడు చచ్చినట్లు. దారిలో "మామయ్యకు చెప్పావుకదూ!" అన్నాడు గుర్రుగా....

గర్వంగా నవ్వింది మయూర! "లేకపోతే, కాలేజి ఎగ్గొట్టి, నాటకాలు వేద్దామనుకున్నావా. నాటకాలు?" అని వెక్కిరించింది.

మయూరను కాదని తానేమి చెయ్యలేనని అనుభవం మీద తెలుసుకున్నాడు యతి. అంచేత ఎలాగైనా మయూరను కూడా నాటకాల్లోకి దింపితే తప్ప తనకు ఆ "మొద్దు కృష్ణగారినే లెక్చర్ వినే బాధ తప్పదు.

"మయూరా! ప్లీజ్! నువ్వా నాటకంలో వేషం వెయ్యి" అన్నాడు బతిమాలుతున్న గొంతుకలో.

"నేనా చచ్చినా వెయ్యను."

"సరే! నువ్వు వెయ్యకపోతే, మంజులను వెయ్యమంటాను. నేను రాముడు, మంజుల సీత."

మయూర ముఖంలోకి ఓరగా చూస్తూ అన్నాడు. ఆ ముఖంలో అతనికి కావలసిన మార్పులొచ్చేసాయి. మయూ

రికీ. మంజులకీ అన్నింటిలోనూ పోటాపోటీ. ప్రాణస్నేహితు లుగా ఉంటూ అన్నింటిలోనూ పోటీపడుతుంటారు,

యతి రాముడు, మంజుల సీత ఊహించుకొంటూ ఉండగానే మతిపోయినట్లనిపించింది మయూరకి.

మంజుల యతిపక్కన సీతగా నటించడం, మంజుల గర్వంగా తనవంక చూసి నవ్వడం. ఇక ఆపైన ఆలోచించలేక పోయింది.

"నాటకంలో వేస్తాను" అని ఒప్పేసుకొంది

"గుడ్ గాల్"!" అని మయూర వీపు తట్టాడు. మయూర కనుబొమలు చిట్లించి, "ఏయ్!" అనగానే "సారీ" అని గట్టిగా నవ్వేసాడు.

# 4

అయినింటి పిల్లలు నాటకాలలో వేయటం, అదీ, మొగ వాళ్ళ పక్కన ఆడవాళ్ళుగా వెయ్యటం అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ, సర్వ సాధారణం కాదు. అందుకే నాటకంలో వేషం వెయ్యటానికి ఇంట్లో చాలా పోట్లాడవలసి వచ్చింది. చివరకు ఎలాగో సాధించింది.

అయితే రిహార్సల్‌లో ఎప్పటి కప్పుడే మయూరతో ప్రాణ గండంగా వుండేది. మిగిలిన వాళ్ళకి.

యతి పరమ గంభీరంగా "చెలీ! కర్తవ్య దీక్షా బద్ధుడనై నిన్ను పరిత్యజించ వలసివచ్చినది" అనగానే

మయూర తన పోగ్ను మరిచిపోయి, ఛీ! సంఘానికి భయపడి, నా నచ్చేమీ లేకపోయినా, నామీద ప్రేమ ఉన్నా, నన్ను వదిలేస్తావా! అనేసేది.

"నాథా! నాకింక స్వారశిక్షయా? కానిండు! నా హృదయమున ప్రతిష్ఠించుకొన్న మీ పాద పద్మములే నాకు రక్ష!" అని మయూర చేత అనిపించటానికి తాతలు దిగి వచ్చే వారు. కానీ, ఆ మాటలు మయూర రోషంగా అనేది కాని, దీనంగా కాదు. "కర్మ" అని యతి తలకొట్టు కుంటే మరింత రోషంగా "అవును! ఇదంతా కర్మే! చేతు లారా తెచ్చిపెట్టుకొన్న కర్మ" అనేది

నాటకం ప్రదర్శించినప్పుడు జనంలోంచి ఎలాంటి రెస్పాన్స్ ఎదుర్కోవలసి వస్తుందోనని భయపడ్డారు. నాటకం వేస్తున్న అంతరూ. కానీ, తీరా నాటకం ప్రదర్శిస్తున్నప్పుడు మయూర దీనంగా అనటంమాత్రమే కాక, నిజంగానే సొమ్మ సిల్లి పడిపోయింది. మయూరను ఆ అవస్థలో చూసిన యతికీ కళ్ళు చెమ్మగిల్లాయి.

జనంలోంచి చప్పట్లు మార్మోగాయి. ప్రశంసలు కురి సాయి. కానీ, మయూర మాత్రం అనేక విధాల శీతలోప చారాలు చేసాక కాని తెప్పరిల్లలేదు. బహుమతులు అందు కొంటున్నప్పుడు కూడా మయూర ముఖం వడిలిపోయే ఉంది. అది చిన్న టౌన్ కావటంవల్ల నాటకం ప్రదర్శించిన హాలు నుంచి నడుచుకొంటూనే ఇటింకి బయలుదేరారు మయూర, యతి.

"చాలా బాగా నటించావు. ఇంత బాగా చేస్తావని అనుకోలేదు." అన్నాడు యతి.

ఆ ప్రశంసకి పొంగి పోవటానికి మారుగా అతని భుజానికి తల ఆన్చి బావురుమని ఏడ్చేసింది.

"ఏమిటది! ఊరుకో! ఊరుకో!" అన్నాడు, బుజ్జగిస్తూనట్లు యతి.

"ఏమిటో, ఆ సమయంలో, నేను నిజంగా సీతనే అయినట్లూ, నువ్వు నిర్దాక్షిణ్యంగా వెళ్ళ గొట్టేస్తున్నట్లూ అనిపించింది. భరించలేకపోయాను. ఇప్పటికింకా గుండె ఝల్లుమంటోంది!"

మయూరి చుట్టూ చెయ్యి చుట్టి తనకు మరింత దగ్గిరగా తీసుకున్నాడు, యతి.

"నాకు అలాగే అనిపించింది. నిన్ను ఎందుకు వదలాలి? వెధవసంఘం ఏమయిపోతే, ఎవడికి కావాలి? అనిపించింది. పోనీ ఈసారి ఈ నాటకం వెయ్యొద్దు, భవభూతి ఉత్తరరామ చరిత్రలో సీతారాములు తిరిగి కలుసుకున్నట్లుగా వ్రాసాడట! అది వేద్దాం!"

"ఏందయ్యోయ్ ఎంత అలుమగలు కాబోతున్నా, నడిబజారులో కావిలించుకుంటారేటి?" నవ్వుతూ అన్నాడు దారినపోతున్న కనకయ్య.

దానితో బెదిరినట్లనయి ఇద్దరూ ఎడం ఎడంగా జరిగారు. ఒకరినొకరు భయంగా చూసుకన్నారు అంతలో సిగ్గుపడ్డారు. అంతకె ముందెన్నడూ కలగని భావ సంచలన ఏదో లిగింది ఇద్దరిలో.

ఇంటికి వచ్చేసరికి, రాజ్యలక్ష్మి, వేదాంతయ్య ఇద్దరూ ఏదో వాదించుకుంటున్నారు. దక్షిణపు గదిలో. యతి, మయూర ఇద్దరూ, వసారాలోనే ఆగిపోయారు.

"ఆ! మీకు చిన్నతనంలాగానే ఉంటుంది. ఆ వయసుకి నేను కాపురానికి వచ్చేసాను."

"అబ్బబ్బ! ఆ రోజులు మారాయే!"

"ఆ! మారాయి! ఏం మారినా, వయసు పొంగులు మాత్రం మారవు. మీరిలా మీ అమ్మాయి 'చిన్నపిల్ల' అనుకుంటూ కూచోండి– అదేదో వాళ్ళే చేసేసుకొంటారు"

యతికి, మయూరకి పెద్దవాళ్ళు మాట్లాడుతున్న దేమిటో అర్థమైపోయిరింది. ఇద్దరూ ఒకరినొకరు చూసుకో లేకపోయారు. సిగ్గుతో కళ్ళు వాలిపోయాయి చైరోవైపునుంచీ లోపలికి పారిపోయారు.

మయూరని చూడగానే రాజ్యలక్ష్మి సంభాషణ మార్చేస్తూ "ఎంత బాగా వేసావే, వేషం! అచ్చు సీతమ్మ లాగే వున్నావు" అంది.

"యతి కూడా రామయ్యలాగే వున్నాడు" అని చేర్చాడు, వేదాంతయ్య

"సరి! సరి! కాళ్ళు కడుక్కో–! వడ్డిం చేస్తా! ఇప్పటికే ఆలస్యమయిపోయింది–" అని ఇంటింటిలోకి వెళ్ళి పీటలు వాల్చి యతికీ, మయూరకి కంచాలుపెట్టింది అలా పక్క పక్కన కూచుని తినడం ఎప్పుడూవున్న అలవాటే అయినా, ఆరోజు ఎందుకో చాలా విచిత్రమైన స్పందన కలిగింది మయూరలో. అతడి పక్కన కూచోలేకపోతుంది. లేచిపోవ

టానికి శక్తిచాలటంలేదు. యతి మాత్రం మామూలుగా భోజనం చేసేస్తున్నాడు ఓరగా అతనివైపు రెండు మూడు సార్లు చూసింది. అతడు వంచిన తల ఎత్తలేదు.

కంచంలో అన్నీ వడ్డించి, మీరు వడ్డించుకోమని, కూరలూ, పులుసూ, పెరుగూ అన్నీ దగ్గరపెట్టి వెళ్ళి పడు రాజ్యలక్ష్మి.

అందుకోసమే కాచుకుని కూచున్నట్లు అన్నంతింటున్న మయూరను గభాలున తనవళ్ళోకి లాక్కుని ఎంగిలి మూతితో ముద్దుపెట్టుకున్నాడు. తనను తను మరిచిపోయింది మయూర.

"నేను సీతనే! ఏ పరిస్థితుల్లోనూ రాముణ్ని వదలని సీతని!" అంది.

కవ్మని కలలతో నిద్రపోయి మయూరకి అంత కమ్మగానూ తెల్లవారలేదు. గందరగోళంగా ఏవో అరుపులు, కేకలు వినిపించి గభాలున లేచి కూచుంది. ఒక్కక్షణం అంతా అయోమయంగా తోచింది. హృదయవిదారకంగా ఏడుపులు వినిపిస్తున్నాయి.

మయూర మనసంతా కలవరపడిపోయింది. కిటికీ లోంచి బయటకు చూసింది ఎదురింట్లోంచి ఏడుపులు వినిపిస్తున్నాయి.

రాజ్యలక్ష్మి ఎదిరింటికి వెళ్ళటానికి తయారవుతూ మయూర లేవటం చూసి! "లేచావా, నేనే నిన్ను లేపుదామనుకుంటున్నాను. పాపం, సుజాత చచ్చిపోయిందిట! నేను వెళుతున్నాను. చూడటానికి. నువ్వూ ముఖం కడుక్కుని కాఫీ తాగిరా!" అంది దిగులుగా.

అదిరిపడింది మయూర.

"సుజాత—సుజాత—చచ్చిపోయిందా? నిన్నటివరకు బాగానే వుందిగా? నిన్న పొద్దున్న కూడా చూశాను-గుళ్ళో మంగళహారతి కూడా పాడింది.

"ఏం జబ్బోమరి? రాత్రి వాంతులు అయ్యాయట? అంతలో ఏం ముంచుకొచ్చిందో? సరే! నువ్వురా! నేను పోతున్నాను!"

రాజ్యలక్ష్మి హడావుడి పడుతూ వెళ్ళిపోయింది. స్థాణువై నిలచిపోయింది మయూర.

ఆ క్రిందటిరోజే వింది మధురమయిన సుజాత కంఠం అప్పుడే ఏదో విషాదం పలికింది ఆ కంఠంలో. కానీ, దైన్యం సుజాత వ్యక్తిత్వంలో ఒక భాగమయిపోబట్టి, ఆ విషాదాన్ని ప్రత్యేకంగా గమనించలేదు. ఇప్పుడాలోచిస్తేంటే, దీనంగా భగవంతుడికి ఏదో విన్నవించుకొంటున్నట్లుగా వుంది ఆకంఠం సుజాతకు నిన్ననే తెలుసా? తన జీవితం ఇలా ముగిసిపోతుందని ఎలాగో ముఖం కడుక్కుని చీరమార్చుకుని తనూ ఎదురింటికి వెళ్ళింది. సుజాత తల్లి గుండె బాదుకుని ఏడుస్తోంది. సుజాత కూతురు మూడేళ్ళది "అమ్మా! అమ్మా! అని శోషంగా బాధ పడిపోతుంది. ప్రశాంతంగా నిద్రపోతున్నట్లుగా ఉంది సుజాత ముఖం మాత్రం బాగా పాలిపోయినట్లు ఉంది. ఏమయింది సుజాతకి?

మహా మహా సిటీల్లోనే అమ్మలక్కలకి కొదువలేదు. చదువుకున్న వాళ్ళల్లోనే వున్నారు. కావలసినంత మంది అమ్మలక్కలు అలాంటప్పుడు టౌన్సలో అలాంటి వాళ్ళకి

తక్కువేమిటి? శవం అక్కడుండగానే, తల్లిగుండె బాదుకుని ఏడుస్తుండగానే అమ్మలక్కలు బయట గుస గుసలు ప్రారంభించారు.

"రెండు నెలలు కడుపుట! కడుపు తీయించబోతే, ప్రాణమే పోయిందిట!"

"అయినా దీనికిదేం పోయేకాలం?"

"ఆ! వెనకటి రోజులు కావులే! వెధవ ముండలకికూడా పెళ్ళిళ్ళయి పోతున్నాయి!"

"ఆ? అవుతున్నాయి! కన్నెపిల్లలకే పెళ్ళిళ్ళు కానటం గగనంగా ఉంది. ఒక కూతురున్న వెధవముండని ఎవడు పెళ్ళాడతాడు?"

"ఏం ప్రారబ్ధమో! బంగారంలాటి పిల్ల,"

"చాల్లేదూ? బంగారంలాంటి దయితే ఈ అవస్థ ఎందుకొస్తుంది?"

ఈ గుస గుసలన్నీ ఇంచుమించు అక్కడున్న అందరి చెవుల్లోనూ పడుతున్నాయి. చూడటానికి వస్తున్న వాళ్ళలో సానుభూతి కంటే కుతూహలమే ఎక్కువవుతోంది.

"ఎప్పుడు పోయింది? ఎలా పోయింది? డాక్టర్ కి చూపించారా? ఇంత అకస్మాత్తుగా ఎలాముంచుకొచ్చింది?" ఇలాంటి ప్రశ్నలను ఎదుర్కోవలసి వస్తోంది ఆ కుటుంబం. తల్లికి కూతురు పోయిన దుఃఖంతో పాటు ఈ పరిస్థితి దుర్భరంగా వుంది. అందరిమీదా, చివరకు తనమీద తనకు కూడ పట్టరాని కోపం పొంగుతోంది. ఆ తల్లి మనసులో. ఎంత కోపం

వచ్చినా, మరింత కుమిలి కుమిలి ఏడవడంతప్ప చేయగలిగిందే ముంది.

అప్పటికి మయూర వయస్సు పదిహేనేళ్ళు. పరిస్థితి లీలగా అర్థమయింది. హడిలిపోయింది. బెంబేలుగా అందరినీ చూసింది. కళ్ళు మూసుకు పడుకున్నట్లున్న సుజాత శవం చూడగానే, అంతక్రితం రోజు విన్న సుజాత పాట గుర్తొచ్చి కళ్ళు తిరిగి పడిపోయింది,

"హయ్యో! హయ్యో!" అని రాజ్యలక్ష్మి గుండెలు బాదుకుంటూ మరో యిద్దరి సాయంతో మయూరను తీసుకొచ్చి ఇంటిలో పడుకోబెట్టింది. వేదాంతయ్య డాక్టర్ కోసం పరుగుత్తాడు.

మయూర కళ్ళు తెరిచేసరికి తనమీదకి కొద్దిగా వంగి ఆదుర్దాగా చూస్తున్న యతి కనిపించాడు. "యతీ! సుజాత-" అని ఏదో అనబోతుండగా డాక్టర్ "హుష్" అని వారించాడు. "ఆ విషయం మరిచిపోతల్లీ!" అంది రాజ్యలక్ష్మి ఏడుపు గొంతుకతో. యతి అభిమానంగా లాలనగా, చేతిని నొక్కాడు.

మయూర కోలుకోవటానికి వారంరోజులు పట్టింది ఈ వారం రోజులలోనూ యతి ఎందుకో ముభావంగా ఉన్నట్టుగా అనిపించింది భయం వేసింది.

"యతీ! నా మీద కోపం వచ్చిందా?" అంది.

"నీ మీద కాదు. మనచుట్టూ ఉన్న అందరిమీదా మంటగా వుంది, వీళ్ళందరినీ చూస్తూ ఏం చెయ్యలేని నామీద నాకు అంతకంటే మంటగా వుంది."

"యతీ!"

"మయూరా! నువ్వింకా అర్థం చేసుకోవటంలేదు. మనం వుంటున్న సమాజం ఎంత నికృష్టంగా వుందో అర్థం చేసుకోగలిగితే, మనం సిగ్గుతో చచ్చిపోవాలి. సుజాత చచ్చిపో లేదు. హత్యచేశారు. కన్న తల్లిదండ్రులే అతిప్రేమగా హత్య చేసారు!"

"అలా మాట్లాడకు యతీ!

"నిజాలు వినటానికీ. తెలుసుకోవటానికీ భయపడ కూడదు మయూరా! పూర్తిగా విను. పాపం! సుజాత రెండు నెలల గర్భవతి_ కడుపు పోవటానికి ఏదో నాటు మందు తిని పించింది తల్లి. అయుకురాలైన సుజాత నిండు జీవితం నిలువునా ఆహుతయిపోయింది. పరువు మిగిలింది! తల్లిని పొగొట్టుకుని "అమ్మా" అని అడలిపోతున్న ఆ పసి కూన మిగిలింది!"

కానీ...కానీ....ఈ పరిస్థితుల్లో ఆ తల్లి మాత్రం అంతకంటే ఏం చెయ్యగలదు యతీ?"

"మయూరా! నువ్వు అడదానివి—చదువుకున్న దానివి....నువ్వుకూడా ఇలా మాట్లాడుతున్నావా?

యతి చూపులకు నిలువునా వణికి తలెత్తలేకపోయింది మయూర.

సుజాత గర్భవతి అయితేనేం? బిడ్డను ప్రసవిస్తే నేం? తన బిడ్డను తనే పోషించుకుంటుంది. అందుకు బలవంతాన ప్రాణాలు తీయాలా? ఇష్టమైతే ఎవరినో ఒకరిని పెళ్ళి చేసు కుంటుంది. లేకపోతే లేదు,"

"యతీ! నీమాటలు వినటానికి బాగున్నాయి కాని మన సమాజంలో అది సాధ్యంకాదు."

"ఎందుకు కాదూ? మనందద్దమ్మలం కనుక, "కళ్ళున్న గుడ్డివాళ్ళంకనుక" చెవులు మూసుకొన్న చవటలం కనుక! మనసు పనిచెయ్యని మర బొమ్మలం కనుక! మనం గట్టిగా తలచుకొంటే ఈ సమాజం ఎందుకు మారదూ?"

యతి ఉద్రేకం చూసి హడలిపోయి బెదురుగా చూసింది మయూర!

"ఎక్కడో చదివినట్లు- పిరికివాడై ప్రతిక్షణం చచ్చే చచ్చేకంటే, సాహసంతో ఒక్కసారి చావటం మేలు! ఛ! ఛ!" చరచర వెళ్ళిపోయాడు యతి.

అతడిని ఆపుచేయాలనీ ఏమేమో చెప్పాలనీ, ఎంత గానో అనిపించింది మయూరకు,

కానీ ఆ పసి మనసుకి ఆ సమయంలో తను చెప్పాలనుకున్న దానికి భాష దొరకలేదు. యతి తనకంటే ఎంతో ముందుకు పోతున్నట్లు అనిపించింది. ఏం చెయ్యాలో తోచని అయోమయస్థితిలో బిత్తరిపోయి నిలబడి పోయింది.

# 5

మయూర, యతి ఇద్దరూ ఇంటర్ ప్యాసయ్యారు. ఆ సంవత్సరమే ఆ కాలేజీలో బి. ఏ. కూడా ప్రారంభించారు. రాజ్యలక్ష్మిలో ఇంకా పాత కాలపు సంప్రదాయపు వాసనలు

పూర్తిగా నశించలేదు. మయూరకు వెంటనే పెళ్ళి చేసెయ్యాలని ఆవిడ కోరిక. వెంటనే యతిలోనూ, తలిదండ్రులతోనూ సంప్రదించమని భర్తను ఊదర కొట్టింది. వేదాంతయ్యకు కూతుర్ని ఇంకా చదివించాలనే ఉంది. కానీ భార్య నోటికి భయపడి ముందు యతిని కదిలించి చూసాడు.

"నాకు పెళ్ళా?" అన్నాడు నిర్ఘాంతపోయినట్లు యతి. ఆ తర్వాత అదేదో పెద్ద హాస్యమయినట్లు నవ్వేశాడు.

"చదువు పూర్తయి తన కాళ్ళమీద తను నిలబడకుండా పెళ్ళి చేసుకొనే వెర్రివాళ్ళెవరుంటారు మావయ్యా?" అన్నాడు, సంగతి తేల్చేస్తూ. వేదాంతయ్య తగ్గిపోయినా, రాజ్యలక్ష్మి వూరుకోలేదు. "అయితే! అమ్మాయికి మరో సంబంధం చూసుకోమంటాడేమో, అడగండి" అంది బెదిరిస్తున్నట్లు.

"మీ ఇష్టం" అన్నాడు యతి, అతి మామూలుగా.

"ఆ!" అని నోరు తెరిచేసింది రాజ్యలక్ష్మి. తర్వాత కూతురితో "యతి నీకు వేరే సంబధం చూసుకోమన్నాడు. మీ నాన్నగారిని ఈరోజు నుంచే మంచి మంచి సంబంధాలు చూడమంటాను. వీడిని తలదన్నే సంబంధం వస్తుంది" అంది మయూర తల్లిని చూస్తూ "నేనంతా విన్నాను. యతి యిప్పుడప్పుడే పెళ్ళిచేసుకోనన్నాడు. అంతే! నేనూ చేసుకోను. చదువుకుంటాను" అంది. దిమ్మెర పోయింది రాజ్యలక్ష్మి. తన కూతురు- తను పసిపిల్ల అనుకొంటున్న మయూర- తన ఎదుట నిలబడి ఇంత సూటిగా తన పెళ్ళి విషయం మాట్లాడుతుందని అనుకోలేదు. ఆ తర్వాత ఆవిడ మరో బేరానికి

దిగింది. "మయూరను కూడా చదివిస్తాం! చదువు అయ్యాక అయినా, మయూరనే ఖచ్చితంగా పెళ్ళిచేసుకుంటానని మాటియ్యమనండి" అని దీనికి యతి లొంగలేదు. "ఎప్పటి సంగతో ఇప్పుడెలా మాటియ్యగలను? అప్పటి సంగతి అప్పుడు నిర్ణయించుకోవలసిందే!" అన్నాడు

"చూసావా? వీడిలా మాట్లాడుతున్నాడు? ఇట్లాంటి వాడిని నమ్ముకుంటానంటావు లక్షణంగా నామాట విని..." తల్లి మాట్లాడుతుండగానే అక్కడి నుంచి లేచి పోయింది మయూర. కానీ, యతి అలా మాట్లాడటం మయూరకూ కష్టంగానే ఉంది. ఇప్పుడు పెళ్ళిచేసుకోమంటే, చదువు పూర్తి కాకుండా పెళ్ళిచేసుకోననటం బాగానేఉంది. కానీ జీవితంలో స్థిరపడ్డాకయినా, తననే చేసుకుంటానని వాగ్దానం చేయక పోవటంలో అర్థం ఏమిటి? కొంపదీసి అతని మనసులో వేరు వేరు ఉద్దేశాలేమైనా ఉన్నాయా? మయూరలో రోషమూ దుఃఖమూ కలిగాయి ఇంట్లో ఎవరూ లేని సమయం చూసు కొని సమయం చూసుకొని, చదువు కుంటున్న యతి దగ్గరకు వచ్చింది. అదేం పుస్తకమా అని రహస్యంగా చూసింది. 'పాలక వర్గాలలో అవినీతి' "ఇదేమిటి? ఈ పుస్తకం ఎందుకు చదువుతున్నావు నువ్వు అప్రయత్నంగా అనేసింది. యతి పుస్తకం మూసి వెనక్కు తిరిగి, మయూరను చెయ్యి పట్టు కొని ముందుకు లాగాడు. మయూర కోపంగా చెయ్యి విది లించుకుంటూ "నన్ను వదులు" అంది

"ఎందుకంత కోపం!" చెయ్యి వదలకుండానే, నవ్వుతూ అడిగాడు యతి.

"ఎప్పటికైనా నిన్నే పెళ్ళి చేసుకుంటానని మాటివ్వ లేని వ్యక్తికి నా చేయి పట్టుకునే అధికారం లేదు."

"ఓహో! అదా? అయితే మాటిచ్చాననుకో! అప్పుడు నాకు అధికారం వస్తుందా ?"

మయూర పెదవులపై చిరునవ్వు తొణికిసలాడింది.

"సరే, మాటిచ్చి తప్పాననుకో ! అప్పుడేం చేస్తావు ? నా మీద దావా వేస్తావా ?"

మయూర ముఖం వెలవెలపోయింది, కళ్ళలో నీళ్ళు కూడా తిరిగాయి.

రోషంగా "ఇలాంటి ఉద్దేశాలున్న వాడివి నన్నెందుకు పాడుచేసావ్ ?" అంది.

"నేనా ? నిన్ను పాడుచేసానా ?"

"గుర్తులేదా ? ఆ రోజు రాత్రి అన్నం తింటున్నప్పుడు..."

"అదా ?" నవ్వాడు యతి. "అంటే ముద్దు పెట్టుకున్నంత మాత్రాన మనుష్యులు పాడయిపోయినట్లే నన్న మాట! మనసులో ఇలాంటి అభిప్రాయాలు జీర్ణించుకోబట్టే పాపం, సుజాత నిండు ప్రాణాలు బలి పెట్టింది. ఇకనైనా ఈ ధోరణిలో ఆలోచించడం మానవా నువ్వు ?"

మయూర బెదురుగా చూసింది. మయూర చెయ్యిపట్టి గుండెలమీదకు లాక్కుని మయూర చుట్టూ తన చేతులు వేసాడు యతి.

"పిచ్చి మయూరా ! నా స్పర్శలో, నా కళ్ళల్లో, నా మాటల్లో, నా మనసులో ప్రేమ నీకు అర్థం కావటం

లేదా! అయినా ఒక్క విషయం అర్థం చేసుకో! ఏ కారణం వల్లనయినా, ఎవరితోనయినా, శారీరక సంబంధం ఏర్పడి నంత మాత్రాన శరీరం ఏదో అపవిత్ర మయిపోయినట్లు నువ్వు భావించనక్కర్లేదు. మన జీవితంలో జరిగే అనేక సంఘటనల్లో అదీ ఒక సంఘటన! అంతే! అంతకుమించిన ప్రాధాన్యత దానికియ్యనక్కరలేదు."

అతడు మాట్లాడుతున్నది ఏ భాషో తనకు అర్థం కానట్టు అయోమయంగా చూసింది మయూర. యతి సర దాగా మయూర తలమీద మొట్టి "వేషం మారింది. మను సులు మాత్రం—అబ్బే! అలనాటి త్రేతాయుగంలోనే వున్నాం!"

కొద్దిపాటి తర్జన భర్జనల తర్వాత, మయూర కూడా కాలేజిలో చేరి బి. యస్. సి. చదవటానికి నిర్ణయమయి పోయింది. యతి, మయూర కలిసి వెళ్ళేవారు. కలసి వచ్చే వారు. వాళ్ళు కాబోయే దంపతులని అందరికీ తెలిసినా వాళ్ళు జంటగా వెళ్తుంటే. విడ్డూరంగా చూడటం, చెవులు కొరుక్కోవటం మానలేదు, ఊళ్ళో అమ్మలక్కలు. "మన వడు పుట్టాక చేస్తుందేమో రాజ్యలక్ష్మమ్మ కూతురి పెళ్ళి!" అని కూడా అనేవారు కొందరు. ఈ సమయంలో చేరాడు వేణు కాలేజీలో. అతని తల్లి పక్కనున్న పల్లెటూరిలో వుండేది. బాగా డబ్బున్న వాళ్ళని అతని వాలకంబట్టి తెలు స్తుంది. హాస్టల్లో వుండేవాడు. మెడలక్రింద వరకూ వేలాడు తున్న జుట్టూ, సైడ్‌లాక్స్, బెల్ బాటమ్స్, ఎప్పుడూ చేతిలో సిగరెట్టూ - ఇదీ అతని వేషం! ఆడపిల్లల్ని నిక్

నేమ్స్ పెట్టి ఏడిపించేవాడు. తన మోటర్ సైకిల్‌ని వాళ్ళ దారికి అడ్డంగా నడిపించేవాడు, ఈలలు వేసేవాడు. ఆడపిల్ల లంతా ఇతడికి కీచకుడు అని పేరు పెట్టారు.

ఇతనిమీద ప్రిన్సిపాల్‌కి చాలా రిపోర్ట్సు పోయాయి. కానీ, చర్య ఎందుకు తీసుకోలేదో, అందరికీ ఆశ్చర్యమే!

ఒకసారి లైబ్రరీలోకే సిగరెట్ కాల్చుకుంటూ వచ్చాడు. లైబ్రేరియన్ అడ్డు చెప్పాడు. వేణు వినిపించుకో లేదు.

"నా యిష్టం! నువ్వెవ్వడివి చెప్పటానికి?" అన్నాడు నిర్లక్ష్యంగా పొగ వదులుతూ. ఆ సమయంలో యతికూడా రీడింగ్ రూంలోనే ఉన్నాడు. ఏదో రిఫరెన్స్ బుక్ తీసుకుని నోట్స్ వ్రాసుకుంటున్నాడు. ఈ గలభాకు తలెత్తి చూసి సంగతి తెలుసుకున్నాడు. వేణు దగ్గరకు వచ్చాడు. "మిస్టర్ వేణూ! ఇది నీ ఇల్లు కాదు - నీ ఇష్టం వచ్చినట్లు ఉండ టానికి! కాలేజీలో, ముఖ్యంగా రీడింగ్ రూంలో కొన్ని నియమాలు పాటించి తీరవలసిందే! లైబ్రరీలో సిగరెట్ కాలిస్తే, ఒకవేళ ఏ అగ్నిప్రమాదమైనా సంభవిస్తే అన్ని విధాలా ఎంత నష్టమో ఆలోచించావా?"

యతి ఇంత అనునయంగా మాట్లాడినా వేణులో పొగరు తగ్గటానికి బదులు మరింత హెచ్చింది. దర్జాగా మరో సిగరెట్ వెలిగించి "ఐ డోంట్ కేర్! మా ఫాదర్ తలుచు కుంటే ఇలాంటి లైబ్రరీలు పది కొనగలడు..." అన్నాడు.

యతికి మండిపోయింది. ప్రతిదానికీ "మా ఫాదర్ తలుచుకొంటే..." అని గొప్పలు చెప్పుకోవటం వేణుకి

అలవాటై పోయింది. వేణు చెయ్యి పట్టుకుని బర బర లైబ్రరీ బయటికి ఈడ్చుకుపోయి గుమ్మానికి అడ్డంగా నిలబడి "మీ ఫాదర్ తల్చుకుంటే ఏమైనా చెయ్యగలడు కాని పశువులా మారిన నిన్ను మనిషిలా చెయ్యలేడు. ముందు మనిషిలా ప్రవర్తించడం నేర్చుకో!" అన్నాడు. "యూ బ్రూట్" అంటూ చెయ్యి ఎత్తబోయాడు వేణు. ఆ చేతిని గట్టిగా పట్టుకున్నాడు యతి. అంతలో నలుగురయిదుగురు స్టూడెంట్స్ యతికి బాసటగా చొక్కా చేతులు పైకి మడుచుకుంటూ యతికి అటూ ఇటూ వచ్చి నిలబడ్డారు.

తను తన డబ్బుతో హోటళ్ళకూ, సినిమాలకు తీసి కెళ్ళిన స్నేహితులకంటే, యతికున్న స్నేహితుల అండ తక్కువేమీ కాదని అర్థం చేసుకున్న వేణు అప్పటికి తగ్గిపోయి, "చూస్తాను నీ సంగతి" అంటూ ధనా ధనామని అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు. యతి, అతని మిత్రులూ, ఒకరి ముఖం మరొకరు చూసుకుని నవ్వుకున్నారు.

"పిరికి దద్దమ్మలాగ పారిపోతున్నాడు. కాని, తరువాత చూస్తాట్ట! సంగతి ఏమిటో!" అన్నాడు ఒకడు. మిగిలిన వాళ్ళు నవ్వారు.

సాధారణంగా యతి, మయూర కలిసివెళ్ళి, కలిసి రావటంవల్ల వేణుకి మయూరని ఏడిపించే అవకాశంరాలేదు. అక్కడికీ, యతి పేరూ, మయూర పేరూ కలిసి అన్ని గోడల మీదా వ్రాయించాడు, బోలెడు ఖర్చుపెట్టి. కానీ, జంటగా ఉన్న తమ పేర్లను చూసి యతి, మయూర బాధపడటానికి

బదులు నవ్వుకొంటూ పోవటంతో, అతని ప్రయోజనం నెర వేరలేదు.

ఆ రోజు మయూర ఎక్స్‌పెరిమెంట్ త్వరగా అయిపోయింది. "యతీ! నా కివాళ ఇంట్లో కొంచెం పనుంది. నేను త్వరగా వెళ్తాను" అంది. యతికి రిజల్టు రావటం లేదు. అతను తన ఎక్స్‌పెరిమెంట్‌లో మునిగిపోయి తలకూడా ఎత్తకుండానే "వెళ్ళు!" అన్నాడు. మయూర ఒంటరిగా బయలు దేరింది. దారిలో వేణు తారసిల్లాడు. హడిలిపోయింది. మయూర భయపడ్డట్టుగానే వేణు హుషారుగా ఈల వేసాడు. చాలా రోజులకి ఒంటరిగా కనపడ్డ మయూరని ఏడిపించకుండా అతడు వదిలిపెట్ట దలుచుకోలేదు. తన మోటార్ సైకిల్‌ని మయూర దారికి అడ్డంగా ఆమె ముందుకు పోవటానికి వీలు లేకుండా పాములాగా మెలికలు తిప్పుతూ నడిపిస్తూ "మయూరీ! నాట్యమయూరీ! నను కనుకరించవే వయారీ!" అని వెకిలి నవ్వుతో కవిత్వం చెప్పటం మొదలుపెట్టాడు. అతని మిత్రబృందం అతనికి కొంత దూరంలో వెకిలినవ్వుతో కోతులా పిచ్చి గెంతులాంటి నాట్యాలు చేస్తున్నారు. మయూర పెదవులు బిగబట్టి కన్నీళ్ళాపుకుంటూ ఎలాగైనా అతడిని తప్పించుకుని ముందుకు పోవాలని చూస్తోంది అర గంట గడిచినా మయూర ఆరడుగులు కూడా ముందుకు వేయ లేకపోయింది.

అంతలో సుడిగాలికి ఎగిరిపడ్డట్టు మోటారు సైకిల్‌తో సహా వేణు రోడ్డుపక్క గుంటల్లోకి ఎగిరి పడ్డాడు. అదృష్ట వశాన మోటారు సైకిల్ అతనిపైన పడలేదు. కాని,

గుండెలోతుల్లో అరిచి వెంటనే లేవలేకపోయాడు. బైర్లు కమ్మిన అతని కళ్ళు చూడగలిగే సరికి ఎదురుగా యతి నిలబడి వున్నాడు ఆ పరిస్థితిలో సహితం వేణు పళ్ళు నూరుతూ "నీ సంగతి..." అనబోయాడు. యతి నిరసనగా నవ్వి "నా సంగతి తరువాత చూద్దువుగాని, ముందు డాక్టర్ దగ్గిర కెళ్ళి నీ సంగతి చూసుకో" అని మయూర చెయ్యి పట్టుకుని చకచక ముందుకు తీసుకుపోయాడు. యతిని ఎదుర్కోవాలో, వేణుకి సాయం చెయ్యాలో తెలియక అటూ ఇటూ చూస్తూ నిలబడ్డ స్నేహితులు "వెధవల్లారా! నన్ను లేవతియ్యండిరా!" అన్న వేణు అరుపుకి అదిరిపడి అతడిని లేవదీయడానికి వెళ్ళారు.

ఇంటికి వెళ్ళేవరకూ యతి, మయూర ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. ఇల్లు చేరుకోగానే మయూర ఇక నిగ్రహించుకోలేక తల్లిని కౌగిలించుకుని ఏడ్చేసింది.

"ఏం జరిగింది? ఎందుకేడుస్తున్నావు?" అని అడిగింది రాజ్యలక్ష్మి గాబరాగా. మయూర ఏడుస్తూనే జరిగింది చెప్పింది. రాజ్యలక్ష్మి తనెన్నడూ చూడని ఆ వ్యక్తిని శాపనార్థాలు పెడుతూనే "ఆ మొగవాళ్ళ కాలేజీలో చదువులొద్దే అంటే విన్నావూ?" అని దెప్పిపొడిచింది. యతి నవ్వి "అలా బుద్ధి చెప్పు అత్తయ్యా!" అన్నాడు. మయూర కన్నీళ్ళ మధ్య కోపంగా చూసింది.

"లేకపోతే ఎందుకా చేతకాని ఏడుపులు? అసలు మీ ఆడపిల్లల పి మీ అవస్థలన్నిటికీ కారణం.

మీరంతా కలిసి ఆ రోగ్ మీద ప్రిన్సిపాల్‌కి రిపోర్టు ఇవ్వకూడదూ."

కోపం ఎక్కువై మయూర దుఃఖం ఎగిరిపోయింది

"యతీ! అతి తెలివి చూపించినట్టు-ఇంత వరకూ వేణు మీద ప్రిన్సిపాల్‌కి అనేక రిపోర్టులు చేరాయి. అవన్నీ ఏ చెత్త బుట్టలో చేరాయో, ఇవీ అక్కడికే చేరుకుంటాయి. నిష్కారణంగా మేము అల్లరిపడటం మాత్రమే మిగులుతుంది. రావణుడు-రాముడుగా మారిపోవటానికీ, మొగపిల్లలలో అల్లరిపడ్డ ఆడపిల్ల హీరోయిన్‌గా చెలామణి కావటానికీ ఇది తెలుగు సినిమా కథ కాదు. శరత్ బాబు నవల అసలే కాదు. నా సంగతి వదిలెయ్! మీరంతా ఏం చేస్తున్నారు? ఒక్క రౌడీకి బుద్ధి చెప్పలేరా?"

ఛాలెంజ్ చేస్తున్నట్టు అడిగింది,

"అవకాశం వచ్చినప్పుడల్లా బుద్ధిచెప్తూనే ఉన్నాను."

"అది చాలదు...వాడిని ఈ కాలేజిలో నుంచి. ఈ టౌన్‌లోంచి వెళ్ళగొట్టాలి!"

"పాపం నిష్కారణంగా చదువుపాడు కాదూ?"

"ఆ! ఇప్పుడు వాడు చదివి వెలగ బెట్టేస్తున్నాడు, వాడుపోతే, మిగిలిన వాళ్ళ చదువులన్నా బాగుపడతాయి."

మయూర మాటలు యతి మనసు మీద బాగాపని చేసాయి. అతను ఈ విషయంలో ఏదో ఒకటి చెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

యతి నాయకత్వంలో విద్యార్థుల ఆందోళన ప్రారంభమైంది—"వేణును తొలగించాలి!" "డిస్మిస్ వేణూ!" "దౌర్జన్యం నశించాలి!" అంటూ రకరకాల స్లోగన్లు గొంతు చించుకొని అరుస్తున్నారు. విద్యార్థులు అయితే ఈ ఆందోళనలో విద్యార్థులంతా పాల్గొలేదు. వేణు గ్రూప్‌కూడా తక్కువ లేదు. వాళ్ళంతా "యతి డౌన్‌డౌన్!" ఒకరు మరొకరి పేర హెక్కులు తొలగించలేరు." "నో బడి కేన్ డిస్మిస్ వేణు" అని అరుస్తూ యతి బృందాన్ని ప్రతిఘటించారు.

రెండు బృందాలకూ ఘర్షణలుకూడా ప్రారంభమయ్యాయి. కొందరు గాయపడ్డారు.

విద్యార్థులలోనూ రకరకాలు, కొందరుఉత్సాహంగా ఈ గలాటాలో ఏదో ఒక వైపుకిచేరిపోయారు. కేవలం సరదాకి! మరి కొందరు బయటనిలబడి వింత చూస్తున్నారు. మరికొందరు బుద్ధిమంతలు అనవసరంగా చదువులు పాడయి సందుకు మథనపడుతున్నారు. విద్యార్థినులెవరూ క్లాసుల్లోంచి బయటకు రావటం లేదు. కాలేజీ మూతపడింది. కాలేజీ గేటు ముందు తిరునాళ్ళలా తయారయింది. పల్లి, బటానీలు, సోడాలూ. అమ్మకునేవాళ్ళ గిరాకీ పెరిగింది. ఘర్షణ తీవ్రమయింది. ఇక పరిస్థితి అదుపు తప్పిందని మేనేజ్‌మెంట్ పోలీసులను రంగంలోకి పిలిపించింది. బాష్పవాయువు ప్రయో

గాలూ, లాఠీ ఛార్జీలూ మొదలైనవి ప్రారంభమయ్యాయి. విద్యార్థులలో చాలా మందిని అరెస్టుచేసారు-వాళ్ళలో యతి కూడా వున్నాడు. అంతవరకూ విద్యార్థులలో వున్న వుత్సాహం, వుద్రేకం, అరెస్టుకాగానే చప్పబడిపోయాయి. అందరిలోనూ ఏదో పిరికి తనం బయలుదేరింది. యతి తప్ప మిగిలిన అందరూ క్షమాపణ పత్రాలు రాసిచ్చేసి విడుదలయిపోయారు. తన చుట్టూ వున్న మనుష్యులనూ, సంఘాన్నీ చూసి నివ్వెరపోయాడు యతి-చివరకు యతి ఒక్కడే లాకప్‌లో మిగిలాడు. వేణు ప్రత్యేకంగా పనికట్టుకొని లాకప్‌లో వున్న యతిని చూడటానికి వెళ్ళాడు. గుబురుగావున్న జుట్టును చేత్తో పైకి తీసుకుంటూ గర్వంగా నవ్వి "హల్లో మిస్టర్! ఎలా వున్నారు? అన్నాడు వెటకారంగా...యతి మనసు రగిలిపోయింది-దుర్మార్గుడు. ఆడపిల్లలను ఏడిపించే రౌడి, చదువు సంధ్యల్లో ఏ మాత్రమూ శ్రద్ధలేని తిరుగుబోతు, దర్జాగా గర్వంగా నిలబడి తన నిలా ప్రశ్నిస్తున్నాడు-ఏ తప్పూ చెయ్యక న్యాయంకోసం పోరాడిన తను కటకటాల వెనుక వున్నాడు! కటకటాలను కసిగా గట్టిగా పట్టుకుని "తొందరపడకు మిస్టర్! నేనూ నీ దగ్గరికి వచ్చి 'లా వున్నావు?" అని కుశల ప్రశ్నలు వేసే రోజు వస్తుందిలే" అన్నాడు-వేణు మరింత గర్వంగా నవ్వి "ఆఫ్‌కోర్స్ అసలు నువ్వు ప్రాణాలతో జైలునుండి బయటికివస్తే" అని విలాసంగా గిర్రున తిరిగి చెయ్యి ఊపి వెళ్ళిపోయాడు.

మయూరి అవస్థ వర్ణనాతీతం-అనవసరంగా యతిని రెచ్చగొట్టినందుకు తనను తాను ఎన్ని రకాలుగానో తిట్టు

న్నది. విషయం ఇలా చిలికి చిలికి గాలివాన అయినందుకు ఆందోళనతో ఆమెకు తిండి సహించటంలేదు. కంటికి కునుకు రావటంలేదు. అరెస్టు చేసిన వెంటనే రాజ్యలక్ష్మి వద్దువద్దం టున్నా వినకుండా యతిని చూడటానికి వెళ్ళింది. అతడిని చూస్తున్నంతసేపూ ఏడుపు నిగ్రహించుకోవటమే తప్ప ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయింది. మయూరకు ఎన్నో కొన్ని ఓదార్పు మాటలు చెప్పగలిగే శక్తి ఆ సమ యంలో యతికి లేకపోయింది.

"నాన్న! ఎలా అయినా యతిని విడిపించు నాన్నా! లేకపోతే ఆ పాపమంతా నన్ను చుట్టుకొంటుంది" అని తండ్రి దగ్గర పసిపిల్లలా బావురుమంది..." అలాగేనమ్మా! నేను మాత్రం ఊరుకుంటానా!" అన్నాడు వేదాంతయ్య అనటమే కాదు కోర్టుల చుట్టూ ప్లీడర్ల చుట్టూ కాలుకాలిన పిల్లిలా తిరిగాడు. కానీ రోజులు గడిచిపోతున్నా కేసు విచారణకు రాలేదు. ఈ విషయం యతి తల్లి దండ్రులకూ తెలిసింది. వాళ్ళు గుండె బాదుకుంటూ వచ్చేసారు. అసలే లేక లేక కలిగిన పిల్లవాడు. యతి తల్లి సుబ్బాయమ్మ గుండె బాదు కుంటూ "ఏదో మీ ఇంట్లో వుండి చదువుకుంటాడని ఇక్కడుంచేతే వాడిని జైలుకి పంపారా!" అని శోకాలు పెడుతూనే పోట్లా టకి దిగింది. రాజ్యలక్ష్మి సుబ్బాయమ్మ వచ్చేవరకూ ఆవి డకు ఏం సమాధానం చెప్పాలా అని భయపడుతోంది. తీరా సుబ్బాయమ్మ వచ్చి శోకాలు తీసూ పోట్లాటకు దిగేసరికి ఆత్మరక్షణార్థం తనూ ఎదురుతిరిగింది.

"ఏదో ఇంట్లో వుండి చదువుకుంటాడనుకున్నాం కాని

ఇలా అల్లర్లలకు దిగుతాడనుకున్నామా?" అని ఆవిడ సాగ దీసింది.

సుబ్బాయమ్మ భర్త గోపాలరావు రాజ్యలక్ష్మి నేమీ అనలేక "నోరుమూసుకో" అని భార్యను కసిరాడు. అది చూసి వేదాంతయ్యకూడా "బిడ్డ జైల్లో వున్నాడని ఆవిడ కుమిలిపోతుంటే, ఓదార్చటానికి బదులు పిచ్చిగా వాగుతావేం?" అని కసిరాడు అక్కడితో వాళ్ళిద్దరూ "వదినా!" అంటే "వదినా" అని ఒకరినొకరు కౌగలించుకుని బావురుమన్నారు. మయూర గదివదిలి బయటికిరాలేదు. తనకు తెలిసిన దేవుళ్ళనందరినీ పిచ్చిగా ప్రార్థిస్తోంది. యతిని విడుదల చెయ్యమని—

రెండునెలలు గడిచాకకాని యతికేసు విచారణకు రాలేదు. అనవసరంగా విద్యార్థులలో అల్లర్లు రెచ్చగొడుతున్న నేరం ఆరోపించబడింది యతిమీద. క్షమాపణ చెప్పుకొంటే విడుదల చేస్తామన్నారు. కానీ ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా యతి క్షమాపణ చెప్పుకోనన్నాడు. మయూర యతి దగ్గరకువచ్చి "నాముఖం చూసయినా క్షమాపణ చెప్పుకో యతీ." అని ఏడ్చింది. కళ్ళు చెమ్మగిల్లుతున్నా గంభీరమైన స్వరంతో "నువ్వలా అనకూడదు మయూర! చెయ్యని నేరానికి క్షమాపణ కోరుకోవటం కంటే ధైర్యంగా శిక్ష అనుభవించడమే మేలు."

"పాపిష్టిదానిని ఛండాలపు దానిని. నా మూలంగానే నీకి దశ కలిగింది.

"కాదు - నువ్వెంతో మంచిదానివి. నా కళ్ళు తెరిపించావు. ఒక ధ్యేయం నా ముందుంచావు. ఇప్పుడు నేను అనుభవిస్తున్నది కష్టదశే! కాదనను. కానీ ఒక ధ్యేయంలో నడుస్తున్నప్పుడు, మార్గంలో అన్నీ పూలే ఉండవు-"

మయూర కళ్ళు తుడుచుకుంది.

"ఊహ తెలిసినప్పటి నుండీ బడికీ, కాలేజీకి ఇద్దరము కలిసే వెళ్ళేవాళ్ళం ఇప్పుడీ మార్గంలోనూ ఇద్దరమూ కలిసే వెళ్దాం! నేనూ జైల్లో వుంటాను!"

ఆ మాటలకు చలించిపోయాడు యతి.

"పిచ్చి మయూరా! నువ్వు జైలుకు వచ్చినా మనిద్దరినీ ఒకచోట వుంచరు. జైల్లో ఇంకా ఎన్నెన్ని అవినీతి మృగాలు దాక్కుని ఉన్నాయో మనకి తెలియదు. నిన్ను నా మార్గంలో రావద్దన్నానా? అందుకోసం జైల్లోకి రానక్కర్లేదు. ఇంటి దగ్గరేవుండి ప్రయత్నించవచ్చు. ముందు కళ్ళు తుడుచుకో! నా మార్గంలో పయనించటానికి ఇది మొదటి మెట్టు. ఇది సుదీర్ఘ ప్రయాణం మయూరా!"

మయూర కళ్ళు తుడుచుకుంది. మబ్బులు కమ్మిన పగటి వెలుతురులా నవ్వింది

"యతీ! ఏ మార్గమయినా, ఎంత దీర్ఘప్రయాణమయినా, నేను నీతోనే ఉంటాను. నాకేం భయంలేదు." కటకటాలకు ముఖం ఆన్చి అంది.

"మయూరా! నాకొక మాట ఇయ్యగలవా?"

"చెప్పు!"

"నువ్వు కాలేజీ మానకు"

ఇలా అల్లర్లలకు దిగుతాడనుకున్నామా?" అని ఆవిడ సాగ దీసింది.

సుబ్బాయమ్మ భర్త గోపాలరావు రాజ్యలక్ష్మి నేమీ అనలేక "నోరుమూసుకో" అని భార్యను కసిరాడు. అది చూసి వేదాంతయ్యకూడా "బిడ్డజైల్లో వున్నాడని ఆవిడ కుమిలిపోతుంటే, ఓదార్చటానికి బదులు పిచ్చిగా వాగుతావేం!" అని కసిరాడు అక్కడితో వాళ్ళిద్దరూ "వదినా!" అంటే "వదినా" అని ఒకరినొకరు కౌగలించుకుని బావురుమన్నారు. మయూర గదివదిలి బయటికిరాలేదు. తనకు తెలిసిన దేవుళ్ళనందరినీ పిచ్చిగా ప్రార్థిస్తోంది. యతిని విడుదల చెయ్యమని-

రెండునెలలు గడిచాకకాని యతి కేసు విచారణకు రాలేదు. అనవసరంగా విద్యార్థులలో అల్లర్లు రెచ్చగొడుతున్న నేరం ఆరోపించబడింది యతిమీద. క్షమాపణ చెప్పకొంటే విడుదల చేస్తామన్నారు. కానీ ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా యతి క్షమాపణ చెప్పకోనన్నాడు. మయూర యతి దగ్గరకువచ్చి "నాముఖం చూసయినా క్షమాపణ చెప్పకో యతీ." అని ఏడ్చింది. కళ్ళు చెమ్మగిల్లుతున్నా గంభీరమైన స్వరంతో "నువ్విలా అనకూడదు మయూర! చెయ్యని నేరానికి క్షమాపణ కోరుకోవటం.కంటే ధైర్యంగా శిక్ష అనుభవించడమే మేలు."

"పాపిష్టిదానిని ఛండాలపు దానిని- నా మూలంగానే నీకి దశ కలిగింది.

"కాదు - నువ్వెంతో మంచిదానివి. నా కళ్ళు తెరి పించావు. ఒక ధ్యేయం నా ముందుంచావు. ఇప్పుడు నేను అనుభవిస్తున్నది కష్టదశే! కాదనను. కానీ ఒక ధ్యేయంలో నడుస్తున్నప్పుడు, మార్గంలో అన్నీ పూలే ఉండవు-"

మయూర కళ్ళు తుడుచుకుంది.

"ఊహ తెలిసినప్పటి నుండీ బడికీ, కాలేజీకి ఇద్దరము కలిసే వెళ్ళేవాళ్ళం ఇప్పుడీ మార్గంలోనూ ఇద్దరమూ కలిసే వెళ్దాం! నేనూ జైల్లో వుంటాను!"

ఆ మాటలకు చలించిపోయాడు యతి.

"పిచ్చి మయూరా! నువ్వు జైలుకు వచ్చినా మనిద్ద రిసి ఒకచోట వుంచరు. జైల్లో ఇంకా ఎన్నెన్ని అవినీతి మృగాలు దాక్కొని ఉన్నాయో మనకి తెలియదు. నిన్ను నా మార్గంలో రావద్దన్నానా? అందుకోసం జైల్లోకి రానక్క ర్లేదు. ఇంటి దగ్గరేవుండి ప్రయత్నించవచ్చు. ముందు కళ్ళు తుడుచుకో! నా మార్గంలో పయనించటానికి ఇది మొదటి మెట్టు. ఇది సుదీర్ఘ ప్రయాణం మయూరా!"

మయూర కళ్ళు తుడుచుకుంది. మబ్బులు కమ్మిన పగటి వెలుతురులా నవ్వింది

"యతీ! ఏ మార్గమయినా, ఎంత దీర్ఘప్రయాణ మయినా, నేను నీతోనే ఉంటాను. నాకేం భయంలేదు." కటకటాలకు ముఖం ఆన్చి అంది.

"మయూరా! నాకొక మాట ఇయ్యగలవా?"

"చెప్పు!"

"నువ్వు కాలేజీ మానకు"

"యతీ!"

"నేను చెప్పేది విను! నేను లేనని వాడు ఏమైనా వెధవ వేషాలు వెయ్యబోతే గట్టిగా బుద్ధిచెప్పు - జరిగినదానికి అదే ప్రతీకారం!"

మయూర తల వూపింది.

"ఎవరుబాబూ నువ్వు?" ముందుంచిన ఆహారాన్ని కూడా తినకుండా దీర్ఘంగా ఆలోచిస్తున్న యతిని అడిగాడు. ఆ గదిలోకి వచ్చిన ఒక పెద్దమనిషి. యతి చురుగ్గా చూస్తూ "మీ రెవరు?" అన్నాడు. అతని పెదవులమీద ప్రశంసాపూర్వకమైన చిరునవ్వు కనిపించింది.

"ఎవరిలా కనిపిస్తున్నానో చెప్పు!"

ఖద్దరు పంచె, వెయిస్టు కోటు, గాంధీ టోపీ - ఒక మోస్తరు పొడుగ్గా, కొంచెం లావుగా....

"రాజకీయ నాయకుడిలా కనిపిస్తున్నారు" పరిహాస ధోరణిలో అన్నాడు.

"చాలావరకు కరెక్టే. ఇప్పుడు చెప్పు నువ్వెవరో, అవకాశంవుంటే ఉపకారం చేస్తానేకాని. అపకారం చెయ్యను. చూస్తున్నావుగా కాస్త ఇక్కడ నాకు ఫ్రీగా తిరిగే అవకాశం వుంది. అందుకే కాస్త మిమ్మల్నందరినీ పలకరించగలుగుతున్నాను."

"మీ రెందుకొచ్చారు జైల్లోకి?"

"ఏముంది? న్యాయం జరగాలని పోట్లాడాను. న్యాయస్థానం ఇక్కడికి చేర్చింది."

యతిలో కుతూహలం పెరిగింది.

"ఏ సందర్భంలో పోట్లాడారు?"

"ఒక గ్రామంలో సర్పంచ్ 'చతుస్సముద్ర వేలావలయిత భూమండలాధిపతిలా' పెత్తనం చెలాయిస్తుంటే, అతని అధికారానికి వ్యతిరేకంగా గ్రామోద్యోగులందరిచేతా, ముఖ్యంగా హైస్కూల్ విద్యార్థులచేతా ఆందోళన జరిపించాను. ఫలితం..."

"ఆ సర్పంచ్ ఏమయ్యాడు?"

"సర్పంచ్ గానే వున్నాడు. మన ఆందోళనలు అంత త్వరగా ఫలిస్తే ఇక లేనిదేముంది నాయనా! కానీ అంత మాత్రాన ఇవి వ్యర్థమనుకోకూడదు. గాంధీమహాత్ముని సత్యాగ్రహ సమరమే ఏనాటికయినా మనకాదర్శం!"

వేదంతిలా నవ్వి అక్కడినుంచి వెళ్ళిపోయాడు అతను. నిజంగానే అతడికి జైలులో అంతటా తిరిగే స్వాతంత్ర్యం వున్నట్లుంది. ఎలా సంపాదించాడో? సమాజంలో ఎటు తల తిప్పినా, దేనికదే పద్మవ్యూహంలా కనిపిస్తుంది.

జైలులోనే యతికి ఒక యువకుడితో పరిచయమయింది. పాపం వెనుకబడ్డ జాతులకు చెందిన యువకుడు. చదువూ, సంస్కారాలు లేనివాడు. నల్లగా కండలు తిరిగిన శరీరం. సరిగా మాట్లాడటం కూడా చేతకాని అమాయకుడు. అలాంటివాడు నేరం చేసాడని అనుకోలేకపోయాడు యతి. అతన్ని మాటలలోకి దింపాడు మొదట. మొదట అతడు యతిని బెదురుగా చూస్తూ ఏం మాట్లాడలేదు. యతి నెమ్మదిగా లాలించి స్నేహం చేసుకున్నమీదట మాట్లాడటం మొదలు పెట్టాడు.

"నానండీ, రాదని పేమించానండి! అదీ నన్ను పేమించిందండీ- అల్లు చాకల్లండి- ఆళ్లేమో నాకియ్యమన్నారండి. ఇదరం ఎటైనా పోయి బతుకుదారని ఎల్లిపోయామండి- ఆళ్లేమో నేను దాన్ని లేవదీసుకు పోయినానని కేసెట్టారండి- నన్ను జైల్లోతోసారండి- దాన్ని లాక్కు పోయారండి. దాన్ని ఎవడికైనా కట్టబెట్టేస్తారేమోనండి-

ఇంచుమించు ఏడ్చినంత పనిచేశాడు వాడు. వాడినెలా ఓదార్చాలో అర్థంకాలేదు యతికి. ఏమిటీ సాంఘికాచారాలు ఈనాడు చదువుకున్న వాళ్ళలోనూ చదువుకోని వాళ్ళలోనూ కూడా నానాటికి ఎందుకింత సంకుచిత్వం ఏర్పడుతోంది? ఒకరినొకరు కోరుకున్న యువతీ యువకులను విడదీసిఆ తలిదండ్రులు పొందేదేమిటి?

యతి చేతమనసు ఇలా అనేక ఆలోచనలతో సతమతమయిపోతోంటే, వెంకటయ్య అతడిని వదిలిపెట్టలేదు— మళ్ళా వచ్చాడు. "ఒక్కసారి కళ్ళు తెరచి చుట్టూ చూడు నాయనా? అవినీతి లేనిదెక్కడా? అడుగడుగునా, స్వార్థంతో, ధనకాంక్షతో కుళ్ళి పోతుంది సమాజం. ఎక్కడికక్కడ బల్లలూ కుర్చీలు, చేతులు జాచేస్తున్నాయి చదువులతో చెలగాటం— ప్రాణాలతో చెలగాటం- అన్నిటితోనూ చెలగాటమే. నైతిక విలువలులేవు- బాధ్యతలులేవు. కర్తవ్యదీక్ష లేదు- డబ్బు! డబ్బు! డబ్బు!—అదొక్కటే కనిపిస్తోంది అందరి కంటికి. అందరూ ఒకరితో ఒకరు పోటీ పడుతూ సర్వం మరచి దాని వెనుక పరుగెత్తుతున్నారు. ఈపరిస్థితిని ఎదుర్కోవలసిన

బాధ్యత- కాపాడవలసిన బాధ్యత- సమాజాన్ని చైతన్యవం తం చెయ్యవలసిన బాధ్యత మనమీద లేదంటావా?

తనకు జరిగిన అన్యాయానికి ఏదో ప్రతీకారవాంఛతో రగిలి పోతున్న యతి మనసు ఈమాటల ప్రభావానికి అతి తేలికగా లొంగిపోయింది.

"ఏం చెయ్యగలమంటారు మనం? ఈపరిస్థితిని ఎలా ఎదు ర్కొనగల ?"

"నేను మొదట చెప్పిందే! ఎక్కడ ఏచిన్న అన్యాయం కనిపించినా దాన్ని సమాజం అంతటికి తెలియజేస్తూ తీవ్రమ యిన ఆందోళన జరిపించాలి!"

"ఆందోళన జరిపించటం ఒకరిద్దరివల్ల అవుతుందా? అందరూ కలిసి రావద్దా? ఇప్పుడు చూడండి, నాతోపాటు ఆందోళనలో పాల్గొన్న విద్యార్థులందరూ క్షమాపణ పత్రాలు రాసిచ్చేసి బయట పడ్డారు. ఎందుకూ, ఇలాంటి ఆందోళనలు?"

వెంకటయ్య నవ్వాడు.

"నేను కాదన్నానా? కేవలం ఉద్రేకాలవల్ల ఏపనులు జర గవు.

క్రమక్రమంగా కొంత శిక్షణలో జరిగినప్పుడే ఆందోళనలు జయప్రద మవుతాయి. మనధ్యేయం నెరవేరుతుంది. ఈఆశ యంతోనే. నేను రామచంద్రుడు స్థాపించాను సమాజంలో అవి నీతిని మాపుమాపటానికి కంకణం కట్టుకున్న అనేకమంది వీర యువకులు నాదండులో వున్నారు. నువ్వూ చేరతావా?"

"చేరతాను-,, వెంటనే అంగీకరించాడు యతి. వెంకటయ్య చెయ్యిజాపాడు- ఆచేతిలో చేయి కలిపాడు యతి.

# 7

విధిలేక కాలేజికి వెళ్ళివస్తోంది మయూరి తోటి పిల్లలు మయూరను పలకరించటానికి ప్రయత్నించారు. కాని, మయూర ముభావంగా అడిగిన దానికి సమాధానాలు చెప్పి మేరుకోవటంతో వాళ్ళు తమపని తాము చూచుకోవటం మొదలుపెట్టారు. మయూర ఇంటికి వెళ్తుండగా మళ్ళీ వెనకటిలాగా వేణు మోటారు సైకిల్ తో అడ్డుగా వచ్చాడు.

"పిల్లా, ఒంటిగా వున్నావ? జోడు కావాలా?,, అని పాడుకుంటూ.

ఎప్పటిలా మయూర తప్పించుకు పోవటానికి ప్రయత్నించలేదు. నిలబడిపోయింది. అదిచూసి మోటార్ సైకిల్ దిగి మరింత హుషారుగా పాడుకుంటూ దగ్గరగా వచ్చాడు వేణు. అప్పుడు కాలి చెప్పుతీసి ఆచెంపా, ఈచెంపా టపటప వాయించేసి, చకచక ముందుకు సాగిపోయింది. ఏం చెయ్యాలో కూడా అర్థంకాక దిమ్మెరపోయి నిలబడి పోయాడు వేణు. తరువాత ఏది ఎలా అయినా జరగనీ, వేణుని అలా చెంపదెబ్బలుకొట్టటంతో మనసు శాంతించినట్లయింది.

క్షణాలమీద ఈవార్త కాలేజిఅంతా వ్యాపించింది. అంతకు ముందు వేణుని చూసి భయపడిన ఆడపిల్లలు అతడినిచూసి ఒకరినొకరు మరొకరు చూసి ముసిముసి నవ్వులు నవ్వుకో సాగారు. కొందరు అతడిని చూడగానే తమ చెప్పులు చూసుకో

సాగారు. మొగపిల్లలు ఏదో ఓదారుస్తున్నట్లు "ఏమిటి గురూ ఆడపిల్ల ముందు ఓడిపోయావే? అందమైన ఆడదాన్ని చూడగానే నువ్వే అబలవై పోయావా, ఏమిటి?,, అని మరింత వెక్కిరించ సాగారు. వేణు అభిమానం తీవ్రంగా దెబ్బ తిన్నది. అతడు కాలేజికి రావటం మానేశాడు. "పీడా వదలిపోయింది,, అనుకున్నారు చాలామంది "ఈపని మొదటే చేసివుంటే, ఎంత బాగుండేది?,, అనుకుంది మయూర. ఇంటికి రాగానే పుస్తకాలు షెల్ఫ్‌లో పడేసి కేలండర్ చూస్తూ కూచునేది. రెండు నెలల్లోనూ పదిరోజులు మాత్రమే గడిచాయి. ఇంకా యాభై రోజులు గడవాలి! కాలం అసలు కదులుతుందా అనిపించసాగింది. సుబ్బాయమ్మ పరిస్థితి ఇంతకంటే ఘోరంగా వుంది. ఆవిడ మంచం ఎక్కేసింది. ఒక్కసారి తనను చూడటానికి మయూరకు కబురు చేసింది. టౌన్ ప్రక్కనే వున్న పల్లెటూరు. ప్రొద్దున్నే బండి ఎక్కితే మధ్యాహ్నానికల్లా ఆ ఊళ్ళో వుంటారు. బండితోలే సాంబయ్య చాలా నమ్మకమైన మనిషి. సెలవులకు యతి తనఊళ్ళో వుండి పొలం వ్యవహారాలు చూసుకొంటున్నప్పుడు యతిని చూడకుండా వుండలేక బండిలో ఆఊరికి వెళ్ళివచ్చేది మయూరి ఇదివరలో. ఆ అలవాటు చొప్పున సాంబయ్యను బండి కట్టమని ప్రొద్దున్నే బయలుదేరింది గోపాలరావు ఊళ్ళోలేడు. పాపం, అతడు కొడుకుని విడిపించుకోవాలని లాయర్ల చుట్టూ, తెలిసినవాళ్ళ చుట్టూ తిరుగుతున్నాడు. ఒక్కతే ఉండిటంతో మరింత బెంగపడపోతుంది సుబ్బాయమ్మ. మయూరను చూడగానే దీనంగా వచ్చావా! తల్లి! నీకోసామే చూస్తున్నాను. అంది. మయూర

మంచం దగ్గరగావచ్చి ఆవిడ రెండుచేతులూ తన రెండుచేతుల లోకి తీసుకుని, కూచుంది. ఇద్దరికి కళ్ళు నిండుకొస్తున్నాయి మాట పెగలటం లేదు. సుబ్బాయమ్మే ముందు మాట్లాడింది

"ఇవాళ రామాలయంలో అర్చన చేయించాలి. మయూరమ్మా! అందుకే పిలిపించాను. బాబు చల్లగా తిరిగి రావాలని దేవుడికి మొక్కుకుని అర్చన చేయించు" అంది. తల వూపింది మయూర. యతి వుంటే ఇలాంటి వాటికి నవ్వేవాడు.

"ఇది భలే మంచి బిజినెస్? ఒక రూపాయ కొబ్బరికాయ కొట్టి ఎక్కడలేని కోరికలూ కోరుకోటం. ఆ దేవుడికి వేరే పనిలేదు. మీ కోరికలు వినటమూ, అవి తీర్చటమూ తప్ప" అనేవాడు. మొదటినుంచీ గుడికి వెళ్ళటం పూజలు చెయ్యటం మొదలైనవి అలవాటుగా చేసున్నా యతి వెటకారానికి భయపడి గుడికి వెళ్ళటం మానుకుంది మయూర. కానీ, కొడుకుకోసం దిగులుతో కుమిలిపోతూ, మంచంలో మూలుగుతున్న ఆ వృద్ధురాలి కోరిక కాదనలేకపోయింది.

పళ్ళెంలో కొబ్బరికాయ, తాంబూలం, హారతి కర్పూరం, దక్షిణ మొదలైనవన్నీ సర్దుకుని బయలుదేరింది. రామాలయం ఆ ఊళ్ళో చాలా ప్రాచీనమైన దేవాలయం. ఊళ్ళో అందరికీ ఆ గుళ్లో వెలసిన శ్రీరాముడంటే, అంతులేని నమ్మకం. అంచేత అక్కడి సీతారాములకు అర్చనలకూ, ధూప దీప నైవేద్యాలకూ లోటు లేదు. మయూర వెళ్ళే సరికి జనం చాలామందే వున్నారు.

"అర్చనకు టికెట్ కొన్నారా? సహస్రనామార్చనా?

అష్టోత్తరమా ?" అని అడుగుతున్నాడు అర్చకుడు. అక్కడ కూడా టికెట్ పద్ధతి ప్రారంభమయింది కాబోలు. సహస్రనామార్చనకు టికెట్ కొని అర్చకుడి చేతి కందించింది మయూర. అలాంటి పది సహస్రనామాల టికట్లు ఒక అర్చకుడూ, పది అష్టోత్తరాల టికట్లు మరొక అర్చకుడూ వసూలు చేసుకున్నారు. ఇద్దరూ ఒకే వైపునుండి స్తోత్రాలు చదివేస్తూ పూజలు ప్రారంభించేసారు. అంతా గోలగోలగా వుంది. మయూర భరించలేక కళ్ళు మూసుకుని తన మనసులో భగవానుని దివ్యమంగళ స్వరూపాన్ని ధ్యానించటం ప్రారంభించింది. మనసు ఏవో అలౌకిక దివ్యభావనలతో నిండిపోయి ఆ పరిసరాల నుంచి ఎక్కడికో ఎగిరిపోయింది. అంతటి అశాంతిలోనూ ఏదో శాంతి ఆవరించింది. "స్వామీ! నా యతిని నాకు దూరం చెయ్యకు మమ్మల్ని వేరు చెయ్యకు" అని ప్రార్థించింది. మనసు చల్లబడినట్లయింది. అర్చకుడు "కొబ్బరికాయ" అన్నాడు. తనలోకంలో తానున్న మయూర ఆ మాటలు వినిపించుకోలేదు. అర్చకుడు తనే పళ్ళెంలోని కొబ్బరికాయ అందుకుని కొట్టి ప్రసాదంగా ఒక చిప్ప కొన్ని పువ్వులు పసుపు కుంకం పళ్ళెంలో పెట్టేసాడు. అర్చకుడు గంట మోగిస్తూ హారతి ఇస్తుండగా కళ్ళు తెరిచింది మయూర. రకరకాల కబుర్లు చెప్పుకొంటున్న ఆడవాళ్ళనూ, ఎగిరెగిరి గంట కొట్టాలని ప్రయత్నిస్తున్న మొగపిల్లలనూ, ప్రసాదం కొబ్బరి చిప్పలు 'చవగ్గా' కొనాలని చూసే వ్యాపారులనూ, దేనినీ గమనించకుం ఇంటికి వచ్చేసింది. సుబ్బాయమ్మ అర్చకుడిచ్చిన పువ్వులను కళ్ళ కద్దుకుని

తలలో పెట్టుకుంది అలా చెయ్యాలని కూడా మయూరకు తోచలేదు. ఆమె తనకే అర్థంకాని ఏదో పారవశ్యంలో వుంది. తన భారాన్నంతా సర్వాతీతమైన ఏదో మహత్తర శక్తి చేతుల్లో పెట్టి తాను నిశ్చింతగా ఉన్నట్లు ఏ ఆందోళనలూ లేకుండా నిర్మలంగా వుంది.

ఆ మనునాడు ఉదయమే ఇంటికి బయలుదేరింది. సాంబయ్య కూడా హుషారుగా వున్నట్లున్నాడు. ఏవో పదాలు పాడుతున్నాడు. బండి పల్లె దాటింది. బండి ఏవో తోటల మధ్యగా మట్టిరోడ్డున పోతోంది. సాంబయ్య పాడే పల్లెపదాలన్నీ ఏవో దివ్యగీతాలుగా తోస్తున్నాయి మయూరకి. ఆమె మనసులో భగవంతుని దివ్యమూర్తి తప్ప మరో ఆలోచన లేదు. అకస్మాత్తుగా సాంబయ్య పదాలు ఆగి పోయాయి. ఈ లోకంలో లేని మయూర ఏం జరుగుతుందో తెలుసుకుని బయటకు చూసేలోగానే, కళ్ళవరకూ నల్లని ముసుగు కప్పుకున్న వ్యక్తి ఒక చేత్తో మయూర నోరు నొక్కి బండిలోంచి క్రిందికి లాగేసాడు. సాంబయ్యను కూడా అలా నల్లని ముసుగు కప్పుకున్న వ్యక్తులే మరోవైపుకి లాక్కు పోతుండగా చూసింది మయూర. నోటిమీద మొరటు చెయ్యి క్షణక్షణానికీ బిగుసుకుపోతోంది. విడిపించుకోవటానికి ప్రయత్నించినా ఏవో "ఊఁ" "ఆ" అనే ధ్వనులు తప్ప మరే ధ్వనులూ పైకి రాలేదు. ఆ కొద్దిపాటి ధ్వనులు వినగలిగే వాళ్ళెవరూ లేరక్కడ. ఆ ముసుగు వ్యక్తి అతి చాకచక్యంగా మయూర నోరు నొక్కి పట్టుకుని మరో చెత్తో రెండు చేతులూ వెనక్కి విరిచి పట్టుకుని ఈడ్చుకొంటూ తీసుకొచ్చి

సిటీలో మయూరను కనుక్కోగలిగారు. వెంటనే మయూరను తల్లి దండ్రులకు అప్పగించలేదు. పోలీసులు డాక్టరుకి అప్పగించారు డాక్టర్ పరీక్షలో అతి దారుణంగా మాన భంగం జరిగినట్లు వెల్లడయింది. ఎంతఅల్లరి కాకూడదను కున్నారో అంత అల్లరి అయింది. మయూరకు వంటిమీద తెలివిలేదు. డాక్టర్ నీడిల్‌తో గ్లూకోజ్ ఇస్తున్నాడు. రాజ్యలక్ష్మి ఏడుస్తూ చెంచాతో పళ్ళరసమూ, పాలూ, నోట్లో పోస్తోంది. మయూరకు కొద్దిగా తెలివి రాగానే పోలీసులు ప్రశ్నలు ప్రారంభించారు. ఆ ప్రస్తావన తేగానే మయూర ఏదో భయంకర పిశాచాన్ని చూసినట్లు కెవ్వున కేక వేసి వణికి పోవటంతో తమ ప్రయత్నాన్ని అప్పటికి వాయిదా వేసుకున్నారు.

వేదాంతయ్యకు ఆలోచించే శక్తి నశించి పోతోంది. కాని ఇప్పుడు ఏం చెయ్యాలి? ఏం చెయ్యగలడు? ఏం చేస్తే తనబిడ్డ బ్రతుకు బాగు పడుతుంది? ఇంత దుర్మార్గానికి ఒడిగట్టిన ఆ కిరాతకుణ్ని పోలీసులు ఎలాగో పట్టుకోవచ్చు. అతడికి ఏదో కఠినశిక్ష విధించనూవచ్చు. అంత మాత్రంచేత తన బిడ్డ బ్రతుకు బాగుపడుతుందా? ఏపాపమూ చెయ్యక పోయినా, ఈ భయంకరమైన ముద్ర నెత్తిన వేసుకుని జీవితాంతమూ ఇలా కుమిలి పోవలసినదేనా?

"వేదాంతయ్య గారి ఇల్లు ఇదేనా?" అంటూ లోపలకు ప్రవేశించాడు ప్రభాకర్.

ఆరడుగులు భారీ విగ్రహం. నిగనిగలాడే చామన ఛాయ. ఖద్దరుపంచె. ఖద్దరులాల్చీ. సౌమ్యమైన ముఖాకృతి.

వేదాంతయ్య కుతూహలంగా చూస్తూ తను పడుకున్న వాలు కుర్చీలోంచిలేచి కూర్చోవటానికి కుర్చీ చూపించి "తమ రెవరో తెలుసుకోవచ్చా?" అన్నాడు.

నాపేరు ప్రభాకర్. కాంగ్రెస్ కార్యకర్తల్లో ఒకడిని ప్రస్తుతం యం. పి. గా వున్నాను

వేదాంతయ్య కంగారుగా "తమరా! తమపేరువిన్నాను. తమ ఫోటోకూడా ఆమధ్య పేపర్లో చూసాను. ప్రస్తుతం నామనసు మనసులో లేదు ఆ కారణం చేతనే తమను గుర్తించలేక పోయాను." అన్నాడు.

"ఫరవాలేదు లెండి! ప్రస్తుతం మనంవున్న పరిస్థితుల్లో మీరు నన్ను అంత మన్నించక్కర్లేదు. నేనే మిముల్ని ఒకటి యాచించటానికి వచ్చాను."

"అయ్యో! అయ్యో! ఎంతమాట! సెలవియ్యండి మీరు అడగటమూ నేను కాదనటమూనా! తమకు ఇయ్యగలిగింది నాదగ్గరేముంది?"

"మా అబ్బాయికి మీ అమ్మాయినిచ్చి పెళ్ళిచేయాలి"

"ఆ?" తెరిచిన నోరు ముయ్యటం మరిచిపోయి విభ్రాంతితో చూశాడు వేదాంతయ్య. ప్రభాకర్ వేదాంతయ్య దగ్గరగా వచ్చి అతని రెండు చేతులూ పట్టుకున్నాడు.

"వేదాంతయ్యగారూ! మీదుఃఖం నేను అర్థం చేసుకోగలను. ఈసంగతి తెలిసినప్పటినుంచీ నామనసు చెరువై పోతోంది. ఇలాంటి దుఃఖం పగవాడికైనా వద్దు. నాకు నిన్ననే తెలిసింది. ఈఘాతుకం చేసింది నాపుత్రుడు వేణు అని ఈ సంగతి తెలియగానే వాడిని ముక్కలు ముక్కలుగా నరికి కాకులకూ, గద్దలకూ వేయాలనిపించింది. కానీ అలా

చేస్తే మీ అమ్మాయికేం లాభం? ప్రస్తుత సమస్యకు తక్షణ పరిష్కారం మా వాడితో మీ అమ్మాయికి పెళ్ళి జరిపించటమే ననిపిస్తోంది. ఆలోచించుకోండి. మాకు సిరి సంపదలకు ఏం లోటు లేదు. వేణు బాగా అల్లరి చిల్లరిగా తయారయ్యాడు నిజమే! కానీ, ఇకమీదట వాడిని దారిలో పెట్టటానికి శాయ శక్తుల ప్రయత్నిస్తాను. నామాట నమ్మండి. నాకంఠంలో ప్రాణం వుండగా మీ అమ్మాయికే లోటూ రానీయను"

ప్రభాకర్ మాటలోని సారాంశం జీర్ణించు కోటానికి వేదాంతయ్యకు కొన్ని క్షణాలు పట్టింది. అతనికి గాఢాంధ కారంలో మెరుపు మెరిసినట్లయింది. అన్ని విధాలా అల్లరి పాలైన మయూరి జీవితంలో ఇంతకంటే అదృష్ట మేముం టుంది? తనంత తానుగా వచ్చి మయూరను కోడలుగా స్వీక రించడానికి సిద్ధపడుతున్న ఈ మహానుభావుడు తరువాత బాగోగులు చూడకుండా వుంటాడా?

"ఆలోచించుకోండి. నేను రేపు మళ్ళీ వస్తాను. మీ ఉభయులకూ అంగీకారమయితే పై వారంలోనే పెళ్ళి జరిపించేద్దాం. ఏర్పాట్లన్నీ నేను చూసుకుంటాను." అనేసి వెళ్ళి పోయాడు ప్రభాకర్ కారులో.

వేదాంతయ్య రాజ్యలక్ష్మితో సంగతంతా చెప్పాడు. ఆవిడ పరమానందంతో వెంటనే ఒప్పుకుంది. ఇదొక్కటే అత్యుత్తమ పరిష్కార మార్గంగా తోచింది ఆ తల్లికి అంత దారుణంగా ఒక అమాయకురాలిని మానభంగం చేసిన వ్యక్తితో, తన కూతురు ఏం సుఖపడుతుందనే ఆలోచన రానే లేదు. ఆవిడకి తన కూతురిని పాడుచేసినవాడే, పెళ్ళి

కూడా చేసేసుకుంటున్నాడు. "శీలం" పాడయినట్లు కాదు. అని స్థిమిత పడింది. అంతేగాక, కూతురికి కాబోయే అత్త వారి 'ఐశ్వర్యాన్ని' తలుచుకుని లోలోపల ఆనందించింది.

ఎవరి గురించి ఇన్ని ఆలోచనలు జరుగుతున్నాయో, ఆ మయూర మాత్రం వంటిమీద తెలివి లేకుండానే వుంది. షాక్ నుంచి ఇంకా తేరుకోలేదన్నారు డాక్టర్లు. ఎవరైనా తినిపిస్తే తింటుంది. లేకపోతే లేదు. పిచ్చిచూపులు చూస్తుంది.

మయూర పరిస్థితి ఇంత అధ్వాన్నంగా వున్నా ఇంట్లో దుఃఖపు నీడలు వెనుక బడ్డాయి. ఇల్లు పెళ్ళికళతో కళకళ లాడింది. పెళ్ళి ఏర్పాట్లు చకచక సాగుతున్నాయి. అన్నీ ప్రభాకర్ స్వయంగా జరిపిస్తున్నాడు. ఖర్చులన్నీ తనే పెట్టుకొంటున్నాడు.

వేణు ఇంతవరకు ఎన్ని వెధవ పనులు చేసినా అన్నీ తండ్రికి తెలియకుండా చేసాడు. తండ్రి దృష్టిలోకి రాకుండా తండ్రిపేరు చెప్పుకుని తండ్రి పలుకుబడి ఉపయోగించుకుని చేసాడు. ఈ నాడు తండ్రి కాలస్వరూపుడై తనముందు నిలిచేసరికి అతడికి నోట మాట రావటంలేదు. అయినా సాహసించి "ఆ అమ్మాయిని నేను పెళ్ళి చేసుకోను!" అన్నాడు తండ్రితో. అంతే, అతని చెంప ఛెళ్ళుమంది. కళ్ళు బైర్లుకమ్మయి ఇదే సమాధానమన్నట్లు "గెటవుట్" అన్నాడు.

"నోరు మూసుకుని పెళ్ళి చేసుకుని నీ మర్యాద కాపాడుకుని నా మర్యాద నిలబెట్టు. లేకపోతే కాళ్ళూ చేతులూ

కట్టి, తీసుకొచ్చి పెళ్ళి చేయిస్తాను" అని అన్నాడు. వేణు చెయ్యగలిగింది ఏమీ లేకపోయింది. వేణు తల్లి కమలకు కూడా ఇదంతా సంకటంగానే వుంది. ఇంత సామాన్య కుటుంబంలోంచి ఇలాంటి కోడల్ని కాదు. ఆమె ఆశించింది. కానీ, భర్త మాటల్నిబట్టి ఇంతకంటే చెయ్యగలిగింది లేదని అర్థం చేసుకుంది సహజంగా సాత్వికురాలు కనుక పరిస్థితులకు సర్దుకొంది.

మహా వైభవంగా పెళ్ళయిపోయింది మయూరకు అత్తవారు పెట్టిన చీరలూ, నగలూ చూసి అమ్మలక్కలు ఈర్ష్యతో చెవులు కొరుక్కున్నారు. పెళ్ళి జరుగుతున్నా మరబొమ్మలాగే కూచున్న మయూరను చూసి కొందరు వింతగా చెప్పుకున్నారు. కారులో మేళాలతో ఊరేగింపు కూడా ఏర్పాటు చేసాడు ప్రభాకర్ మయూర పక్కన పెళ్ళికొడుకుగా ఊరేగుతూ కారులోంచి పక్కకు చూసిన ప్రభాకర్‌కి గోడలమీద ఒకనాడు తాను వ్రాయించిన 'యతి, మయూరి' అనే పేర్లు కనిపించాయి. ఆ పేర్లనుచూసి యతి! మయూర పకపక ఉల్లాసంగా నవ్వుకున్న దృశ్యం కళ్ళముందు మెదిలింది గుండెల్లో ఏదో పదునైన బాకు దిగేసినట్లయింది. అంతేనా? ఆ రోజు తనే కాదు. తన స్నేహితులిద్దరుకూడా, తన కళ్ళముందే మయూరను చెరిచారు. ఆ రోజు పైశాచికంగా నవ్వుకున్నాడు. ఇప్పుడా దృశ్యమే తిరిగి తిరిగి గుర్తుకొస్తు మనసును విషపు సూదులతో గుచ్చి బాధిస్తోంది.

అప్పటివరకు అతడు కోపంతో మయూరను సరిగ్గా

చూడలేదు. మయూరవైపు చూసాడు తనేం ఆలోచిస్తోందోనని మయూర పిచ్చిచూపులు చూసింది!

"ఓరి దేవుడా! దీనికి పిచ్చికూడా ఎక్కింది!"

వేణు గుండె గుభిల్లుమంది!

# 9

శోభనం ఏర్పాట్లు జరుగుతున్నా చైతన్యం లేకుండా కూచున్న మయూరను చూసి గుండె బెదిరిపోయింది రాజ్యలక్ష్మికి. భర్తతో రహస్యంగ "ఎలాగండీ?" అంది. అతడు అయోమయంగా "అన్నీ అవే చక్కబడతాయి లేవే!" అన్నాడు. మయూరను చక్కగా అలంకరించి గదిలోకి పంపారు. యాంత్రికంగా వెళ్ళి మంచంమీద కూచుంది- 'హమ్మయ్య' అనుకున్నారు. కొందరు అమ్మలక్కలు మాత్రం "బొత్తిగా సిగ్గులేదు. అవునులే! ఇంకా సిగ్గెలా ఉంటుంది?" అని వెటకారంగా గుసగుసలాడుకున్నారు.

చాలా కోపంగా గదిలోకి వచ్చాడు వేణు. కానీ, మంచంమీద మూర్తీభవించిన సౌందర్యరాశిలా వున్న మయూరను చూడగానే, అతనిలోని పశుప్రవృత్తి చెలరేగింది. అమాంతం వెళ్ళి మయూరమీద పడ్డాడు. కెవ్వున కేక పెట్టింది. మయూర - అంతలోనే ఆమె సర్వాంగాలు వణికిపోవటమూ, స్పృహ తప్పటమూ జరిగిపోయింది. భయపడిపోయి తలుపు తెరుచుకుని బయటకు వచ్చాడు వేణు.

అప్పటికే మయూర కేకలకు అందరూ తలుపు దగ్గర చేరారు. తెలివితప్పి పడివున్న మయూరిని చూసి రాజ్యలక్ష్మి గుండె బాదుకొని ఏడుస్తుంటే, కమల "నా కర్మ" అని తల బాదుకుంది.

"అంతలా నా కొడుకు జైలులో మగ్గుతుంటే, ఇలా వేడుకగా ... చేసుకుంటే, ఏం జరుగుతుందీ?" అని సాగదీసింది అక్కసుగా సుబ్బాయమ్మ.

ప్రభాకర్ అందరినీ ఎడంగా తోస్తూ తను ముందుకు వచ్చాడు. మయుర పరిస్థితి చూసాడు. "ఇప్పుడీ వేడుక లేమీ వద్దు. అమ్మాయిని హైదరాబాదు తీసికెళ్ళి స్పెషలిస్టులకు చూపిస్తాము" అన్నాడు వేదాంతయ్యతో.

వేదాంతయ్య తల ఊపాడు.

ఏడుస్తూన్న రాజ్యలక్ష్మినీ, కండువాతో ముఖంతుడుచుకుంటున్నట్లు కళ్ళు తుడుచుకుంటున్న వేదాంతయ్యనీ, దీనంగా నిలబడ్డ సుబ్బాయమ్మనీ, ఎవరినీ చూడకుండా కమలా ప్రభాకర్ దంపతులతో హైదరాబాదు బయలు దేరింది మయుర. వేణుని తమతో రానియ్యలేదు ప్రభాకర్. "ఆ చదువేదో పూర్తిగా తగలబెట్టరా!" అన్నాడు.

"ఇంక ఈ టౌన్‌లో చదవను" అన్నాడు వేణు.

"అయితే టి. సి తీసుకొని మరెక్కడయినా చదువు అంతేకాని హైదరాబాద్ మాత్రంరాక నువ్వుకొన్నాళ్ళ వరకు అమ్మాయి కంటికి కనబడటానికి వీల్లేదు."

నిస్సహాయంగా నోరు మూసుకోవలసి వచ్చింది వేణు, కమల ఊరుకోలేక పోయింది.

"ఇదెక్కడ న్యాయమండీ? ఎవరి కోసమో, తన బిడ్డని ఇంటికి రావద్దంటారా!" అంది.

ప్రభాకర్ కమలను కొంచెం తీక్షణంగాచూసి "ట్రెయిన్ కదిలే టైమవుతోంది. లోపలికి పోయికూచో! అమ్మాయిని జాగ్రత్తగా చూడు!" అన్నాడు. ఏపరిస్థితిలో అయినా ప్రభాకర్‌ని ఎదిరించి మాట్లాడలేదు కమల.... అందుకే కంపార్టు మెంట్‌లోకి పోయి కూర్చుంది...

"ఇకనైనా వెధవ వేషాలు వెయ్యకుండా చదువుకో! లేకపోతే జాగ్రత్త!" అని వేణుని చివరిసారిగా హెచ్చరించి తనుకూడా కంపార్టుమెంట్‌లోకి వచ్చి కూచున్నాడు. ట్రెయిన్ కదిలింది. దూరమవుతున్న కొడుకును చూస్తుంటే దుఃఖం నిగ్రహించుకోవటం కష్టమయింది కమలకి.

"ఈ పాడైపోయిన దాని కోసం ఎందుకండీ, ఇలా కన్న కొడుకునే దూరం చేసుకుంటున్నారు?" అనేసింది.

నిర్ఘాంతపోయాడు ప్రభాకర్.

"కమలా! నువ్వు...నువ్వేనా, ఇలా మాట్లాడుతోంది. నీ దృష్టికి కూడా ఒక ఆడదాని జీవితం అంత చులకనగా ఉందా?"

కమల వంచిన తల ఎత్తలేక పోయింది అతనికి సమాధానం చెప్పలేక పోయింది.

నిజానికి ఆ రోజుల్లో ప్రభాకర్ కమలను పెళ్ళిచేసుకోవటం చాలా పెద్ద సాహసం. ఇద్దరు పిల్లలతల్లి. దురదృష్ట

వత్తు చిన్నతనంలోనే పోయారు. ఇద్దరు పిల్లల తల్లి కావటం మాత్రమే కాదు చాలా సాంప్రదాయ కుటుంబంలో పుట్టింది. అంతేకాదు తండ్రి ధనవంతుడూ, పలుకుబడి కలవాడూ, ఆచారాలకోసమూ, సంప్రదాయాలకోసమూ ప్రాణాలు వదిలి పెట్టేవాడు.

ప్రభాకర్ తండ్రి స్వాతంత్ర్యోద్యమ వీరుడు. గాంధీ గారి శిష్యుడు. ఆనాటి మేటి నాయకులతో సమంగా కార్య రంగంలోకి దుమికి ప్రఖ్యాతి పొందినవాడు. ప్రభాకర్ పది హేనేళ్ళ వయసులో ఉండగా భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించారు. ప్రభాకర్ తండ్రి ఆదర్శవాది మాత్రమే కాక, కార్యవాది కూడా కావటంవల్ల అతిచాకచక్యంతో రాజకీయా లలోనికి ప్రవేశించి ప్రధాన రాజకీయ నాయకులలో ఒకడయి పోయాడు. అయినా అతనిని స్వార్థపిశాచం ఆవహించలేదు. ఎప్పటికప్పుడు న్యాయంకోసం పాటివారితో ఘర్షణ పడు తూనే ఉండేవాడు. ప్రభాకర్ కూడా చురుకయిన వాడూ సూక్ష్మగ్రాహి కావటంవల్ల తండ్రి అడుగుజాడల్లో నడిచి తనూ రాజకీయాలలో ప్రవేశించాడు. కొంత రాజకీయ ప్రయోజనమూ కొంత ఆదర్శమూ మేళవించి, గ్రామాభ్యు దయ కార్యక్రమాన్ని చేపట్టాడు. కొందరు అనుయాయులతో అప్పటికి గ్రామాలు ఈనాటికంటే బాగా వెనుకబడి ఉండేవి. అనేక రకాల పార్టీ తగాదాలుండేవి. ఇవికాక వంటకాలువల దగ్గరా, సరిహద్దుల దగ్గరా తగవులకు లెక్కేలేదు. కులమత భేదాలు బాగా పాతుకుపోయి వుండేవి.

కులమత భేదాలు నిర్మూలించటం. సంఘ సంస్కరణ

కార్యక్రమాలు మొదలైనవి ధ్యేయంగా పెట్టుకుని గ్రామాలలో పర్యటన ప్రారంభించాడు ప్రభాకర్. అతడికి ఎప్పుడూ తండ్రి అండదండ లుండేవి. అంచేత ఎదురు చెప్పటానికి భయపడేవారు. ఈ పర్యటనలోనే కమల ఉన్న గ్రామానికి వచ్చాడు అప్పటికి కమల భర్తని పోగొట్టుకుని తండ్రి దగ్గర కొచ్చేసింది ఒక కొడుకు పోయాడు ఒక కొడుకు బ్రతికే వున్నాడు అప్పటికి గ్రామాలలో మౌఢ్యత్వం ఇప్పటికంటే ఎక్కువగా ఉండేది. అమ్మవారికి ఎన్ని పూజలయినా చేసే వారు. ఎన్ని మేకలయినా ఎన్ని గొర్రెలయినా బలి ఇచ్చే వారు. టీకాలుమాత్రం వేయించు కునేవారుకాదు. ప్రభుత్వం పంపిన టీకాలు వేసేవాళ్ళు వస్తే తప్పించుకుని పారిపోయే వాళ్ళు ఇన్ని కారణాలచేత ఆ సమయంలో గ్రామంలో మశూచి వ్యాపించింది. తన అనుయాయులతో రంగంలోకి దిగాడు. ప్రభాకర్ అతని అనుచరులూ ముందుగానే టీకాలు వేయించుకున్నారు. ఎప్పటి కప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలూ వాళ్ళకు తెలుసు. అంచేత జబ్బుపడ్డవాళ్ళను హాస్పిటల్‌లో చేర్పించటం, జబ్బురానివాళ్ళకు బలవంతాన వేక్సినేషన్ ఇప్పించటం. విధివశత్తు మరణించినవాళ్ళకు అతి జాగ్రత్తగా శవసంస్కారాలు చేయటం. మొదలయిన పనులన్నీ ఈ బృందం తమపైన వేసుకుంటుంది. ఈ సమయంలో కమల తండ్రికీ, ఇటు కమల కొడుకుకీ ఒకేసారి మశూచికం వచ్చింది. అంటుజబ్బని బంధువులు పాలేళ్ళు, చాకళ్ళూ పని మనుష్యులూ పనులు మానేశారు.

ఆ సమయంలో ప్రభాకరే ఆ కుటుంబాన్ని ఆదుకు

న్నాడు. కమల తండ్రినీ కొడుకునీ హాస్పిటల్‌లో చేర్పించాడు భయపడుతున్న కమలకు నచ్చజెప్పి టీకాలు వేయించాడు. కమల తండ్రి బ్రతికాడు కానీ, కమల కొడుకును ఎవరూ బ్రతికించ లేకపోయారు. ఆ సమయంలో కమల గర్భశోకం చూడలేక పోయాడు ప్రభాకర్. "ఆయన పోయినా, వీడిని చూసుకుని బ్రతుకుతున్నాను. జీవితంలో సుఖసంతోషాలకు నోచుకోకపోయినా తల్లిగానయిలా బిడ్డను చూచుకుని ఆనందిద్దామనుకున్నాను. ఇక నేనెందుకు బ్రతకాలి? నాకెవరున్నారు? అని ఏడుస్తున్న కమల దుఃఖం చూడలేక చటుక్కున "నేనున్నాను" అనేశాడు. ప్రభాకర్- కమల తెల్లబోయి చూసింది ప్రభాకర్‌ని. ఇద్దరూ ఒకరి నొకరు భయంగా చూసుకుని చటుక్కున ముఖాలు తిప్పేసుకున్నారు. అప్పటికింకా వితంతు వివాహాలు సర్వసామాన్యం కాలేదు. బాల్య వితంతువులకు వివాహం చెయ్యటమే చాలా ఘోరమైన అపరాధంగా భావించబడుతూ ఉండేది. విశ్వనాధ సత్యనారాయణవంటి కవిసామ్రాట్‌లు బాల్య వితంతు వివాహాలను గర్హిస్తూ "స్వర్గానికి నిచ్చెనలు" వంటి నవలలు వ్రాస్తున్న రోజులవి! ఆ సందర్భంలో ఇద్దరు పిల్లలతల్లి కమలను వివాహమాడటం సామాన్యం కాదు. ఉభయ పక్షాలలో ఎవరూ ఒప్పుకోరు! ఈ సంభాషణ జరిగాక ఒక్కరోజు మాత్రమే కమలా ప్రభాకర్‌లు తప్పుకు తిరిగారు. హాస్పిటల్‌లో పడి ఉన్న తండ్రిని చూసుకోవటానికి కమల వచ్చింది అతడికి కన్న కొడుకులా సేవచేస్తున్న ప్రభాకర్‌ని చూసింది. ప్రభాకర్ కూడా కమలను చూసాడు. ఇద్దరూ ఒకరి నొకరు చూసు

కుంటూ ఉండిపోయారు కొన్ని క్షణాలు. ఈసారి ఇద్దరిలో ఎవరూ ముఖం తిప్పుకోలేదు. కమలను చూడగానే కమల తండ్రి "అయ్యో! చిట్టిబాబు కూడా పోయాడా?" అని ఆవురు మన్నాడు. కమల కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

కమలవైపు చూసి కమల తండ్రిని ఓదార్చాడు ప్రభాకర్.

"ఏడవకండి! ఏడ్చి ప్రయోజనం లేదు. ముందు ఏం చేయాలో ఆలోచించుకోండి! ఇంకా ముందు జీవితం చాలా వుంది."

కమల తండ్రి ఏడుస్తూ "ఇంకా నాకు ముందు జీవితం ఏమిటి నాయనా!" అన్నాడు.

కన్నీళ్ళమధ్య కమల పెదవులు కనీ కనబడని చిరునవ్వుతో విచ్చుకున్నాయి. ఆ చిరునవ్వు ప్రభాకర్ మనసును తీయగా గిలిగింతలు పెట్టింది. కమల తండ్రి కోలుకున్నాడు. కానీ, కమల కోలుకోలేదు. శారీరకమైన అస్వస్థత నుండి కాదు. మానసికమైన అస్వస్థతనుండి. అప్పటికి కమలకు పాతిక నిండలేదు. ముందు జీవితం ఏమిటి? ఇలా ఒంటరిగా-కమలకు భయం వేసింది.

"ఇంకా ముందు జీవితం చాలావుంది" అన్న ప్రభాకర్ మాటలు గుర్తుకొచ్చాయి. ప్రభాకర్ రూపము, వ్యక్తిత్వమూ మనసును ఊపివేస్తున్నాయి. కానీ, అలాంటివ్యక్తి తనకు దక్కుతాడా? ఎంతమంది కన్నెపిల్లలు తపస్సు చేస్తున్నారో అతనికోసం? ఇద్దరు పిల్లల తల్లిని పెళ్ళి చేసుకోవల

సిన అవసరం అతనికేం వచ్చింది ? నిగ్రహించుకోటానికి ప్రయత్నించిన కొద్దీ కమల మనసు ప్రభాకర్ వైపుకే పురకలు వేయసాగింది. కానీ, ప్రభాకర్ మాత్రం కమల ఇంటికి రావటం మానేసాడు. కమల అతనిని ఆకర్షించక పోలేదు. కానీ, కమల తండ్రి ఛాందసభావాలు, అతని పలుకుబడీ ప్రభాకర్‌ని భయపెట్టాయి.

ప్రభాకర్ కోసం ఎదురుచూసి చూసి కమల నిరాశను ఎదుర్కోవలసి వచ్చేది. ఈ ఆశాభంగాన్ని కమల భరించలేకపోయింది. ఒకరోజు తనే తిన్నగా ప్రభాకర్ దగ్గరకు వచ్చేసింది. తనకళ్ళను తను నమ్మలేకపోయాడు ప్రభాకర్. ఈ పరిణామం అతడు ఊహించనిది. దానిలోని సాధక బాధకాలను అతడెన్నడూ ఆలోచించలేదు.

"ఆనాడు 'నీకు నేనున్నాను' అన్నారు. అందుకే మీ దగ్గరకు వచ్చేసాను." అంది కమల.

ప్రభాకర్‌కి వెంటనే ఏ సమాధానమూ స్ఫురించలేదు. కమల అతని ముఖంలోకి కొన్ని క్షణాలు చూసి "వెళుతున్నాను" అని బయటకి పోబోయింది అప్పటికి ఏదో కల లోంచి తెప్పరిల్లినట్లు కమలకు అడ్డుగా నిలబడి "వెళ్ళకు" అన్నాడు ప్రభాకర్-అప్పటికే పోబోతున్న కమలను చెయ్యి పట్టుకుని ఆపుచేసాడు. ఆ రాత్రి కమలతో సిటీకి పారిపోయాడు ప్రభాకర్. ఆ తరువాత ఎంత జాగాలో అంతా జరిగింది. కమల తండ్రి మండిపడ్డాడు. 'నా కూతురే' కాదన్నాడు ముఖం చూపించవద్దన్నాడు. ప్రాయశ్చిత్తాలు చేసుకున్నాడు. మనసు భయంతో వణికిపోతున్నా ప్రభాకర్ అండతో ఆ

దుమారాన్ని తట్టుకోగలిగింది కమల. ప్రభాకర్ తండ్రికూడా జరిగిన సంఘటనను ఎక్కువ విచారించలేదు. కానీ, అతడు రాజకీయాల్లో తల పండినవాడు. అందుచేత సమస్యను అర్థం చేసుకొని రాజకీయంగానే పరిష్కరించేసాడు. కమలకు ప్రభాకర్‌కూ తానే స్వయంగా ఘనంగా వివాహం చేయించాడు. అదొక సంస్కరణ వివాహంగా ప్రచారం చేసాడు. అన్ని పత్రికలకూ దంపతుల ఫోటోలు పంపించాడు. చివరకు కొడుకు చేసిన దుడుకు పనినికూడా తన రాజకీయ సోపానాలలో మరొక సోపానంగా మలచుకున్నాడు.

ఆనాడు తను చేసిన సాహసానికి కమల జీవితంలో ఎన్నడూ పశ్చాత్తాప పడలేదు. ప్రభాకర్ కమలను మన సారా ఆదరించాడు. కమలకు ప్రభాకర్ దేవుడే! కమలవిచారం ఒక్కటే. రోగంతో మంచంలో మూలుగుతూ కూడ కమల తండ్రి కమలను చూడటానికి ఇష్టపడలేదు. తన ఆస్తి నంతా ధర్మ కార్యాలకు వినియోగించమని విల్లుకూడా వ్రాసేసాడు. ఆ విషయం విని కమల చాలా బాధపడింది. "అంత ఆస్తి నేను బ్రతికి వుండగానే ఎవరెవరికో ధారపోస్తున్నాడు. ఇన్నాళ్ళ నేనుచేసిన సేవలు మట్టిగొట్టుకుపోయాయి." అన్నది.

"అయితే ఆస్తికోసం సేవలు చేసావన్నమాట మీ నాన్నకి ?" అని వేళాకోళం చేసాడు ప్రభాకర్. కమల ఆ మాటలు పట్టించుకోలేదు. ఆస్తికోసం మథన పడటమూ మానలేదు.

అప్పుడు కమలకు వేణు పుట్టాడు. మనవడు పుట్టా డని తెలుసుకున్నాక కమల తండ్రి మనసు మారింది. మనవ డిని చూడాలని తహతహలాడి పోయాడు. కోపం మరిచి పోయి మనవడిని తీసుకుని తనదగ్గరకు రమ్మని ఉత్తరం వ్రాసాడు కమలకు. కమల వెంటనే బయలుదేరింది. మనవ డిని చూసుకుని మురిసిపోయాడు కమల తండ్రి. తన చివరి రోజులలో కమలను బిడ్డతోసహా తన దగ్గిర వుండమన్నాడు. ప్రభాకర్ ఒప్పుకోలేదు. కాని, కమల బ్రతిమాలి, బామాలి ఒప్పించింది. ఆ స్తి తిరిగి తన కొడుక్కి రాబోతోంది. అంత కంటే ఏం కావాలి? "నువ్వెక్కడ? నే నిక్కడ! ఆలో చించుకో కమలా!" అన్నాడు ప్రభాకర్ హెచ్చరింపుగా. కొంచెంసేపు కమల మనసు అటూ ఇటూ వూగింది. కానీ ఆ స్తి వదులుకో లేక పోయింది.

"చివరి రోజులలో నాన్నని ఎలా వదలనండీ? మీకు వీలయినప్పుడు; మీరు వద్దురుగాని, లేదా నేనే వస్తూవుం టాను వీలయినప్పుడల్లా! డబ్బుకు కొదువ లేదుగదా!" అంది. కమలతో వాదించి ప్రయోజనం లేదని ఊరుకున్నాడు ప్రభాకర్. అప్పటికే అతను తండ్రి వెంట తిరుగుతూ రాజ కీయ నాయకులలో ప్రముఖుడవుతున్నాడు. అంచేత ఆ వ్యవ హారాలలా మునిగిపోయాడు. వేణుతో తండ్రి దగ్గరకు వచ్చే సింది కమల. వృద్ధాప్యంలో కమల తండ్రికి కంటికి వేణు దీపమయ్యాడు. ఇద్దరు పిల్లలను పోగొట్టుకుని, ఇక తల్లి నయ్యే భాగ్యంలేదని కృంగిపోతున్న సమయంలో భగవంతుడు ప్రసాదించిన అపురూపమైన వరంలా కలిగిన వేణు కమలకు

జీవిత సర్వస్వమయ్యాడు. తండ్రి దగ్గరే వుండి నెలకొకసారి విమానంలో కొడుకుతో సహా ప్రభాకర్ దగ్గరకు వెళ్ళేది కమల. రాకరాక వచ్చిన కొడుకుకు వున్న నాలుగురోజులూ, అడిగినదల్లా యిచ్చి అల్లారుముద్దుగా చూసేవాడు ప్రభాకర్.

ఇలా పెరిగాడు వేణు. చేతిలో డబ్బుంటే పాడై పోయే అవకాశాలు పట్టణాలలో కంటే పల్లెలలోనే ఎక్కువ. సహజంగా సంస్కారం లేని విద్యాశూన్యులయిన కూలి నాలి జనంలో దురలవాట్లకు తక్కువలేదు వాటికి డబ్బు తోడయితే అగ్నికి ఆజ్యం పోసినట్లే! ఆ రకంగా వేణు చిన్నతనంలోనే దురభ్యాసాలకు అలవాటు పడిపోయాడు. కమల మందలించకపోలేదు. కానీ ఆమె మెత్తని మందలింపుకు లొంగనంత ముదురుపాకంలో పడిపోయాయి అతని అలవాట్లు తాతగారు కూడా మందలించినా డబ్బు అడిగినప్పుడల్లా కాదనకుండా ఇచ్చేవారు, ఇలా వేణు క్రమక్రమంగా దారి తప్పటం మొదలు పెట్టాడు. చివరి రోజులు అనుకున్న కమల ఆనందంవల్లనో' మనస్థిమితం వల్లనో ఆ చివరిరోజులు చివరకు రాకుండానే పెరగసాగాయి.

ప్రభాకర్ అసలు యింటివిషయం పట్టించుకొనేస్థితిలో లేడు. పాలకవర్గంలో అవినీతి, నిరంకుశాధికారం పెచ్చుపెరిగి పోవటంవల్ల, ఆ వర్గాన్ని ప్రతిఘటించాలని కోరుకున్నారు కొందరు ప్రభాకర్ వారిలో ప్రథముడు అయితే అతడు మిగిలిన వారిలా బాహాటంగా ప్రతిఘటించలేదు. పాలకవర్గానికి అంతశ్శత్రువులా వారిమధ్యనే ఉండిపోయాడు. ప్రతిఘటించినవారిలో కొందరు అరెస్టు చేయబడ్డారు. మరికొందరు

అండర్ గ్రౌండ్‌లోకి వెళ్ళిపోయారు. ప్రభాకర్ బహాట ఉంటూ అండర్ గ్రౌండ్‌లో వున్న వారికి లింక్‌లా వుపకరించే వాడు. పాలకవర్గంలో జరుగుతున్న తంత్రాలు ఎప్పటికప్పుడు అండర్ గ్రౌండ్‌లో వున్న వాళ్ళకి తెలియపరిచేవాడు. జైళ్ళలో వున్నవారి సమాచారం బయటివారికీ, బయటివారి సందేశాలు జైళ్ళలో వారికీ అందించటానికి సహకరించేవాడు. ఈ గందరగోళంలో మునిగివున్న ప్రభాకర్‌కి కమలగురించీ కొడుకుగురించీ ఆలోచించే తీరికే లేకపోయింది. అదీగాక వాళ్ళు సిరిసంపదలతో మామగారి దగ్గర సుఖంగా వున్నారనే భరోసా —

ఏలాగైనా పాలకవర్గాన్ని పడగొట్టాలని ప్రభాకర్ వర్గంవారు అతి తీవ్రంగా ప్రయత్నించారు. నాటకాలద్వారా బుర్రకథలద్వారా వ్యంగ్యంగా జరుగుతున్న అవినీతిని విప్పి చెబుతూ ప్రజలలో చైతన్యం కలిగించటానికి ప్రయత్నించారు. చివరకు అతి ప్రయత్నంమీద పాలకవర్గాన్ని చిత్తుగా ఓడించగలిగారు. ఆ సంతోషంలో ఘనంగా ఏర్పాటు చేసుకున్న విందు వినోదాలమధ్య అ దింది కమల టెలిగ్రాం. వెంటనేరమ్మని. ఏం జరిగిందోనని వెంటనే బయలుదేరి వచ్చాడు. అప్పుడు తెలిసింది ప్రభాకర్‌కి, తన సుపుత్రుడు ఏ మార్గాన ఎంతగా భ్రష్టుడయ్యాడో, పోలీసులకు వేణు ఘనకార్యం తెలిసిపోయింది. కేసు పెట్టడం అంటూ జరిగితే వేణుకు శిక్షపడటం మాట ఎలావున్నా, తన పరువు బజారున పడటం ఖాయం. అందుకే ఆలోచించి మయూరా వేణులకు వివాహం జరిపించేసాడు.

అలాంటి కవుల ఈ నాడు యిలా మాట్లాడటం ఆశ్చర్యం కదా మరి?

# 10

దూరంనుంచి ఏదో ప్రణవనాదం వినిపిస్తోంది. జేగంట గణగణ మ్రోగుతోంది-మయూర కళ్ళు తెరవాలని విశ్వ ప్రయత్నం చేస్తోంది-అవి మూసుకు పోతున్నాయి. ప్రణవ నాదం మరింత స్ఫుటంగా వినిపిస్తోంది. ఆ నాదం మయూర అణువణువులోనూ ప్రవేశించి ఏదో నూతనో త్తేజం కలిగినట్లు యింది. మైకం నెమ్మది నెమ్మదిగా కరిగిపోసాగింది - కళ్ళు విడిపడ్డాయి. మంచంమీద లేచి కూచుంది - ముకుందమాల స్తోత్రాలు అతి శ్రావ్యంగా, గంభీరంగా వినిపిస్తున్నాయి. ఆ ధ్వని కెరటాలు కెరటాలుగా వాతావరణమంతా అలముకొంటూంది- శరీరం తూలింది, నిలదొక్కుకుంది. కళ్ళు తిరుగుతున్నాయి-అయినా, మంచంమీద పడుకోలేదు. తూలుతుంటూనే ముందుకు నడిచింది. పూజా మందిరంలో భగవంతుడి ముందు కూచొని, తనలో తాను లీనమై ముకుందమాల శ్లోకాలు చదువుకుంటున్నాడు ప్రభాకర్. ఆ మందిరం గుమ్మంవరకూ వచ్చి ఆగిపోయింది మయూర. లోపలికి అడుగు వేయలేదు. కళ్ళు మూసుకొని ఎవరికో నివేదిస్తున్నట్లు భావోద్రేకంతో స్తోత్రాలు చదువుతున్న ప్రభాకర్ - దేదీప్యమానంగా వెలుగుతున్న జ్యోతులు-పొగలుపొగలుగా

అస్తిత్వాన్ని కరిగించుకుంటూ ఎక్కడికో ఎగిరిపోతున్న ఊదువత్తులు-వీటన్నింటి మధ్యా చిరునవ్వులు చిందిస్తూ చిలిపి కృష్ణుడు-ఆదర్శాలు రూపుదాల్చిన ఉదార గంభీర మూర్తి సీతా లక్ష్మణ సహిత శ్రీరామచంద్రమూర్తి - ఈ రెండూ ఒక విరాట్స్వరూపుని రూపాలే అంటున్నట్లున్న పరమయోగి రామకృష్ణ పరమహంస...

స్తోత్రం ముగించి కళ్ళు తెరిచాడు ప్రభాకర్-ఎదురుగా నిలబడ్డ మయూరను చూసి అతడు ఆనరదంతో వుబ్బి తబ్బిబ్బయ్యాడు.

"అమ్మా! లేచావా!" అన్నాడు ఆప్యాయంగా దగ్గరిగా వచ్చి-మయూర అతణ్ని వింతగా చూసి, చుట్టూ చూసింది.

"ఇదేమిటి? నేనెక్కడున్నాను? ఇదెవరిల్లు? మీరెవరు?" అంది.

ప్రభాకర్ కళ్ళలో కరుణ తొణికిలాడింది. దారితప్పిన పసిపాపను చూసినట్లు మయూరను చూస్తూ అభిమానంగా "నువ్వు నా కోడలివమ్మా!" అన్నాడు

అదిరిపడింది మయూర-అప్పుడు మెడవైపు చూసుకుంది. ధగధగలాడుతూ పైటలోపలనుంచి మెరుస్తూ కనబడింది మంగళసూత్రం వెంటనే ఘాటైన బ్రాందీవాసన - మొరటు చేతులు-అత్యంత జుగుప్సాకరమైన స్పర్శ-ఒకదానినొకటి తగుముకుంటూ మనసులో మెదిలి, భరించరాని బీదరతో మనసును ఊపేసాయి - ఆర్తనాదం చేస్తున్నట్లుగా "అయ్యో!" అని గుమ్మంలో కూలబడింది. ప్రభాకర్ మయూర పరిస్థితి అర్థం చేసుకున్నాడు. ఆవిడ అనుభవిస్తున్న

చిత్త సంక్షోభానికి ఆయన మనసు కరిగిపోయింది. అయినా అ సమయంలో ఆయనకు ఆవేదనకంటే ఆనందమే ఎక్కువ కలిగింది. మయూరలో పూర్వపు స్థితి పోయింది. ప్రస్తుతానికి అది ముఖ్యం. ఆ తరువాత పరిస్థితి అర్థం చేసుకొంటుంది. నెమ్మదిగా తనే సర్దుకొంటుంది. ఎంతటివారైనా ఏదో ఒక దశలో జీవితంతో రాజీ పడవలసిందే.

"అమ్మా! భగవంతుడికి నమస్కారం చెయ్యి." బుజ్జగిస్తున్నట్లుగా అన్నాడు ప్రభాకర్. మయూర నమస్కారం చెయ్యలేదు. శూన్యంగా చూసింది. భగవంతుడు! ఆ నాడు ఈ భగవంతుణ్నే మనసారా ధ్యానించింది. ఈ భగవంతుణ్ని ప్రార్థిస్తున్న పారవశ్యంలో తానున్నప్పుడే, ఆ రోజు ... నిలువునా వణికింది మయూర. ఆది ప్రభాకర్ దృష్టిని దాటిపోలేదు.

"నమస్కారం చెయ్యమ్మా." అన్నాడు శాంతంగా.

"నువ్వు చేసిన ఈ అన్యాయానికి అర్థమేమిటి," అన్నట్లు భగవంతుణ్నే చూస్తోన్న మయూర తన చూపులను ప్రభాకర్ వైపుకి తిప్పింది.

"నేను చెయ్యను-ఈ భగవంతుడే నన్ను సర్వనాశనం చేసాడు-ఇంకమీదట ఈ భగవంతుణ్ని నేను నమ్మను."

ఆ మాటల్లో, ఆ చూపుల్లోవున్న విరక్తి అర్థమయింది ప్రభాకర్‌కి.

"అమ్మా! సర్వనాశనం అనే మాటకి అర్థంలేదు. ఈ సృష్టిలో ఎప్పుడూ ఏదీ సర్వనాశనం కాదు. భగవంతుడు

నీకు మానవజన్మ ఇచ్చాడు—పద సద్వివేచనాదక్షత ఇచ్చాడు. నీ జీవితాన్ని ఉన్నత పథాలలో నడిపించుకోగలిగే శక్తినీ, సామర్థ్యాన్ని ఇచ్చాడు—ఇంక నీకు నాశనమేముంది తల్లి! జీవితంలో సంభవించే ఒడిదుడుకులు నీకు పరీక్షలు—నీ మానవత్వానికి ఒరపిడిరాళ్ళు. ఉత్తమ విద్యార్థినిలా పరీక్షల నెదుర్కోవాలి కాని, పోకిరీ పిల్లల్లా పరీక్షలు వద్దని పరీక్షాధికారిని నిందించటం న్యాయమేనా?" తలెత్తి ఆశ్చర్యంగా చూసింది మయూర. ఆమెలో అంతకుముందెన్నడూ లేని గౌరవం ఆ వ్యక్తిపట్ల కలిగింది. కాని, అప్పటికీ భగవంతుడికి నమస్కారం చెయ్యలేదు. తిరిగి ఆమెను బలవంతం చెయ్యలేదు ప్రభాకర్. "కమలా!" అని పిలిచాడు—లోపలనుంచి కమలవచ్చింది. కమల, మయూర ఒకరినొకరు చూసుకున్నారు. నాలుగు పదులు దాటినా ఇంకా ఎంతో అందంగావున్న ఆవిడ ఎవరో అర్థంకాలేదు మయూరకి. మయూరను చూడగానే ఏదో అసహనభావం కదిలింది కమలలో—అది పసికట్టినట్లు 'కమలా' అన్నాడు ప్రభాకర్ మందలింపుగా. అతని చూపులలో ఏముందో కాని, కమల ఒక్కసారిగా మారిపోయింది. మయూర చెయ్యి పట్టుకొని "రా అమ్మా!" అంది. "మీ అత్తగారు!" అని పరిచయం చేసాడు ప్రభాకర్. మరోసారి నిలువునా వణికింది మయూర. అది చూసి కమల బొమ్మలా నిలబడిపోయి, "లోపలకి తీసుకువెళ్ళు!" అన్న ప్రభాకర్ హెచ్చరికతో మయూర చెయ్యిపట్టుకుని ఇంట్లోకి తీసుకువెళ్ళి "ఇది వంటగది, ఇది హాలు, అది పూజామందిరం..." అని పరిచయం చేస్తూ ఒక గది దగ్గరకు వచ్చి ఆగిపోయి, చిన్న

నవ్వుతో "ఇది నీ గది..." అంది. డబల్ కాట్స్‌తో నీట్‌గా వున్న ఆ గదిముందు నిలబడిపోయింది మయూర. "ఇది నీ గది! ఇది నీ గది!" అన్న కమల మాటలు తలలో హోరు మంటున్నాయి. డబల్ కాట్స్! ఒక మంచంమీద ... తనూ, మరో మంచంమీద ... బ్రాండీ వాసన. మొరటు చేతులు-మృగంలాంటి ప్రవర్తన-చీదర-జుగుప్స-

తూలి తనమీద పడిన మయూరను పొదివి పట్టుకుని "కాఫీ తాగుతావా, అమ్మా!" అంది కమల. మయూర అవస్థ నెమ్మది నెమ్మదిగా కమలకు అర్థమవుతోంది. అసహా నాన్ని తొలగించుకొంటూన్న ఆ మాతృ హృదయంలో మమత చోటు చేసుకొంటోంది.

"ముందు ముఖం కడుక్కుంటాను." అంది మయూర. కమల "రమణమ్మా" అని పనిమనిషిని పిలిచింది. పనిమనిషి వచ్చాక "అమ్మాయిగారికేం కావాలో చూడు!" అంది.

"రండమ్మా!" అని బాత్‌రూంలోకి దారి తీసింది. రమణమ్మ - టూత్ పేస్ట్, బ్రష్ వగైరా అందించింది- అది వాగుడుకాయ. తనపని తను చూసుకొనిపోయే రకం కాదు. అన్నీ కావాలి! "పొద్దున్న సర్సమ్మ మీ ముఖం కడిగించిం దమ్మా! అయ్యగారే మీకు పాలు పట్టించారు. మీరు మన తెలివిలో లేరనుకోండి. పసిబిడ్డలాగ ఎవరేం చెయ్యమంటే అది చేసేవారు. ఓరి బాబోయ్! మీ మావగారు మిమ్మ ల్నెట్టా కనిపెట్టుకున్నారండీ! కంటికి రెప్పలా కాపాడుకు న్నారండీ! ఈ నాడు మీరిట్టా తిరుగుతున్నారంటే ఆరిచలవే నండి!" అంది.

ఆ మాటలన్నీ వింటూ పళ్ళు బ్రష్ చేసుకోవటం పూర్తి చేసింది మయూర. ఆ తరువాత, నోట్లో నీళ్ళు పోసుకుని పుక్కిలించటం మొదలుపెట్టింది. అనాటి సంఘటన గుర్తొచ్చింది. అకస్మాత్తుగా... ఇక ఒకటే, నీళ్ళు పుక్కిలించి ఉయ్యటం ప్రారంభించింది-మూడు బక్కెట్ల నీళ్ళు పుక్కిలించి ఆక్కడితో అలిసిపోయి విరమించుకొంది. రమణమ్మ గుండె బాదుకుంటూ కమల దగ్గరకు వచ్చి, హమ్మ నాయనోయ్! అమ్మాయిగారు మూడుబకెట్ల నీళ్ళు పుక్కిలించి వుమ్మేసారు!" అంది. కమల ప్రభాకర్ వైపు చూసింది. ప్రభాకర్ నిట్టూర్చి "మంచిదే! ఏ ఆలోచనా లేకుండా మరబొమ్మలా పడివుండడం కంటే, అలోచనలతో సతమతమవుతూ మనిషిలా బ్రతకడమే మంచిది!" అన్నాడు.

రమణమ్మ తెచ్చిన కాఫీతాగి కూచోలేక పడుకోబోయింది మయూర. కాని, ఆ గదిలోకి వెళ్ళటానికి కాని, ఆ మంచంమీద పడుకోవటానికి కాని ఆమె శరీరమూ, మనస్సూ ఎదురు తిరగ్గా, గిర్రున వెనక్కు తిరిగింది. ఎదురుగా నిలబడివున్నాడు ప్రభాకర్. "వెళ్ళి పడుకోనమ్మా!" మెత్తగా లాలిస్తున్నట్లు అన్నాడు-ఆ స్వరంలో ఏముందోకాని, దానికి ఎదురు తిరగ గలిగే శక్తి మయూరలో లేకపోయింది. వెళ్ళి కళ్ళు మూసుకుని పడుకుంది. ఒక కుర్చీ మయూర మంచం దగ్గరగా లాక్కుని కూచున్నాడు ప్రభాకర్- అమ్మా! నీకు చాలా ఘోరమైన అవమానం జరిగింది-నాకు తెలుసు- కానీ, దానికి పరిహారం కూడా జరిగిపోయింది. నిన్నెవడు పాడుచేసాడో వాడికే నిన్నిచ్చి పెళ్ళి చేసాను!"

ఈ మాటలు శూలాల్లా తగిలాయి మయూరికి. ఒక దుర్మార్గుడు తన బ్రతుకు పాడుచేసాడు. అందుకు పరిహారం ఏమిటి? వాడితోనే జీవితాంతం బ్రతుకు ముడి వేసుకోనటమా? ఆ దుర్మార్గాన్ని జీవితాంతం భరించటమా? భగవంతుడా! ఇదెక్కడి న్యాయం.

కమిలిపోతున్న మయూరి హృదయం కన్నీరుగా స్రవించింది. ఆ కన్నీటిని తుడవగలిగే శక్తి ప్రభాకర్‌కికూడా లేకపోయింది.

"అమ్మా! గతాన్ని తుడిచివేయలేను. కానీ, ఇక ముందు మాత్రం నీ కోసం- నీ ఆనందం కోసం_ ఏం చెయ్యటానికయినా సిద్ధంగా వుంటాను. నా కొడుకు నీకు చేసిన అన్యాయానికి ఏ పరిహారమయినా చెల్లించుకుంటాను.,,

ఉద్రేకంగా అన్నాడు ప్రభాకర్. చెమ్మగిల్లిన కళ్ళతో వింతగా చూసింది. అంతటి అల్లకల్లోలం లోనూ, ఆ మాటలు ఎదో ఊరట కలిగించాయి. పైట కొంగుతో కళ్లు తుడుచుకుంది.

ఆ టౌన్‌లో ఆ కాలేజిలో చదవలేక వేణు టి. సి. తీసుకున్నాడు. ప్రభాకర్ ప్రయత్నం వల్ల అతనికి మరో కాలేజీలో సీట్ దొరికింది. ఈ సారి వేణు అల్లరి వేషాలను క్షమించవద్దని ప్రిన్సిపాల్‌తో చెప్పాడు ప్రభాకర్ వార్తలు

ఎలా ప్రచారమవుతాయో. వేణు చేసిన ఘనకార్యం అందరికీ తెలిసిపోయింది ఆడపిల్లలూ, మొగపిల్లలూ అందరూ అతన్ని పురుగులా చూడసాగారు. వేణు డబ్బుకూడా అతడికి స్నేహితులను కొనిపెట్టలేక పోయింది. అదీకాక, అతడికి ఇదివరకులాగ కోరినంత డబ్బు అందటంలేదు. జరిగినదానికి బెదిరిపోయి, కమల తండ్రికూడా ప్రభాకర్ కి తెలియకుండా మనవడికి డబ్బియ్యటం మానేసాడు. తన తోటివాళ్ళ నిరసననూ, చీదరనూ భరించటం అతని శక్తికి మించిపోయింది. మానసికమైన అశాంతి భరించలేక అతడు త్రాగుడును ఆశ్రయించాడు. చిత్తుగా తాగటం-ఒళ్ళెరక్కుండా పడుకోవటం- ఇలా దొర్లిపోతున్నాయి అతనికి రోజులు! ఆ మైకంలో పడివున్నంతవరకే అతనికి సుఖంగా వుంటుంది. ఈ పరిస్థితుల్లో అతనికి తండ్రి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. మయూరకు బాగుపడిందనీ, వెంటనే రమ్మనీ- వేణుకు మండిపోయింది. ఇన్నాళ్ళూ అతని మనసులో ఒక ఆశ వుండేది. మయూర పిచ్చిదయిపోతుంది. పిచ్చిదని మయూరను వదిలేసి, మరొకరిని పెళ్ళి చేసుకోవచ్చును. కానీ, మయూర బాగుపడిందనేసరికి, అతనిలో ఆ ఆశకూడా హరించుకుపోయింది. తన కళ్ళముందే తన ఇద్దరు స్నేహితులు అనుభవించిన స్త్రీ తనభార్య - ఎంత మరిచిపోదామన్నా ఆ దృశ్యం అతడికి మరపు రావటం లేదు. వాళ్ళు మయూరమీద పడి ముద్దాడటం-మయూర ముఖం తిప్పుకుంటూ బాధగా కేకలువెయ్యటం- నగ్నంగా వున్న మయూరను వాళ్ళిద్దరూ చెరోవైపు నుంచీ క్రూరంగా నలిపెయ్యటం-

భరించలేక పోతున్నాడు అతడు. విధిలేక ఇంటికి వచ్చాడు. త్రాగిత్రాగి ఎర్రబడ్డ కళ్ళతో - కళతప్పిన ముఖంతో కొడుకును చూడగానే, కమలకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "రా నాయనా! ముఖం కడుక్కున్నావా? కాఫీ తాగుతావా?" అంది. ప్రభాకర్ కొడుకును పలకరించలేదు. వేణు ఆకృతిచూస్తే అతడికి మనసు ముక్కలవుతోంది. ఇతడిని మంచిమాటలతో మార్గంలో పెట్టగలడా? లేక మందలించితే ప్రయోజనం వుంటుందా? మయూరి కొంచెం సహకరించ గలిగితే......

"అమ్మా! మయూరా-" అని పిలిచాడు.

మయూర వచ్చింది. చాలా రోజుల తరువాత మయూర, వేణు ఒకరినొకరు చూసుకున్నారు. అతన్ని చూడగానే ఆమె కళ్ళలోకి రక్తం వుబికింది. ఆ చూపులు కాల్చేసేలా వున్నాయి. వాటికి తట్టుకోలేక బాత్ రూంలోకి పారిపోయాడు వేణు. ప్రభాకర్ మనసు ఉసూరుమంది. ప్రభాకర్ ముఖంలోకి చూసిన మయూర అతని మనసు అర్థం చేసుకుంది. "నన్ను క్షమించండి!" అంది గొణుగుతున్నట్లు. కొంచెం స్థిమితపడ్డాడు ప్రభాకర్ - 'నేను కాదమ్మా నువ్వే క్షమించడానికి ప్రయత్నించు" అన్నాడు.

వేణు బాత్ రూంలో స్నానం చేస్తున్నాడు.

ఆ పక్కనే వరండాలో గోడకానుకొని నిలబడిపోయింది. చాలాసేపు అలా నిలబడ్డాక లేచి గదిలోకి వెళ్ళి అతడి పెట్టె తెరిచింది. బ్రాందీసీసాలూ, బూతుబొమ్మల పుస్తకాలూ .... వెలపరంతో పెట్టెమూత దభాలున వేసే

సింది. మళ్ళీ ఆ పెట్టె తెరవటానికి మనస్కరించలేదు. తను ఆరేసి మడతపెట్టిన ప్రభాకర్ లుంగీ తీసుకుని బాత్ రూం దగ్గిర నిలబడింది. టవల్ చుట్టుకొని వేణు బయటికి రాగానే లుంగీ అందించింది. నిర్విణ్ణపోయి చూసాడు వేణు. ఆ చూపులను ధైర్యంగా ఎదుర్కొంది మయూర. ఆమె చూపులలో ఏ భావమూ లేదు. వేణు లుంగీఅందుకున్నాడు. ఆ తరువాత అతడికి కాఫీ మయూరే అందించింది కమలా, ప్రభాకర్‌లు అతనితో మాట్లాడుతోంటే తనూ అక్కడే కూచుంది. భోజనంకూడా వడ్డించింది. మయూర ప్రవర్తనకు కమల ఆనందించింది. కానీ మయూర శరీరం మాత్రమే అక్కడ వుందని అర్థం చేసుకున్నవాడు ప్రభాకర్ ఒక్కడే!

పడక గదిని ప్రత్యేకించి అలంకరించడానికి ఎవరూ ప్రయత్నించలేదు. భోజనం చేసివచ్చి మంచంమీద పడుకున్నాడు వేణు. అతడికి మంటలమీద వున్నట్లుగా వుంది. అత్తగారికి సాయంచేసి తనూ గదిలోకి వచ్చింది మయూర. ఆమెలో ఏ వికారమూ లేదు. శిలలావుంది. వేణునుచూస్తూ నిలబడింది. అలాంటి మయూరను చూస్తే, వేణుకి భయంగా వుంది. కోపంగా వుంది. కసిగావుంది. అన్నింటినీ మించి వుడుకుమోతుతనంగా వుంది. మయూర ముఖంలోకి చూసి "నిన్ను ఆ వెధవలిద్దరూ కూడా అనుభవించారు" అన్నాడు.

మయూర నవ్వింది. అది కృత్రిమమైన నవ్వు కాదు గెలిచినట్లున్న నవ్వు. అతడి క్షోభను గేలి చేస్తున్నట్లున్న నవ్వు. వేణుకి కోపం అవధులు దాటుతోంది. ఏం మాట్లాడుతున్నాడో తెలియటం లేదు.

"నా పెళ్ళాన్నయ్యావని మురిసి పోతున్నావేమో! నువ్వు ఒక్కనాటికీ నా పెళ్ళానివి కావు. నీ లాంటి చెడి పోయింది నా పెళ్ళాం కాదు."

కిలకిల నవ్వింది మయూర. ఆమె అలా నవ్వి ఎన్ని రోజులయిందో! బయటినుంచి ఆ నవ్వువిన్న కమలా ప్రభాకర్‌లు స్థిమితపడ్డారు. ఆ నవ్వుతో మరింత రగిలిపోయిన వాడు వేణు మాత్రమే.

మయూర తన మంచంమీదకు పోయి పడుకుంది. ఆమె మనసుకు చాలా ప్రశాంతంగా వుంది. ఏ రోజుని తలుచుకుని ఇటీవల ఆమె రాత్రింబగళ్ళు హడిలిపోతోందో, ఆరోజు తన మనసు ఇంత సంతృప్తిగా, ప్రశాంతంగా వుండటం ఆమెకే ఆశ్చర్యంగావుంది. కొద్దిసేపట్లోనే మయూర సుఖంగా నిశ్చింతగా నిద్రపోయింది. వేణుకు నిద్ర రాలేదు. పక్కనే పడుకున్న మయూరిను చూస్తోంటే, అతనిలో కోరికలు కలగకపోగా ఆనాటి తన స్నేహితుల కిరాతక దృశ్యాలు గుర్తొచ్చి ఏదో అసహ్యం కలుగుతోంది. ఇది తన భార్య కాదు. తన భార్యస్థానంలో వుండటానికి వీల్లేదు. కానీ ఎలా ?ఏం చెయ్యగలడు? ఈ నాన్న... పళ్ళు కొరుక్కున్నాడు. జుట్టు పీక్కున్నాడు. అంతకంటే ఏం చెయ్యలేకపోయాడు.

తెల్లవారింది. మయూర కళ్ళు తెరవగానే ఎర్రబడ్డ కళ్ళతో వేణు కనబడ్డాడు. అతడు రాత్రంతా నిద్రపోలేదని ఆ కళ్ళను చూస్తేనే అర్థమయింది మయూర తను మంచం

మీద నుంచి లేచి "ఇప్పుడయినా కొంచెంసేపు నిద్రపోండి" అంది దయగా.

ఈడ్చి చెంపమీద కొట్టినట్టుగా అయింది వేణుకి. ఆ రోజు చూసేవాళ్ళకి మామూలుగానే వుంది. మయూర వేణుకి కావలసినవన్నీ తనే చూస్తోంది. వేణు మనసులో మంటలు అతడి నొక్కడినే కాల్చేస్తున్నాయి. ఎలాగయినా మయూరను ఏడిపించాలని వుంది అతనికి. రమణమ్మ కూతురు లక్ష్మి-పధ్నాలుగేళ్ళది. పసితనపు అమాయకత్వం కొంత-వెర్రిబాగులతనం కొంతా, కావాలని మయూరకి చూస్తుండగా దానితో సరసాలాడడం ప్రారంభించాడు. ఆ పసిదాని జీవితం ఏమయిపోతుందోననే భయం మయూర కళ్ళల్లో కదిలింది, అది మరోరకంగా అర్థం చేసుకుని మరింత విజృంభించాడు అతను.

"నువ్వెంత బాగుంటావ్?" అన్నాడు.

"బాగుంటానా! ఇహిహి! అమ్మగారికంటేనా?" అంది అది.

"ఛా! నీ ముందు అమ్మగారేం బాగుంటుంది?" అది గొప్పపడిపోయింది.

"ఇది తీసుకో" వందరూపాయల నోటు అందించాడు.

"హమ్మో!,, గుండె బాదుకుంది అది.

"ఫరవాలేదులే! ఉంచుకో!,,

"ఎక్కడికి రాను?"

"ఏమిటీ?,,

భలేవారే! ఎక్కడికి రావాలో చెప్పరే! వంద రూపాయలు పట్టిపుణ్యానికే ఇచ్చారా! మొన్న సుబ్బారావుగారి అబ్బాయి యాభై రూపాయలే యిచ్చి అల్ల కారుషెడ్లోకి రమ్మన్నాడు."

తెల్లబోయి చూసాడు వేణు. మయూర నవ్వు ఆపుకోలేకపోయింది. అంతలో కమలకూడా అక్కడికి వచ్చి మయూర చూస్తున్నవైపుకి చూసింది. ఆవిడ మనసు కలుక్కుమంది. అత్తాకోడళ్ళిద్దరూ ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు ఇద్దరిలో ఏ ఒక్కరూ మాట్లాడలేదు. ఇంతలో రమణమ్మ బారలు జాచుకొంటూ పోట్లాటకి వచ్చింది.

ఏందమ్మో! మీ అబ్బాయి మా పిల్లదానికి వంద రూపాయలు ఆశచూపి పాడుచెయ్యాలని చూస్తున్నాడంట! మా ఇంటావంటా లేవు ఇట్టాంటి బుద్ధులు."

రమణమ్మ అరుస్తోందేగాని, వందరూపాయలు తిరిగి ఇయ్యలేదు. అది ఇంతగా పోట్లాడకపోను-కాని, వేణు తన కూతురికి వందరూపాయలివ్వటం అత్తాకోడళ్ళిద్దరూ చూసారని దాని తెలిసిపోయింది.

"కీఛూ! ఇట్టాంటిళ్ళలో పని కొప్పుకోవటమే బుద్ధి తక్కువ" అని అరుచుకుంటూ వెళ్ళిపోయింది.

"దాని నోరు మంచిదికాదు. చుట్టుపక్కల ఇళ్ళలో ఏం వాగుతుందో, ఏమిటో!" దిగులుగా అంది కమల. మయూర సమాధానం చెప్పలేదు. ఆ రోజు అర్ధరాత్రి ఇంటికి తప్పతాగి వచ్చాడు వేణు. ప్రభాకర్ మనసు రగిలి పోతున్నా, ఏం చెయ్యలేకపోతున్నాడు. ప్రభాకర్ మాటలు

వినిపించుగానే నిశ్చింతగా లేచాడు వేణు. ఏం తింటున్నాడో కూడా తెలియకుండా తిండి తిన్నాడు. గదిలో ప్రవేశించాడు. నిద్రపోతున్న మయూరిమీద పడ్డాడు. బ్రాందీ వాసన — మొరటు చేతులు — కెవ్వున కేక వేసింది మయూర. ఆమె తప్పించుకోవటానికి వీలులేకుండా ఆక్రమించుకోవాలని ప్రయత్నిస్తున్నాడు వేణు. మయూర మరింతగా అరవసాగింది ప్రభాకర్ నిద్రలోంచి లేచివచ్చి తలుపులు బాదుతూ "వేణూ! తలుపు తెరు!" అన్నాడు. వేణు ఒక్కసారిగా చప్పబడిపోయాడు. మయూర తనే తలుపు తెరిచి బయటికి వచ్చేసింది. అప్పటికే వణికిపోతున్న మయూరచుట్టూ ఓదార్పుగా చెయింవేసి "భయం లేదమ్మా, భయం లేదు." అన్నాడు. వేణును కోపంగా చూస్తూ "నా ఎదుట ఈ అమాయకురాలిని బలాత్కారం చేస్తే మాత్రం సహించను" అన్నాడు.

వేణు ముద్దముద్దగా "నా భార్య! బలాత్కారం ఏమిటి?" అన్నాడు.

"దురాత్మరుడా! భార్య అయినంతమాత్రాన ఇష్టం వున్నా, ఇష్టం లేకపోయినా పశువులా మీదపడే అధికారం వుందనుకున్నావా? భార్యనయినా సరే, ఇష్టంలేని ఆడదాన్ని మొగవాడు బలవంతం చేస్తే అదిబలాత్కారమే! బయటి నడు!" అని వేణుని చెయ్యి పట్టుకుని బయటకు లాక్కొచ్చి "అమ్మా గదిలో తలుపులు వేసుకుని పడుకో" అన్నాడు మయూరతో.

త్రాగిన మైకంతో, కోపంతో, కసితో, రాత్రంతా

మయూరను నోటికొచ్చినట్లు తిడుతూనే వున్నాడు వేణు. కమల కుమిలికుమిలి ఏడ్చింది. ప్రభాకర్ లేచి వేణు తలదగ్గిర కూచుని అతని తల ఆప్యాయంగా నిమరసాగాడు. ఆ స్పర్శలో ఏం ఉందో! ఎంతో సేపటికి వేణు నిద్రపోయాడు.

కమల ఆ మరునాడు, మయూరను దగ్గిర కూచో బెట్టుకుని "ఇలా అయితే ఎలాగమ్మా! వాడు మరింత పాడయిపోడూ?" అంది ప్రాధేయపడుతున్నట్లు.

మయూర కన్నీళ్ళతో "ఆ బ్రాందీ వాసన నాకు ఆ నాటి సంఘటన గుర్తు తెస్తోందత్తయ్యా! మీ అబ్బాయి తాగకుండా వస్తే నేను ఏమీ అనను" అంది.

వేణు తాగకుండా మయూరను సమీపించలేదు. అతనికి వంటిమీద తెలివి వున్నంతవరకూ, తన స్నేహితులు మయూరను పాడుచేసిన దృశ్యం మరిచిపోలేదు.

# 12

మెత్తని స్పర్శ-అభిమాన పూరితమైన స్పర్శ - వేళ్ళ అంచులలో గుండె లోతులలోని అనురాగం ప్రసారంచేస్తున్న స్పర్శ-గాయాల బాధను మరిపించి ఏదో అనిర్వచనీయమైన హాయి సందిస్తోన్న స్పర్శ-సమస్తమయిన అశాంతినే దూరం చేస్తూ మనసును ప్రశాంతిలో ఓలలాడించే స్పర్శ.

కళ్ళు తెరిచాడు యతి. నుదుటిపై తడిగుడ్డ వేసి అదుముతోన్న మయూర కనిపించింది. నలిగిన చీర - దీనంగా

కన్నీటి చెరువులులా వున్న కళ్ళు - జరిగిపోయిన సంఘటనల్లా చెల్లాచెదురుగా రేగిపోయివున్న జుట్టు.

ఇద్దరి చూపులూ ఒకదానితో ఒకటి చిక్కుకొని వుండిపోయాయి. పసితనపు ఆటపాటలు, తమకు తెలియకుండానే తమ మధ్య అల్లుకుపోయిన అనుబంధం ఆ తరువాత - దారుణమైన దుర్ఘటనలు-ఒక విధమైన అర్ధచైతన్యావస్థలో మయూరి పెళ్ళి-అన్నీ ఆ కళ్ళముందు కదిలిపోయాయి. ఇద్దరి కళ్ళలోనూ నీళ్ళు-ఎన్నెన్నో చెప్పాలనివుంది యతికి. కానీ ఆ నాటి రాజ్యలక్ష్మి మాటలు అతనినోరు నొక్కేస్తున్నాయి జైలునుంచి విడుదల కాగానే తిన్నగా వేదాంతయ్య ఇంటికే వచ్చాడు. మయూరకు పెళ్ళయిపోయిన వార్తవిని నిర్ఘాంతపోయాడు-అంత హడావిడిగా ఎందుకు చేయవలసి వచ్చిందో రాజ్యలక్ష్మి ఏడుస్తూ వివరించేసరికి యతి యువకరక్తం సల సల మరిగిపోయింది. పిడికిళ్ళు బిగించి "ఏమిటీ అన్యాయం? ఇంత నీచానికి పాల్పడిన ఆ నికృష్టుడికి-ఒక అమాయకురాలిని నిర్దాక్షిణ్యంగా చెరచిన ఆ రాక్షసుడికి-పువ్వులాంటి మయూరను బలిచేస్తారా? నేనిప్పుడే వెళ్ళి..." అని ఉద్రేకంగా అంటున్న యతిని "బాబూ!" అని భయంగా అడ్డుపడింది రాజ్యలక్ష్మి. కన్నీళ్ళతో చేతులు జోడించి "యతీ- అతి దారుణం జరిగిపోయింది-కానీ, ప్రభాకర్‌గారి దయవల్ల ఎలాగో సమస్య పరిష్కారమయింది. ఇప్పుడిప్పుడే అందరం స్థిమిత పడుతున్నాం. ఇప్పుడు నువ్వెళ్ళి కుదుటపడ్డ దాని బ్రతుకు పాడుచెయ్యకు" అంది.

ఆ కన్నీళ్ళముందు-జోడించిన ఆ చేతులముందు- యతి వుద్రేకం చప్పబడిపోయింది. మనసు ఎంత ఎదురుతిరుగుతున్నా తలవల్ల మయూరకు ఏ చికాకూ కలగకూడదని, అంతలో వెంకటయ్యగార పిలుపు వచ్చింది. అసలే ఆశాభంగంతో వున్న హృదయం మరింత తెగింపుతో ఉద్యమం లోకి దూకింది

తన నుదుటిమీద తడగుడ్డ వత్తుతోన్న మయూర చేతిమీద చెయ్యివేసాడు. నిలువునా వణికింది మయుర. మామగారు తనమీద వుంచిన విశ్వాసం గుర్తుకొచ్చింది. చెయ్యి వెనక్కి తీసుకుంది. మయూరను కొత్తగా వింతగా చూశాడు. మయూర తల దించుకుంది. ఒక్క దీర్ఘనిశ్వాసం వదిలాడు యతి.

"సారీ మయూరా! ఇంక బ్రతకననుకున్నాను. అందుకే నీ దగ్గరకు వచ్చాను. చివరిసారి చూద్దామని. ఇలా బ్రతుకుతానని తెలిస్తే రాకపోదును"

అక్కడ నిలవలేకపోయింది మయూర. ప్రభాకర్‌ను వెతుక్కుంటూ వెళ్ళింది. ఏదో అరవిందుడి పుస్తకం చదువుకుంటున్నాడు. తనఎదుట కన్నీళ్ళు ఆపుకోకుండా ఏడుస్తూ నిలబడ్డ మయూరను చూసి కంగారుగా లేచి "ఏమ్మా! ఏమయింది? అతను క్షేమంగా వున్నాడా?" అన్నాడు గాభరాగా.

మయూరకళ్ళు తుడుచుకొని బొంగురు గొంతుకతో "ఆc! క్షేమంగా వున్నాడు. ఇప్పుడే కళ్ళు తెరిచాడు. మీరు రండి" అంది

అతడు బాగుంటే, పైగా కళ్ళు తెరచి మాట్లాడు తోంటే, మయూరకు కన్నీ రెందుకు? మనసులోని ఈ ప్రశ్న పైకి రానీయలేదు ప్రభాకర్. యతి మంచం దగ్గరకు వచ్చాడు పడుకున్నవాడు లేవబోయాడు యతి.

"లేవకు! లేవకు! పడుకో! కళ్ళు తెరిచి మాట్లాడగలుగు తున్నావు. అదే భాగ్యం!"

"చావబోతున్న వాడిని బ్రతికించారు. మీకు నాకృత జ్ఞత ఎలా చెప్పుకోను?"

"పిచ్చివాడా! నువ్వు నాకు కృతజ్ఞుడివై వుండక్క ర్లేదు. నా బాధ్యత నేను నిర్వర్తించాను అంతే! పోలీసులు నిన్ను గూండాగా లిఫ్టులో ఎక్కించారు. నీ ముఖం చూస్తే నీవు గూండావి కావని అర్థమయింది. ఇందులో ఏదో కుంభ కోణం వుందని అనుకున్నాను అంతేకాక నువ్వు మయూరిను వెతుక్కుంటూ రావడంతో, మాకు కావలసిన వాడివని అర్థ మయింది. ఇంక నిన్ను కాపాడకుండా ఎలా వుంటాను? ఇప్పుడేకాదు-ఇక ముందుకూడా నా దగ్గర వున్నంతవరకూ నీకు భయంలేదు-నీకు భయంలేదని తెలిసేవరకూ నిన్ను కదల నివ్వను."

ప్రభాకర్ ఈ మాట అంటున్నప్పుడే వేణుకూడా అక్కడికి వచ్చాడు. సాధారణంగా వేణు తండ్రిని తప్పుకు తిరుగుతాడు. కానీ, తన యింట్లో ఆశ్రయంపొంది మయూర సపర్యలందుకొంటున్న ఆ వ్యక్తి ఎవరో తెలుసుకోవాలని వచ్చాడు. మంచంమీద పడుకున్న యతిని చూడగానే తృళ్ళి పడ్డాడు. వేణు ముఖం చూడగానే యతి రక్తం సలసల మరి

గింది. అతడు తన ఎదుట కూర్చున్న సహృదయుని కొడుకు అనే మాటకూడా మరిచిపోయాడు. వేణు పరిస్థితీ అలాగే వుంది. ఇద్దరూ ఒకరినిచూసి మరొకరు పగబట్టిన పాముల్లా బుసలు కొట్టారు.

ఇదంతా గమనించికూడా గమనించనట్లు గంభీరంగా "వేణు! ఇతడు యతి: మన మయూరగ బంధువు. కొన్నాళ్ళు మనయింట్లో వుంటాడు" అన్నాడు. అతి మామూలుగా పరిచయం చేస్తున్నట్లు.

వేణు తల దిమ్మెక్కిపోయింది. ఇటీవల తండ్రితో సాన్నిహిత్యం పెరిగినకొద్దీ, తండ్రి స్వభావం బాగా అర్థమవుతోంది.-యతికీ తనకూ యెలాంటి పూర్వ పరిచయమో చెప్పడం వల్ల తనకు తండ్రి సానుభూతి లభించదు. యతి సమక్షంలో అవమానం యెదుర్కోవలసి వచ్చినా రావచ్చును. గిర్రున తిరిగి వెళ్ళిపోయాడు. ఏం చెయ్యలేని పౌరుషంతో రగిలిపోయాడు. కనీసం సభ్యత కోసమైనా యతిని పలకరించలేదు. చరచరా వెళ్ళిపోయాడు.

# 12

యతి కోలుకుంటున్నాడు. కొద్దిగా లేచి తిరగగలుగుతున్నాడు. అతడు బాగుపడుతున్నకొద్దీ మయూర అతనికి సాధ్యమైనంత దూరంగా వుంటోంది. ఈ విషయం అర్థంచేసు

కున్నాడు యతి. మయూరితో సంభాషణ పెంచడానికి అతడు ప్రయత్నించలేదు. అప్పుడప్పుడు ఇద్దరూ ఒకరికొకరు తారస పడతారు. వాళ్ళకళ్ళు కలుసుకుంటాయి. అవి మూగగా మాట్లాడుకుంటూ వుండిపోతాయి. ఇద్దరూ తమవునికినే మరిచి పోతారు. అంతలో యేదో అలికిడి అవుతుంది. మయూర ఉలికిపడుతుంది. ఏ దెయ్యమో తరుముకొస్తున్నట్లు అక్కడి నుంచి పారిపోతుంది! మయూర యిలా యతికి దూరదూరంగా వుంటటం కమలకు చాలా సంతృప్తి కలిగించింది. లేచి తిరిగే ఓపిక రాగానే "ఇక నేను వెళ్తాను" అన్నాడు యతి ప్రభాకర్‌తో.

"కూచో!" అన్నాడు ప్రభాకర్.

యతి కూచున్నాడు. ప్రభాకర్‌తో కలిగిన ఈ కొద్ది రోజుల పరిచయంలోనూ, అతడంటే చాలా గౌరవం పెరిగింది యతిలో.

"నువ్వు ఇలా ప్రాణాలు పణంగా పెట్టి నడిపిస్తోన్న ఉద్యమం యేమిటి? దానిగురించి వివరంగా చెప్పు."

యతి తల దించుకున్నాడు. సమాధానం చెప్పలేదు.

"ఓహో ! సీక్రెసీకి భంగం కలుగుతుందని భయపడు తున్నావా? నీకు తెలియని 'సీక్రెట్స్' ఈ వుద్యమాలలో ఎన్నివున్నాయో నాకు తెలుసు. పోనీ ఇదిచెప్పు. వెంకటయ్య గారి రామదండువల్ల దేశానికి మేలు జరుగుతుందని నమ్ముతు న్నావా?"

ఈసారికూడా యతి సమాధానం చెప్పలేకపోయాడు. నిజానికి జైలులో "పులి" ఉరిశిక్ష కళ్ళారా చూసిన నాటి

నుంచీ అతనికి ఏది మంచో, యేది చెడో, ఎవరు నాయకులో, ఎవరు వినాయకులో తేలడంలేదు.

యతికి జైలు స్నేహితుడు వీరయ్య. తనపేరు తనకు పలకటం చేతకాక "యీరయ్య" అంటాడు. జైలు ఆవరణలో కొంతమేర కూరగాయల తోటలు వున్నాయి. తోట పని తెలిసినవాడని వీరయ్యని ఆ పనిలో పెట్టారు. యతిని మిగిలినవాళ్ళతో కలవనివ్వటం యిష్టంలేక, అతడినికూడా ఆ పనిలోనే పెట్టారు. వీరయ్య యేం మాట్లాడడనీ, మాట్లాడలేడనీ వాళ్ళకు తెలుసు. కొన్నిరోజుల్లోనే వీరయ్య యెంత అమాయకుడో యతికి తెలిసిపోయింది. గొడ్డులాగపనిచేస్తాడు. ఏదడిగినా అయోమయంగా చూస్తాడు. పేరుమాత్రం "యీరయ్య" అని చెప్తాడు.

ఆ రోజు మొక్కలకు కలుపుతీస్తూ ఒకచోట ఆయాసపడి పోతున్నాడువీరయ్య-"ఏమిటి వీరయ్యా! ఎందుకలాఉన్నవ్?" అని అడిగాడు యతి.

వీరయ్య సమాధానం చెప్పటానికికూడా ఓపికలేక ఒగరుస్తూకూలబడ్డాడు. యతి అతని దగ్గరగావచ్చి చూసాడు. జ్వరంతో వళ్ళు కాలిపోతోంది.

"అమ్మయ్యో! జ్వరంవచ్చింది నీకు - పనిలోకెందుకు వచ్చావ్? వార్డర్‌తో ఎందుకు చెప్పలేదూ?"

వీరయ్య దీనంగాచూస్తూ "నాకు తెలవదు బాబయ్యా! ఎవరికి చెప్పుకోవాలి? యెవరు నా మాటింటారు!" అన్నాడు.

"నాన్సెన్స్!" అంటూ లేచాడు యతి.

కానీ, అతికొద్ది సమయంలోనే ఆమాయకంగా అన్న

వీరయ్యమాటల్లో నిజం తెలిసివచ్చింది. ముందు అక్కడే ఉన్న పోలీస్ జవాన్‌తో చెప్పాడు. వాడు క్రూరంగా చూస్తూ

"ఏయ్! ఇట్లాంటి దొంగవేషాలు కుదరవు- పని చెయ్యండి" అని అరిచాడు. యతి యువరక్తం కుతకుత వుడికిపోతోంది. ఆ పోలీస్ జవాన్‌ని అక్కడికక్కడ రెండుచెంపలూ వాయగొట్టాలన్న వుద్రేకం బలవంతాన ఆపుకున్నాడు.

"దొంగవేషాలు కావు- వీడికి నిజంగా జ్వరం వుంది. కొంపదీసి వీడు గుటుక్కుమన్నాడంటే, నీ ఉద్యోగంపుటుక్కుమంటుంది" అన్నాడు యతి తీవ్రంగా. ఈ ధోరణిలో ఈ భాష పోలీస్ జవాన్‌కి అర్థమయింది. ఈ విషయం వార్డర్‌కి తెలిసి- వార్డర్ సూపరింటెండెంట్‌కి చెప్పి, అతడు జైలుడాక్టర్‌ని పిలిపించేసరికి పూర్తిగా రెండు రోజులు గడిచిపోయాయి. వీరయ్య పోలీస్ జవాన్ బండబూతులు కూడా వినే ఓపికలేక మూలుగుతూ పడుకుని వున్నాడు. కనీసం వీరయ్య యెలా ఉన్నాడో అయినా చూడటానికిలేకుండా యతి పనిలోకి పోవలసి వచ్చింది. ఆ సమయంలో యతికి గుర్తువచ్చాడు. వెంకటయ్య- ప్రతిరోజు వెంకటయ్య ఒకసారి యతిని కలుసుకొని మాట్లాడేవాడు. అప్పుడు చెప్పాడు. "సార్? వీరయ్యకి జ్వరంగా వుంది డాక్టర్‌రాలేదు అతడికి మంచినీళ్ళు అందించే దిక్కుకూడా లేదు" అని కానీ, వెంకటయ్య ముఖంలో యతి ఆశించిన గాభరా, ఆందోళన యేమీ కనిపించలేదు నిదానంగా "అలాగా కనుక్కుంటానుండు!" అన్నాడు. ఆ సాయంత్రం జైలు గదిలోకి వెళ్ళేసరికి యే డాక్టరూ రాలేదని తెలి

సింది. వీరయ్య కళ్ళు తెరవలేక పోతున్నాడు. మాట్లాడలేక పోతున్నాడు. 'దాహం' అని సైగ చేశాడు.

కుండలో నీళ్ళు అల్యూమినియం గ్లాసుతో వీరయ్య గొంతులో పోసాడు. యతి చెయ్యి కలిగిందంతే. మందూ మాకూ లేక, జ్వరంతో అల్లాడిపోతూ రాత్రంతా మూలుగుతూనే వున్నాడు వీరయ్య.

మరునాడు వచ్చాడు జైలు డాక్టర్. అతడు డాక్టరే! కానీ గవర్నమెంటు డాక్టర్. అందుచేత గవర్నమెంట్ వుద్యోగులందరిలోనూ వుండే నిర్లక్ష్యమూ, విసుగూ, అహంకారమూ అతనిలోనూ కనిపిస్తున్నాయి. దానికితోడు జైలు డాక్టర్ కావడంవల్ల చుట్టుపక్కల వాళ్ళని చీదరించుకొంటున్నట్లుగా చూడటంకూడా తోడయింది.

వీరయ్య చెయ్యి పట్టుకొని చూడకుండానే, రోగలక్షణాలేమిటని విచారించకుండానే యేదో మందు సిరంజిలోకి ఎక్కించి, ఇంజక్షన్‌తో పొడిచిపారేశాడు కసిగా. వీరయ్య ఒక్క ప్రాణం విలవిలలాడిపోయి కెవ్వుమన్నాడు. "గొడ్డులా అరవకు!" అని చీదరించుకు వెళ్ళిపోయాడు. "ఈ డాక్టర్ బాబు ఎవరికే రోగమొచ్చినా సూదిమందే యిస్తాడు" అన్నాడు మరో ఖైదీ.

వీరయ్యకి ఇంజక్షన్ చేసినచోట ఇంతలావున వాచిపోయింది. కాపడాలకుకూడా ఆస్కారమెక్కడిది? తన చేతోనే చుట్టు శాస్త్ర నెమ్మదిగా రాసాడు యతి. అతడు తన బలహీనమైన చేత్తో యతిశిరస్సును ఆప్యాయంగా నిమిరాడు.

ప్రకృతి తన బిడ్డలను తానే కాపాడుకొంటుందేమో,

ఏ విధమైన వైద్య సదుపాయమూ లేకపోయినా రెండురోజులలో వీరయ్య కోలుకున్నాడు. డాక్టర్ వీరయ్యకు పాలు ఇయ్యమని రాసాడు కానీ, ఆ పాలల్లో సగం ఎవరి కడుపులోకో చేరుకుని సగంపాలూ, సగం నీళ్ళూ అందాయి. ఆ రెండు రోజులూ కాగానే సగం పాలుకూడా ఆగిపోయి, రొట్టె పులుసు ఇచ్చారు. అదే అవురావురుమని తినేసాడు వీరయ్య. "జ్వరింపడి లేచాక ఇలాంటి ఆహారం తినకూడదు" అనియతి అంటే, వీరయ్య కీళ్ళు నొక్కుంటూ "మా కేడవుద్దయ్యా!" అన్నాడు. ఆ రోజే పనిలోకి బయలుదేరాడు. "రెండు రోజులు విశ్రాంతి తీసుకో! వెంకటయ్యగారితో చెప్పిస్తాను.,, అన్నాడు యతి.

"ఇక్కడకూడా రికమెండేషన్లేనా బాబూ!" అన్నాడు అదోకమాదిరి నవ్వుతో వీరయ్య- ఆ మాటలు సూటిగా గుచ్చుకొన్నాయి, యతికి. అమాయకుడనుకున్న వీరయ్య యెంత మాటన్నాడు! అదేసమయంలో వీరయ్యకోసం వెంకటయ్య యే ప్రయత్నమూ గట్టిగా చెయ్యలేదన్నది స్ఫురణకొచ్చింది. ఇలాంటి వ్యక్తి బీదల మేలుకోరి ఉద్యమాలునడిపిస్తాడా?

"మాకు పనిలోనే సుకం బాబయ్యా" అని పనికే బయలుదేరాడు వీరయ్య. ఈ నిరంతర పరిశ్రమే కారణమేమో, ఈ శారీరకారోగ్యానికి.

వెంకటయ్యగారు తనను పలకరించటానికి వచ్చినపుడు నిష్ఠూరంగా అన్నాడు యతి "మీరు వీరయ్యకోసం వెంటనే డాక్టరుని పిలిపించలేదు,, అని.

వెంకటయ్య నవ్వుతూ "అంత వెంటనే పనులు జరిగితే ఇంక మనం ఆందోళనలు జరపటం దేనికయ్యా!" అన్నాడు- మళ్ళీ మెత్తగా "నేనుచెప్పాను అందరితో- అందరూ విన్నారు, అంతే! వాళ్ళ టైమ్ వాళ్ళు తీసుకున్నారు. ఇంకా నయం! నేను చెప్పానుగనుక, అప్పటికయినా డాక్టర్ని పంపించారు. జైల్లో కూడా ఆందోళన లేవదీస్తానేనేమోనని!" అన్నాడు.

వెంకటయ్య మాటల్లో-మాట్లాడే విధానంలో ఏమే మత్తుమందు వుందోకాని, అంతవరకు వెంకటయ్య మాటలను సందేహించిన యతి, అతడి మాటలను నమ్మేసాడు- వెంకటయ్యకు మారుగా అధికారుల్నే తిట్టుకున్నాడు.

"పులి పట్టుబడ్డాడు!" జైల్లో ఎవరినోట చూసినా ఇదే మాట! ఏవో తీవ్ర సంచలనం, పోలీసులందరిలోనూ యేదో టెన్షన్.

'పులి' అనబడేవాడు పదిమందికి పైగా హత్యచేశాడని విన్నాడు యతి. ఎన్ని రోజులనుంచో పోలీసులకు చిక్కకుండా తప్పించుకొంటున్నాడట! అతను యెలాంటి గూండానో! అనుకున్నాడు యతి. ఒక మనిషి యింకొక మనిషి ప్రాణాన్ని ఎలా తీస్తాడు? అతడెంత రాక్షసుడై వుండాలి? ఒక మనిషిని చంపాక ఇంకా స్థిమితంగా ఎలా బ్రతకగలడు? రక్తసిక్తమయిన ఆ స్మృతులు వెన్నంటి వేధించవా? ఇలా సాగిపోయాయి యతి ఆలోచనలు- ఆ గూండాని చూడాలని చాలా కుతూహలంతో ఎదురు చూడసాగాడు. తీరా సంకెళ్ళతో పోలీసుల మధ్య "పులి"ని చూసినప్పుడు ఆశ్చర్యపోయాడు. తన గదిలోనుంచి కటకటాల మధ్యనుంచి ఒక్క నిమిషమే

పులిని చూడగలిగాడు. అయినా ఆ మూర్తి అతని మనసులో హత్తుకుపోయింది. బక్కచిక్కిన శరీరం, పొడుగ్గా పెరిగిన గడ్డం-కళ్ళలో సాత్విక తేజస్సు- ఇతడా హంతకుడు ? అని నివ్వెరపోయాడు యతి. కుతడు ఎవరో యోగిపుంగవుడిలా వున్నాడుకాని హంతకుడిలా లేడు. పోలీసులకు చిక్కిపోయిన ఆ సమయంలోకూడా చెక్కుచెదరని చిరునవ్వుతో ఉన్నాడు.

యతి, వీరయ్య తోటలో పనిచేస్తున్నారు. అ సమయంలో పులిని అటువైపుగా అధికారుల దగ్గరకు తీసికెళ్తున్నారు. దూరంనుంచి పులిని చూసి "గురూ గురూగారు !" అన్నాడు వీరయ్య అస్పష్టంగా. విభ్రాంతితో, యతి వీరయ్యను ఆశ్చర్యంగా చూసాడు-

"అతడు హంతకుడు- అందుకే అతడిని మనలో కలవనియ్యకుండా విడిగాబంధించారు. రేపో, ఎల్లుండో ఉరితీస్తారు." అని చెప్పాడు యతి. యతి చెప్తున్నదేమిటో తనకు అర్థం కానట్లు పిచ్చివాడిలా చూసాడు వీరయ్య "అయ్యయ్యో! ఆయన హంతకుడు కాడండీ! దేవుడండీ! నిజంగా దేవుడండీ, గుళ్లోవున్న దేవుడికంటే గొప్ప దేవుడండీ! ఈళ్ళు ఇట్టాంటాళ్ళనే ఉరి తీస్తారండీ!" అన్నాడు యేడుస్తూ...

పోలీస్ అటు రావటంతో "హుష్" అన్నాడు యతి. తలవంచుకుని కన్నీళ్ళు తుడుచుకున్నాడు వీరయ్య. జ్వరంలో కూడా అపురావురుమంటూ జైలు అధికారులిచ్చిన తిండి తిన్న వీరయ్య ఆ రాత్రి అన్నం తినలేకపోయాడు.

అ దరూ నిద్రపోయి సద్దుమణిగాక, నిద్రరాక కునుకుతున్న వీరయ్యను, "పులి కథ తెలుసా!" అన్నాడు యతి.

"తెలుసు బాబూ! ఆయన చెకోల్లకే పులి! మా అటుమంటోళ్ళకి దేవుడు! దేవుడంటే దేవుడు!"

యతిలో కుతూహలం పెరిగింది.

"అతడు నీకేలా తెలుసో చెప్పు!" అన్నాడు. వీరయ్య కళ్ళు తుడుచుకుంటూ చెప్పటం ప్రారంభించాడు.

# 13

వీరయ్య కాఫీ తోటల్లో కూలీగా పని చేస్తున్నాడు. సిటీకి ఇరవై మైళ్ళ దూరంలో వుందా ఎస్టేట్. కూలి వాళ్ళ కోసం ప్రత్యేకించి కట్టిన వార్డులలో ఒకదానిలో ఉంటున్నాడు అతడి భార్య పోయింది. ముసలి తల్లి, కూతురు - ఇదే అతని కుటుంబం. కూతురు చాలా చక్కగా వుంటుంది. హాయిగా పాడుతుంది. ఉన్న దాంట్లోనే ఆ కుటుంబం హాయిగానే వుంటోంది. కూలీల వార్డులకు దూరంగా వుంటాయి కంపెనీ డైరెక్టర్ల క్వార్టర్స్-అవి కాంపౌండ్ వాల్‌తో పూలతోట లతో విశాలమైన గదులతో అన్ని హంగులతో చాలా అందంగా వుంటాయి. వీరయ్యకు తోటపని అంటే చాలా ఇష్టం. అంచేత కాఫీ తోటల్లో కూలి పని అయిపోయాక ఒక డైరక్టర్ గారింట్లో తోటమాలి పని చెయ్యటానికి ఒప్పు కున్నాడు డైరక్టర్‌గారు కాస్తో కూస్తో ముట్టచెబుతారన్న ఆశతో. ఎలాగైనా డబ్బు కూడబెట్టి కూతురికి పెళ్ళి చెయ్యా

లన్నదే వీరయ్య ఆశయం. ఒక చిల్లు పిడత కొన్నాడు. ఎప్పటికప్పుడు రూపాయి కాగితాలూ, చిల్లర నాణాలూ అన్నీ అందులో వేస్తుంటాడు. తీరిక దొరికినప్పుడల్లా దాన్ని ఆడించి చూసుకుని సంతృప్తి పడుతుంటాడు. తెలిసిన వాళ్ళతో చెప్పి సంబంధాలు కూడా చూడమంటున్నాడు.

ఆ సాయంత్రం వీరయ్య మొక్కలకు నీళ్ళు పడుతుండగా డైరక్టర్‌గారు పిలిచి 'వీరయ్యా! సిటీ కెళ్ళి బ్రాందీ తీసుకొస్తావా?' అన్నాడు. వీరయ్య సందేహిస్తూ నిలబడ్డాడు. ఇరవై మైళ్ళదూరం వుంది టౌన్.

"సైకిల్ మీద వెళ్ళు. వాచ్‌మన్ సైకిల్ తీసుకెళ్ళు. అయిదు రూపాయలిస్తాను." "అయిదు రూపాయ" లనే మాట మంత్రంలా పనిచేసింది వీరయ్యపైన. వెంటనే చేతులు కడుక్కుని డైరక్టర్ గారిచ్చిన వందరూపాయల నోటందుకుని సైకిల్ మీద బయలుదేరాడు. డైరక్టర్‌గారి భార్య పిల్లల్ని తీసుకుని పుట్టింటి కెళ్ళింది. భార్య దగ్గర లేకపోయేసరికి మందు మీద మనసవుతుంద కాబోలు!- అని నవ్వుకున్నాడు.

సైకిల్ మీద ఇరవై మైళ్ళు వెళ్ళి బ్రాందీ సీసాలతో తిరిగివచ్చాడు వీరయ్య. వాచ్‌మన్ వరండాలోనే ఎదురయి చిల్లర జాగ్రత్తగా లెక్కబెట్టి తీసుకొని, అయిదురూపాయలు వీరయ్య చేతిలో పెట్టాడు. నొప్పితో పులిసి పోయినట్లున్న కాళ్ళను అరచేత్తో రాసుకుంటూ సంబరంగా ఆ అయిదు రూపాయల నోటు మొలలో దోపుకున్నాడు వీరయ్య. ముసలి తల్లి నోట్లో గుడ్డలతో కాళ్ళూ చేతులూ కట్టి పడేసి వుంది. వీరయ్య గుండెలు బాదుకుంటూ తల్లి కట్లు విప్పి నోట్లో

ఎవరో బలవంతంగా ఎత్తుకుపోయారని చెప్పింది. వీరయ్య తల గిర్రున తిరిగింది. ఆ సమయంలో మెరుపులా గుర్తుకు వచ్చింది వాచ్ మన్ విషపు నవ్వు! మూసివున్న డైరక్టర్ గారి గది తలుపుల ముందు వరండాలో నిలబడివున్న వాచ్ మన్ విషపు నవ్వు. ఆ సమయంలో సాధారణంగా డైరక్టర్ గారి గది తలుపులు మూసి వుండవు. అయిదు రూపాయలు దొరికాయన్న సంబరంలో ఆ విషయం గమనించనేలేదు. అయిదు రూపాయల కోసం అన్ని మైళ్ళు సైకిల్ మీద తిరిగొచ్చాడు. ఈ అయిదు రూపాయలే అభం శుభం తెలియని తన కూతురి జీవితాన్ని భగ్గుమనిపించాయి. కర్ర తీసుకుని ఉద్రేకంగా డైరక్టర్ గారి ఇంటిమీదకు బయలుదేరాడు. కేకలు వేసాడు_ డైరక్టర్ గారి మనుష్యులు వీరయ్యను చావబాది అవతల పారేసారు. లేవటానికికూడా ఓపిక లేకపోయింది వీరయ్యలో. తెల తెలవారుతుండగా వీరయ్య కూతురు వచ్చి "అయ్యా" అని వీరయ్యమీద పడింది ఏడుస్తూ. తండ్రి అవస్థకి ఏడవాలో తన అవస్థకి ఏడవాలో అర్థం కాలేదు ఆ అమాయకురాలికి. ఆ నిర్భాగ్యురాలే తండ్రిని ఇంటికి నడిపించుకుంటూ వచ్చింది. ఈ విషయం తెలిసి కూలీలు వచ్చిపోయారు. గుంపుగా డైరక్టర్ ఇంటిమీద పడ్డారు. డైరక్టర్ ఫోన్ మీద పోలీసుల్ని పిలిపించాడు. పోలీసులు భాష్పవాయు ప్రయోగాలతో, లాఠీ చార్జీలతో_కాల్పులతో కూలీలను చెదరగొట్టారు. చాలా మంది కూలీలు గాయపడి ఆస్పత్రులలో చేరారు. విషయం కోర్టు కెక్కింది. కూతురి పెళ్ళికోసం డబ్బు కూడబెడ్తున్న కుండ పగలగొట్టి కోర్టు ఖర్చులకోసం ఉపయోగించాడు

గుడ్డలు తీసాడు. తల్లి శోకాలు పెడుతూ వీరయ్య కూతురి వీరయ్య. ఎంత ఖర్చయినా డైరక్టర్ కి తగిన శిక్ష పడాలన్నదే వీరయ్య పట్టుదల. వాయిదాలమీద వాయిదాలతో కోర్టులో కేసు నెలల తరబడి సాగింది. వీరయ్య కూలిపని పోయింది. ఆరోగ్యం పాడయింది. చివరకు వీరయ్య కూతురు పిచ్చిదనీ, అది డైరక్టర్ గారి యింటిమీద పడి గొడవ చేసిందనీ, అది సాకుగా కూలీలంతా కావాలని గొడవ చేసారనీ, దీని వెనుక సంఘ విద్రోహ కారుల ప్రోద్బలం ఉండవచ్చుననీ, రుజువయింది కేసు కొట్టేసారు.

వీరయ్యకు లోకమంతా అంధకారమయి పోయింది కూతురి బ్రతుకు పాడయిపోయింది. ఉద్యోగం లేదు. ఆ సమయంలో ఒక వ్యక్తి వీరయ్య దగ్గరకి వచ్చాడు. అతడెవరో కూడా వీరయ్యకి తెలీదు. అచ్చం కూలీలాగే ఉన్నాడు.. అతడిని చూసిన గుర్తుకూడా లేదు వీరయ్యకి.

"పాపం! నీ కెంత కష్టం వచ్చింది వీరయ్యా" అన్నాడు అతడు వీరయ్య పక్కన కూచుని. వీరయ్య ఏడ్చి ఏడ్చి మసక బారిన కళ్ళతో దీనంగా చూసి "అదీ, నేనూ సచ్చినా బాగుండేది!" అన్నాడు. వీరయ్య కూతురు ఒక మూల కూచుని తల ఎత్తి లోకం చూడలేని దానిలా తల దించుకొని వుంది.

"వీరయ్యా! నీకు మరేదైనా పని చెప్తే చేస్తావా?

వీరయ్య గాజుకళ్ళలో ఆశ తళుక్కుమంది. "చేస్తాను బాబూ! చేస్తాను. ఎట్లాగైనా నా బిడ్డని కాపాడుకుంటాను" అన్నాడు వీరయ్య. కూతురు విచిత్రంగా చూసింది. కోర్టు కేసు

పూర్తయి డైరక్టర్ నిర్దోషిగా తీర్పు వచ్చేందిరికి, అది నిండు గర్భిణి. ఇంకా తన తండ్రి తనను కాపాడే దేమిటి! అని దాని ఆశ్చర్యమేమో!

"వీరయ్యా! జరిగిన అన్యాయానికి ప్రతీకారం చెయ్యాలని లేదా?" అన్నాడు అతడు వీరయ్య వెంటనే అగ్నికీలలా నిలువెల్లా రగులుకుపోతూ "ఆడిని ముక్క ముక్కలుగా చంపి నెత్తురు తాగాలనుంది" అన్నాడు.

"అయితే నాతో రా! గురువుగారికి నీకష్టం చెప్పుకో! ఆయనే నీకు మార్గం చూపిస్తారు" అన్నాడు.

ఇటీవలి కాలంలో వీరయ్యకు ఆ మాత్రం అండగా నిలిచినవాళ్ళు కూడా లేరు. కొందరు సానుభూతి చూపించిన వాళ్ళు లేక పోలేదు- కానీ, ఆ సానుభూతి పెదవులు చప్పరించటంతోనూ, కళ్ళు చెమ్మగిల్లటంతోనూ ఆగిపోయింది. వీరయ్య సమస్యను పరిష్కరించటానికి కానీ, అతడికి జరిగిన అన్యాయానికి గట్టిగా ప్రతీకారం చెయ్యటానికి కానీ పూనుకొన్నవాళ్ళు ఎవరూ లేరు. అంచేత వీరయ్య ఆ గురువు ఎవరని కాని, అతడు తనకి ఏ విధంగా సహకరిస్తాడని కాని ఏ ప్రశ్నలూ వెయ్యలేదు. వెంటనే ఆ వ్యక్తిని అనుసరించాడు. ఒక పాడుబడ్డ మంటపంలో ఉన్నాడు గురువు. కాషాయ వస్త్రాలు ధరించాడు. పొడుగ్గా పెరిగిన గడ్డం-సూదుల లాంటి కళ్ళు-వ్యంగ్యపూరితమైన నవ్వు-అతని చుట్టూ భక్తబృందం చాలామందే ఉన్నారు. వీరయ్య వెళ్ళి ఆ గురువు పాదాల మీద సాష్టాంగపడ్డాడు- గురువు గంభీరంగా "లే! నిన్నింత హింసించిన పాపాత్ముడు దానికి తగిన దారుణ ఫలితం అనుభ

విస్తాను" అన్నాడు. గురువుగారికి తనసంగతి ఎలా తెలిసిందా! అని ఆశ్చర్యపోయాడు. "మహాత్ములు ఆయనకు తెలియనిది ఏముంటుంది!" అని సరిపెట్టుకున్నాడు. తనను గురువు దగ్గరికి తీసుకొచ్చిన వ్యక్తికి తన సంగతులన్నీ ఎలా తెలిసాయి? అతడే గురువుకి చెప్పి వుండకూడదా? లేక గురువే అతనికంటే ముందుగా తెలుసుకుని అతణ్ని తన దగ్గరకు పంపకూడదా? ఈ ఆలోచనలేవీ రాలేదు ఆ అమాయకుడికి! భక్తితో చెంపలేసుకుంటూ నిలబడిపోయాడు. గురువుగారితో ఉన్న వ్యక్తి అతడి చెయ్యిని పట్టుకుని లోపలికి తీసి కెళ్ళాడు. అక్కడ భక్తులు భోజనాలు చేస్తున్నారు. వీరయ్యను ఆ వరసలో కూచోబెట్టారు. అన్నం చూడగానే వీరయ్యకు ప్రాణం లేచొచ్చింది. కానీ అంతలోనే కూతురు గుర్తొచ్చి ముద్ద నోట్లో పెట్టుకోలేక పోయాడు. అతని మనసు అర్థంచేసుకున్నట్లు ఆ వ్యక్తి "నీ కూతురి కేం ఫరవాలేదు వీరయ్యా! ఆమెని కనిపెట్టి చూడటానికి గురువుగారు అప్పుడే ఇద్దరమ్మాయిలను పంపించారు" అన్నాడు. 'గురువుగారు' అనే పేరు వినేసరికి ఎక్కడలేని విశ్వాసమూ ఏర్పడిపోయింది వీరయ్యలో తనను నిలువునా కబళించేవారినే విశ్వసించిన అమాయకుడతడు. ఆదరించి అభయమిచ్చిన వారిని విశ్వసించలేడా? కొన్ని నెలల తర్వాత సంతృప్తిగా కడుపునిండా భోజనం చేసాడు వీరయ్య. ఇంటికి వచ్చేసరికి నిజంగానే ఇద్దరు యువతులు చూడడానికి విద్యార్థినుల్లా ఉన్నవారు వీరయ్య కూతురికి ఆహారం తీసుకొచ్చి తినిపిస్తున్నారు. ఆ దృశ్యం చూసేసరికి ఖుసు నిండిపోయింది వీరయ్యకి. ఇటీవలి కాలంలో

తన కూతుర్ని ఆ మాత్రం దగ్గరకు తీసిన వాళ్లెవరూ లేరు.
వీరయ్య కొంచెం స్థిమితపడ్డాక అతడు మళ్ళీ వచ్చాడు. అతడి చేతిలో ఏవో పొట్లాలు ఉన్నాయి. "వీరయ్యా! పని కావాలన్నావు. పని చూపిస్తే జాగ్రత్తగా చేస్తావా?" అన్నాడు.

వీరయ్య పరమానందంగా తలూపాడు.

"ఇవి గురువుగారి ప్రసాదాలు. భక్తులకు అందజేయాలి. నీకు తగిన బహుమతి ఇస్తారు."

"బహుమతి ఎందుకండీ? తప్పకుండా ఇస్తాను"

"జాగ్రత్తగా విను. భక్తులు ఈ ఊళ్ళో లేరు. ఢిల్లీలో ఉన్నారు. అక్కడికి వెళ్ళి ఇవ్వాలి."

"ఓర్నాయనో అంత దూరమే! నే వెళ్ళగలనా బాబూ" వీరయ్య కళ్ళలో భయంచూసి కొద్దిగా చికాకు పడ్డాడు అతడు.

"ప్రతిదానికీ ఇలా భయపడతారు గనుకే మీ బ్రతుకులు ఇలాగున్నాయి. నీకేం భయం లేదు. ఇక్కడ రైలెక్కిస్తాం. అక్కడ రైలు దిగగానే నీ కోసం భక్తులు వస్తారు. వాళ్ళు కాషాయబట్టలు కట్టుకుని వుంటారు వాళ్ళే నీ దగ్గరకు వస్తారు. 'స్వామి విశ్వానంద పంపారా?' అని అడుగుతారు. "అవును" అని వాళ్ళకి ప్రసాదాలు ఇచ్చేసెయ్యి. అక్కడ నీకు కావలసిన ఏర్పాట్లన్నీ వాళ్ళే చూస్తారు. "విశ్వానంద" పేరు గుర్తుంటుందా?"

వుంటుందన్నట్లు తలూపుతూనే కూతురివంక బెంగగా చూసాడు వీరయ్య.

"నీ కూతురికేమీ ఫరవాలేదు. ఇవాళే మీ అమ్మాయిని నర్సింగ్ హోంలో చేర్పిస్తున్నారు. ప్రసవం అయ్యేవరకూ అన్ని సదుపాయాలతో మీ అమ్మాయి అక్కడే వుంటుంది. నీ కూతురి ఆరోగ్యం బాగా పాడయింది. ఆ అమ్మాయి ఆస్పత్రిలో వుండటమే అన్నివిధాల మంచిది. ఆ అమ్మాయిని కనిపెట్టి చూసేవాళ్ళు వుంటారు."

ఈ మాటలతో వీరయ్యకు పెద్ద బరువు తొలగించినట్లయింది! అతడు చేతులు జోడించి "మీరేం చెయ్యమంటే అది చేస్తాను" అన్నాడు.

ఆ సాయంత్రమే అతడు ప్రసాదాల పేకెట్లు నింపిన చిన్న ట్రంక్‌తో వీరయ్యను ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ ఎక్కించాడు. వీరయ్య ప్రయాణానికి ముందే వీరయ్య కూతుర్ని నర్సింగ్ హోంలో చేర్పించటంవల్ల వీరయ్య చాలా స్థిమితంగా ప్రయాణమయ్యాడు.

"మీ అమ్మాయిని నర్సింగ్ హోంలో చేర్పించింది ఎవరో తెలుసా? కస్తూరీబా మహిళామండలి వాళ్ళు" హెచ్చరిస్తున్నట్లుగా అన్నాడు అతడు.

"ఏంటీ! సాములోరు కాదూ!" తెల్లబోతూ అన్నాడు వీరయ్య.

"కాదు, ఆ మహిళామండలి వాళ్ళకి మీ అమ్మాయి సంగతి తెలిసి వచ్చి తీసికెళ్ళి ఆస్పత్రిలో చేర్చారు" నొక్కి పలుకుతూ అన్నాడు అతడు. అంత అమాయకుడైన వీరయ్యకు కూడా ఏదో తోచి "చిత్రం, చిత్రం" అన్నాడు. రైలు కదిలింది.

ఢిల్లీలో రైలు దిగగానే కాషాయవస్త్రాలు కట్టుకున్న భక్తులు వీరయ్యకు కనిపించారు. అనుకున్నట్లు స్వామివారి ప్రసాదం భక్తులకు అందించాడు వీరయ్య. అతడు మళ్ళీ ప్రయాణమయ్యేవరకు ఆతనికి కావలసిన సదుపాయాలన్నీ ఆ భక్తులే చూసారు వీరయ్య తిరిగి తన ఊరికి వచ్చేసరికి ఊరంతా గగ్గోలుగా వుంది. డైరక్టర్‌ని ఎవరో దారుణంగా చిత్రవధ చేసారు. ఆ వార్త విని వీరయ్య ఆనందం పట్టలేక ఎగిరి గంతులేసాడు.

ఆ దారుణ హత్య చేసినది ఎవరో ఎవరికీ అంతు పట్టలేదు. హత్య జరిగిన సమయానికి ఊళ్లో వీరయ్య లేడు గనుక వీరయ్యను అనుమానించలేదు. అసలు వీరయ్యను అనుమానించాలనే ఆలోచనే ఏవరికీ రాలేదు తన కన్నకూతురి బ్రతుకు సర్వనాశనం చేసిన అతనిమీద పగ తీర్చుకోవాలనే ఆలోచనయినా ఆ అభాగ్యుడికి రాగలదని ఎవరూ ఊహించలేదు.

వీరయ్యకు మాత్రం స్వాములవారు కాని "అతడు" కానీ మళ్ళీ కనిపించలేదు. కస్తూరిబా మహిళా సమాజంవాళ్ళు అతడికి తోటపని ఇచ్చారు. వీరయ్య కూతురు ప్రసవించింది—పురుట్లో చాలా జబ్బుచేసింది ఆ పిల్లకి. అతి కష్టంమీద కోలుకుంది. కోలుకున్నాక అయినా తనబిడ్డను ఎత్తుకోలేదు. ఆడా? మొగా? అని అడగలేదు. గంటల తరబడి ఆ బిడ్డను చూస్తూ కూచునేది—ఆకలికి యేడ్చినా స్తన్యమిచ్చేదికాదు. చివరకి నర్సులు పై పాలు పట్టవలసి వచ్చేది.

ఒకసారి అలా చూసి చూసి ఆ బిడ్డను గోడకేసి కొట్టేసింది. రక్తం మడుగులో వున్న పసిబిడ్డను చూసి కెవ్వున కేకపెట్టింది అప్పటినుండి ఆ అమ్మాయి పిచ్చిదాయిపోయింది. వీధిలో నూటూ బూటుతో ఎవరు కనపడ్డా మీదపడి వీకి రక్కబో యేది. ఏ పసిబిడ్డ కనిపించినా బలవంతంగా ఎత్తుకోబోయేది. తనకూతుర్ని అదుపులో పెట్టడం వీరయ్యకు సాధ్యమయ్యేది. కాదు. జనం ఈ పిచ్చిదాన్ని చూసి హడిలిపోయేవారు— ఎప్పుడు ఏ పసిబిడ్డ గొంతు నులుముతు దోనని. ఒకసారి ఒక నూటువాలా మీదపడి రక్కబోతే, అతడు పోలీసులకు పట్టి చ్చాడు. వీరయ్య ఎన్నివిధాలుగా ప్రాధేయపడినా పోలీసులు వీరయ్య కూతుర్ని విడిచిపెట్టలేదు. వీరయ్య దగ్గరేమైనా డబ్బులున్నాయా, తన కూతుర్ని విడిపించుకోవడానికి? ఎలాగో పోలీసుల పంజాల్లోంచి బయటపడిందా పిచ్చిది ! ఏం జరిగిందో చెప్పడానికి ఆ నిర్భాగ్యురాలికి జ్ఞానం లేకపోయినా ఆ శరీరం చెప్పేస్తోంది ఏం జరిగిందో! వీరయ్య మనసు రగిలి పోయింది. చేతకాని పౌరుషంతో వుడికిపోయింది. ఆ రోజే మళ్ళీ ఆ అమ్మాయి వీరయ్యను తప్పించుకొని నుయ్యి దగ్గరకు పారిపోయి, నూతి గట్టుమీద కూచుని నీళ్ళలోకి తొంగి చూస్తూ "ఇహిహిహి! ఇహిహిహి!" అని మురిసిపోసాగింది. ఆ ఇంటివారబ్బాయి ఆమె పమిట లాగాడు. అదిచూసి భరించ లేకపోయాడు వీరయ్య. తనే తనకూతుర్ని నూతిలోకి తోసే సాడు. తిన్నగా పోలీస్ స్టేషన్‌కి వచ్చి తనే తననేరం ఒప్పు కున్నాడు.

యతి మనసంతా వికలమయింది. ఇన్నాళ్ళుగా యతి!

వీరయ్య హత్య చేసినందుకు జైల్లో ఉన్నాడని మాత్రమే తెలుసు! అంత అమాయకంగా కనిపించే అతను ఎలా హత్య చేసాడా? అనే ఆలోచన చాలాసార్లు వచ్చింది. కానీ, ఆవిషయం అడగలేక పోయాడు. ఇప్పుడు ఎవరిని హత్యచేసాడు, ఏ సందర్భంలో హత్యచేసాడో అర్థమయ్యాక, ఎవరు దోషులో ఎవరు కారో, అతనికి అర్థంకాకుండా పోయింది. ఒక్కటి మాత్రం యదార్థం. కటకటాల వెనక వున్నవారంతా దోషులు కారు! కటకటాల బయట వున్నవారంతా నిర్దోషులూ కారు.

అమాయకత్వం వల్లనో, అతి జాగ్రత్తవల్లనో గురువుగారూ, భక్తులూ మొదలైనవాళ్ళంతా ఎవరో వీరయ్య చెప్పకపోయినా యతి గ్రహించుకోగలిగాడు. పులిని గురించి ఎన్నెన్నో కథలు విన్నాడు. అతడు అతి చాకచక్యంగా పోలీసుల కళ్ళలో దుమ్ముకొట్టి ఎన్నిసార్లో తప్పించుకున్నాడు. చివరికు యే స్వార్థపరుడి కుట్రవల్లో దొరికిపోయాడు. అతడి పేరు పులయినా-మరేదైనా అతడు నిజంగా గురువే అనుకున్నాడు యతి.

ఆ రోజు జైలులో తీవ్ర సంచలనం! ఎవరినోట విన్నా ఒకటే మాట! 'పులిని వురితీస్తున్నారు!' జైలు అధికారుల మధ్య పులి నడిచి వెడ్తున్నప్పుడు వీరయ్య గొంతులోనుంచి రాబోయే ఆర్తనాదం పులి కంటికొనలలో కనిపించిన అదలింపుతో ఆగిపోయింది. ఆ అదలింపును యతి ఒక్కడే గమనించగలిగాడు ఆ గాంభీర్యాన్ని, ఆ సమయంలో కూడా చెక్కుచెదరని చిరునవ్వుని చూసి "నాయకుడంటే ఇతడు!"

తన సింధు ప్రాణాన్ని తను నమ్మిన సిద్ధాంతం కోసం సునాయాసంగా త్యాగంచేసేస్తున్నాడు" అనుకున్నాడు యతి.

సాయంత్రమయింది. పులిని ఉరితీసి వుంటారు. ఆ వురి తీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యాలు యే మహాకవి వివరించ గలడు? ఎవరికోసం ఆ ధీరుడు తన ప్రాణాలను పణంగా ఒడ్డాడో, ఆ అజ్ఞానులకు అతనికోసం కన్నీటిబొట్టు ఒదిలే పరిజ్ఞానమయినా వుండదు. ఒక కల్లుముంతకోసమో, ఒకనైలాన్ చీరకోసమో వెంపెరలాడుతూ వెర్రిగొర్రెల్లా ఏ కరకు కసాయిల ముందో తమ జీవితాలను అర్పణ చేసుకుంటారు.

కానీ, ఇలా దుర్మార్గాలను హత్య చేయటమే పరిష్కార మార్గమా? వాడెవరో ఒక రాక్షసుణ్ని చంపితే అతడి ప్రతి రక్తపుబొట్టులో నుంచీ కొన్ని వేలమంది రాక్షసులు జన్మించేవారట. అలాంటిరాక్షసులు కారా. ఈ సమాజంలో డైరెక్టర్ల లాంటివాళ్ళు! ఒకడిని చంపుతూండగానే మరో పదిమంది పుట్టుకొస్తారు. ఎంతమందినని చంపగలరు?

కానీ, అంత దారుణమైన అన్యాయాన్ని చూస్తూ ఊరుకున్న సమాజం- అన్యాయాన్నే సమర్థించిన ప్రభుత్వం ఆ ప్రభుత్వపు అదుపాజ్ఞలలో ప్రవర్తిస్తున్న పోలీసులు· ఇన్ని విషవలయాల మధ్య సామాన్యుడు అమానుషంగా

నలిగిపోవలసిందేనా? దీనికి ప్రతిక్రియ యేమిటి? ఎవరు చెయ్య గలరు? -

"ఏమిటాలో చిస్తున్నావు నాయనా?" యతి భుజం మీద తట్టి అన్నాడు వెంకటయ్య.

"పులిని ఉరితీసారు!" ఎంతో క్షోభతో అన్నాడు యతి. వెంకటయ్య అతి సామాన్యంగా-

"హింసను పూనుకుంటే ఫలితం ఇలాగే వుంటుంది మరి!" అన్నాడు.

నివ్వెరపోయి చూశాడు యతి. వెంకటయ్య సామాన్యుడు కాడు. యతిచూపుల్లో భావాన్ని అర్థం చేసుకున్నాడు వెంటనే తన కంఠాన్ని మార్చేస్తూ "ఆ మహానుభావుణ్ని వురితీసినందుకు ఆవేదనతో రాత్రంతా కంటిమీద కునుకు రాలేదు. ఆయన ఆత్మకు శాంతి ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూనే వున్నాను. కానీ, యతీ! గొప్పతనం వుండగానే సరికాదు! అది ఏ మార్గంలో వుపయోగించుకోవాలో కూడా ఆలోచించుకోవాలి. ఇప్పుడు చూడు! అతడు చంపినవాళ్ళు దుర్మార్గులే? కాదనను! కానీ, ఏం సాధించగలిగాడు? సమాజంలో దుర్మార్గాన్ని యే విధంగానయినా తగ్గించ గలిగాడా? చిరకిలా బలైపోయాడు. అదీగాక ఇలా హింసను ప్రోత్సహిస్తే అరాచకత్వానికి దారితీసిన వాళ్ళమవుతాం! 'పులి' లాంటివాళ్ళు నిజంగా దుర్మార్గుల్నే చంపారనుకో! కానీ, కొందరు తమ అవసరాలు తీర్చుకోవటం కోసం శత్రువులంటే ధనికులను చంపటం మొదలుపెడితే? అబ్బెబ్బే! ఇది కాదయ్యా మార్గం! అసలు పాలక యంత్రాంగాన్నే సరిదిద్దాలి. అది

సవ్యంగా వుంటే అన్నీ సవ్యంగానే వుంటాయి. ఆందోళన ఒకటే మార్గం!"

వెంకటయ్య కంఠంలో, అతడు చెప్పేతీరులో యేం వుందోకాని ఎవరైనా అతని మాటలు నమ్మేస్తారు. అతడిలో విశ్వాసం కలుగుతుంది. యతికి ఆవేశం యెంతవున్నా అతడింకా డిగ్రీకోసం చదువుతోన్న యువకుడు. లోకానుభవం యే మాత్రం లేనివాడు. అటు పులి త్యాగమూ, ఇటు వెంకటయ్య మాటల్లో తార్కికమూ అతని మనసులో ఒకదానితో ఒకటి సంఘర్షణ పడి యేదీ నిర్ణయించుకోలేక, యెదురుగా వున్న వెంకటయ్య మార్గానికే మొగ్గాడు. అయినా జైలులో సహితం వెంకటయ్య అనుభవించే సౌకర్యాలు—అక్కడకూడా అతనికున్న పలుకుబడి— అతని మనసులో అనేక సందేహాలను కలిగించకపోలేదు. జీవితంలో ప్రవేశించి చూసి తనమార్గమేదో నిర్ణయించుకోవాలను కున్నాడు.

వెంకటయ్య విడుదలతేదీ వచ్చేసింది. అతడు యతి తనను యెక్కడ కలుసుకోవాలో వివరంగా వ్రాసిచ్చి వెళ్ళిపోయాడు.

వెంకటయ్య వెళ్ళిపోయాక తోటి ఖైదీలతో మరింత ఎక్కువకాలం గడపసాగాడు యతి. ఏ ఖైదీని కదిలించినా అతని నేరంవెనుక ఒక కన్నీటిగాథ వుంటుంది. మరొకటికూడా గమనించాడు యతి. ఈ ఖైదీలలో అధికభాగం అడుగు వర్గాలవారే! అవును మరి! పై వర్గాలవాళ్ళు జైళ్ళదాకా ఎందుకొస్తారు? కటకటాలదాకా రాకుండానే తమ నేరాల నుంచి తప్పించుకోవటానికి అనేక మార్గాలున్నాయి వాళ్ళకి.

ఖైదీలలో కొందరికి తమ గుడిసెలకంటే జైళ్ళే బాగు న్నాయి. ఏ దేశానికైనా ఇలాంటి స్థితి వాంఛనీయమేనా?

యతి విడుదలయ్యాడు. పోబోతున్నప్పుడు సూపరిం టెండెంట్ యతికి షేక్ హాండ్ యిచ్చి చిరునవ్వుతో "విష్‌యు బెస్ట్ ఆఫ్‌లక్!" అన్నాడు. అతని కళ్ళలో మెరుపు చాలావిచి త్రంగా తోచింది యతికి. అంటే, తాను జరిపిన ఆందోళన పట్ల ఆయనకు కూడా సానుభూతి వుందన్నమాట! అలాంటి వాడు ఇలాంటి వుద్యోగం ఎలా చేస్తున్నాడు? ఇలాటి వుద్యోగం చేస్తూ తనబోటివారిపట్ల సానుభూతి వుంటేమాత్రం ఏం ప్రయోజనం? లోకాన్ని చూస్తున్నకొద్దీ అన్నీ ప్రశ్నలే ఎదురు కాసాగాయి యతికి.

విడుదలయ్యాక అతడు వెంకటయ్య దగ్గరకీ వెళ్ళలేదు- తన ఇంటికీ వెళ్ళలేదు. వీరయ్య యిచ్చిన ఆధారాలతో కస్తూరిబా మహిళా సమాజాన్ని వెతుక్కుంటూ వెళ్ళాడు. ఒక పల్లెటూళ్ళో రెండుగదుల వాటా అది! ఒకగదిలో అయి దారుగురు యువతులు ఏదో చర్చించుకొంటున్నారు. యతిని చూడగానే మాటలాపేసి అతడిని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశారు. "ఎవరు మీరు?" అన్నారు- యతి వీరయ్యమాట లను గుర్తు చేసుకుంటూ "లలితాదేవిగారిని కలుసుకోవాలని వచ్చాను" అన్నాడు.

వాళ్ళలో ఒకామె లేచి "రండి!" అని లోపలిగది లోకి తీసికెళ్ళింది. లలితాదేవి అంటే ఎవరో పెద్దావిడ అనుకు న్నాడు యతి-తీరా చూస్తే ఆవిడ కాలేజీ విద్యార్థినిలాగ వుంది. ఆవిడతో ఎవరో ఇద్దరు మొగవాళ్ళు మాట్లాడుతు

న్నారు. వాళ్ళూ యువకులే. యతిరాగానే వాళ్ళిద్దరూచటు క్కున లేచిపోయారు. లలితాదేవి చిరునవ్వుతో కుర్చీచూపించి "కూర్చోండి!" అంది. 'మీరెవరూ ? ఎందుకొచ్చారూ?" అని అడగలేదు. యతి కూచున్నాడు. తను వూహించిన దానికి భిన్నంగా వున్న ఆ వాతావరణాన్ని ఆశ్చర్యంగా చూస్తున్నాడు. లలితాదేవి ఏం మాట్లాడకుండా తన రిజిష్టర్లు చూసుకోసాగింది. అయిదునిముషాలు అలా దాటిపోయాక కాని యతికి జ్ఞానం రాలేదు. అప్పుడు "వీరయ్య మీగురించి చెపుతుంటే విని మిమ్మల్ని చూడాలని వచ్చాను" అన్నాడు.

లలితాదేవి అతి మామూలుగా "వీరయ్య మీకెలా తెలుసు?,, అంది.

"వీరయ్యా నేనూ ఒకే జైల్లో వున్నాం-నేను విద్యార్థి నాయకుడిగా ఆందోళన జరిపి జైలుకెళ్ళాను."

కొంచెం గొప్పగా అన్నాడు యతి-అయితే లలితాదేవి ఆ గొప్ప యేమాత్రం గుర్తించకుండా "అలాగా!" అంది.

తరువాత యధాలాపంగా "ఇప్పుడెలా వున్నాడు వీరయ్య" అంది.

"పులిని ఉరితీసినప్పటినుండీ, ఆందోళనతో అతనిఆరో గ్యం పాడయింది. ఆ జెయిల్లో ఖైదీల ఆరోగ్యం గురించి పట్టించుకొనే దెవరు?"

ఈ మాటలువిన్నాక లలిత క్రిందకిచూస్తూ చాలా సేపు వుండిపోయింది. ఎంతోసేపటికి కానీ, వంచినతల ఎత్తలేక పోయింది. "పులి" మరణానికి ఆమె బాధపడుతున్నదనీ, అది నిగ్రహించుకోవటానికి ప్రయత్నిస్తున్నదనీ ఊహించగలిగాడు.

ఎలాంటి మనోభావాలనైనా నిగ్రహించుకొని అతి మామూలుగా కలిపించగలిగే ఆ శిక్షణను మెచ్చుకున్నాడు

కొంతసేపటికి లలిత మళ్ళీ మాట్లాడినప్పుడు ఆమె ముఖం చాలా నిర్మలంగా అతి మామూలుగా వుంది.

"మీరు నన్ను చూడటానికే వచ్చారా ?"

"ఇక వెళ్ళండి" అన్నట్లుగా వుంది ఆ ప్రశ్న.

అంతేకాదు. మీ కార్యక్రమాలు తెలుసుకోవాలని వచ్చాను.,,

లలిత పెదవులమీద కనీకనపడని చిరునవ్వు విరిసింది. 'ఇలాంటి ప్రశ్నలకు అలవాటుపడ్డాను లేవోయ్!' అన్నట్లుగా వుంది ఆ చిరునవ్వు. "మా కార్యక్రమాలకేముంది? ప్రధానంగా స్కూలు నడుపుతున్నాం. అభాగ్యలను స్త్రీవీలైనంత వరకూ ఆదుకుంటాం! ఈ రోజు వుండండి. చూద్దురుగాని!" అంది,

తమ స్కూల్ చూపించింది. రెండుగదుల చిన్నబడి అది. ఆ పిల్లల వాలకం చూస్తేనే చాలా అడుగువర్గాలలో పిల్లలని తెలుస్తుంది. బీదరికం ప్రతి పసిముఖంలోనూ స్పష్టంగా కనిపిస్తుంది.

కూలి జనుల పిల్లలకు ఉచిత భోజన సహాయంతో పగటివేళ చదువు చెప్తాం. రాత్రివేళ వయోజనులకు చదువు చెప్తాం!" వివరించింది లలిత.

"మరి, వీటన్నిటికీ డబ్బెలా వస్తుంది!"

"కష్టపడి చందాలు వసూలుచేస్తాం. మీలాంటి పుణ్యాత్ములి స్తారు."

జైలునుంచి వచ్చేటప్పుడు జెయిలు అధికారులు తన కిచ్చిన డబ్బును లెక్కపెట్టకుండా లలిత చేతిలో పెట్టాడు యతి. చిరునవ్వు నవ్వి "థేంక్స్" అంది లలిత. ఆ తరువాత ఇద్దరూ మరో గదిగుండా బయటికి వస్తుండగా, అక్కడ కొందరు మొగవాళ్ళు ఆడవాళ్ళూ ఏదో సీరియస్‌గా చర్చించుకు టున్నారు. వీళ్ళను చూడగానే వాళ్ళచర్చలు ఆగిపోయాయి.

"వీళ్ళంతా మా స్టాఫ్" అంది లలిత. నమస్కరించిన యతికి అందరూ ఫార్మల్‌గా నమస్కారాలు చేశారు.

అక్కడ కుట్టుమిషన్ ఎంబ్రాయిడరీ ప్లాస్టిక్‌బుట్టల అల్లకం ఇలా రకరకాల పనులు నేర్చుకుంటున్న ఆడవాళ్ళు కొందరున్నారు.

"మిమ్మల్ని కలుసుకోగలిగినందుకు చాలాసంతోషంగా వుంది" అని చేతులు జోడించాడు యతి.

"అప్పుడప్పుడు వస్తూండండి" అందిలలిత సాగనంపుతూ.

ఆ మాత్రం అభిమానానికే పొందిపోయాడు యతి. వీరయ్య చెప్పిన కథనుదట్టి పులితో ఈ కస్తూరిబా మహిళా సమాజానికి సన్నిహిత సంబంధం వుందని ఊహించాడు. 'పాఠశాల' పేరుతో అది రహస్య సమావేశాలకు ఆధారంగా వుండేదని కూడా ఊహించగలడు. అన్నీ అతని వూహాలే! ఎవరు యే విధంగానూ యేదీ పైకి తేలటంలేదు. రహస్యం అంత జాగ్రత్తగా కాపాడబడుతోంది!

ఏ విషయం ఎలాగున్నా లలిత నిరాడంబరత, కార్య దీక్షత, అణువణువునా పుట్టిపడే సంస్కారం మాత్రం యతిని ముగ్ధుణ్ని చేసాయి.

# 15

యతి ఇంటికి రాగానే మంచంలో వున్న తల్లి యతిని కౌగిలించుకుని బావురుమంది. తండ్రికూడా గుడ్డివాడు తడిమి నట్లు యతి శరీరం తడిమి తడిమి ఆనందించాడు.

"ఇంక నన్ను విడిచి వెళ్ళిపోవు కదురా!" అంది తల్లి. సంతోషానికీ దుఃఖానికీ మధ్య వుక్కిరి బిక్కిరవుతూ-యతి ఏ సమాధానమూ చెప్పకముందే "నాకు తెలుసు! నన్ను విడిచిపోవు" అందితనే.

"నువ్వెలాగైనా బ్రతికి బట్టకడితే చాలని సన్యాసుల పేరు పెట్టానురా! నిజంగా సన్యాసివై పోకురా!" అన్నాడు బెంగగా తండ్రి. ఆ మాటలకు నవ్వుకున్నాడు యతి. సన్యాసానికీ తన మార్గానికీ భూమ్యాకాశాలకున్నంత భేదంవుంది. కాని ఇదీ ఒకరకమైన సన్యాసమేనేమో! వాళ్ళు కోరేది ముక్తి-తాను కోరేది పీడితుల విముక్తి. పదిరోజుల వరకు తలిదండ్రుల ప్రేమలో కొట్టుకుపోయాడు యతి. ఈ సమయం లోనే మయూర సంగతులన్నీ తెలిసాయి. ఈ దెబ్బ అతడిని మరింత కర్తవ్యోన్ముఖుడ్ని చేసింది. తలిదండ్రులకు ఎలా నచ్చచెప్పాలా అన్నదే అతడి ప్రధాన సమస్య అయింది.

"నా చదువు పాడయితే, నా జీవితమే నాశనమవుతుంది_ నేను మళ్ళీ చదువుకుంటాను_" అని అతి కష్టంమీద తన ప్రయాణానికి ఒప్పించాడు తలిదండ్రుల్ని. వాళ్ళకన్నీళ్ళు చూసినప్పుడు వృద్ధాప్యంలో వాళ్ళని ఏడిపిస్తున్నానా, అని బాధ కలగకపోలేదు. చిన్నప్పుడు నాటకంలో పరిహాసంగా అనుకున్న "చెలీ... కర్తవ్యదీక్షా బద్ధుడనై..." అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. విషాదంగా నవ్వుకున్నాడు. ఇద్దరి పాదాలకు నమస్కరించేసి, చెమ్మగిల్లిన కళ్ళు తుడుచుకొని, వెంకటయ్య దగ్గరకు బయలుదేరాడు.

వెంకటయ్యది చాలా పెద్ద భవనం. అందంగా అధునాతన పద్ధతులలో కట్టబడివుంది. ముందు బాల్కనీకి కుడిచేతి వైపుగా ఆఫీసుగది వుంది. ఆ గది ఎప్పుడూ రకరకాల మనుష్యులతో కిట కిట లాడుతూ వుంటుంది. చూసీ చూడగానే వాళ్ళెవరూ ఆందోళనకారులు కారని అర్థం చేసుకోగలిగాడు. యతి. వాళ్ళంతా రకరకాల పనులమీద వచ్చిన వాళ్ళని మాటలధోరణినిబట్టి ఊహించుకోగలిగాడు. కొందరు ట్రాన్స్ఫర్స్ కోసం, మరికొందరు ప్రమోషన్స్ కోసం, మరికొందరు ఉద్యోగాలకోసం వచ్చినట్లు వాళ్ళ మాటలనుబట్టి తెలుస్తోంది వాళ్ళు తమ మాటలను రహస్యంగా వుంచాలనికూడా ప్రయత్నించటంలేదు. అదేదో అతి సామాన్యమైన విషయమన్నట్లుగా మాట్లాడేసుకొంటున్నారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆందోళనలు జరిపే వెంకటయ్య ప్రభుత్వానికి సంబంధించిన అన్నిపనులు ఎలా సాధించగలడో అర్థంకాలేదు యతికి. యతి చూస్తున్నాడనీ, వింటున్నాడనీ వెంకటయ్య ఏ మాత్రమూ

సంకోచించలేదు సరికదా ఎదురు "చూస్తున్నావా? నే నెంత గొప్పవాణ్నో?" అన్నట్లు చూసాడు. వాళ్ళందరినీ పంపించేసాక "నీకు వివేకానంద కాలేజీలో సీటు రిజర్వుచేసి వుంచానోయ్! వెంటనే వెళ్ళి బి ఏ లోనో, బి యస్. సి లోనో ఎందులో కావాలంటే అందులో చేరిపో!" అన్నాడు. నిర్ఘాంత పోయాడు యతి. తనకు-ఆందోళనలో, జైలులో పాల్గొన్న తనకు, ఒక కాలేజి టి. సి. యిచ్చి పంపేసిన తనకు, రెడీగా సీటు! అదికూడా ఎందులో కావాలంటే అందులో!

"అలా చూస్తావేమిటోయ్? నీకు కాలేజీలో సీట్ కూడా ఇప్పించలేకపోతే నేనేం నాయకుణ్ని? అదీగాక కాలేజీలో చేరి చదవకపోతే నువ్వు విద్యార్థివి కావు. విద్యార్థివి కాకపోతే నువ్వు విద్యార్థి నాయకుడివి కాలేవు విద్యార్థి లోకంలో ఆందోళనలూ జరపలేవు. అంచేత ఇంకేమీ ఆలోచించకుండా వెంటనే కాలేజీలో చేరిపో! ఎంతగా విద్యార్థులను నీ కూడా తిప్పుకుంటే, ఎంతగా విద్యార్థిలోకంలో నీ మాట ఎదురు లేనిదిగా చెపుకుంటే అంతగొప్ప నాయకుడివి అయిపోతావు."

మిగిలిన విషయాలన్నీ ఎలావున్నా 'చదువు' అనే సరికి యతి మనసు ఆనందంతో ఉరకలు వేసింది. తనచదువు తను చదువుకుంటూనే అన్యాయాన్ని అరికట్టడానికి ఆందోళన జరపడానికంటే కావలసిందేముంది?

యతిచక్కగా అనర్గళంగా మాట్లాడగలడు. ఏ సమస్యనయినా ధైర్యంగా ఎదుర్కొని పరిష్కరించగలడు. ఎవరు కష్టంలో వున్నా ఆదుకోవటానికి సిద్ధంగా వుంటాడు. వీటన్ని

టి మించి ధారాళంగా డబ్బు ఖర్చు పెట్టగలడు. అంచేత యతి అతి త్వరలోనే విద్యార్థి నాయకుడయిపోయాడు.

అయితే సంఘంలో అన్యాయాలను అరికట్టడానికి ఆందోళన అంటే యేమిటో యతికి అతిత్వరలో తెలిసివచ్చింది వెంకటయ్య యతికి తన ఇంట్లోనే ఒక గది యిచ్చాడు. విద్యార్థులతో అతిత్వరలో నాయకత్వం సంపాదించుకొన్న యతి అతనికి అత్యంత ఆత్మీయుడయిపోయాడు. అంచేత తన వ్యవహారాలు యతి ముందు బాహాటంగా జరుపుకోవటానికి అత డెన్నడూ సంకోచించలేదు.

ఊళ్ళోనూ, చుట్టుపక్కలా అంతటా ఎప్పుడు యేమి జరుగుతోందో సేకరించి అత ి అందించటానికి మనుష్యులు న్నారు

ఆ పక్క వూళ్ళో ఒక హరిజనుణ్ని ఒక బ్రాహ్మడు బొక్కెనతో బాదినట్లు వర్తమానం అందింది. వెంకటయ్య ఉగ్రుడయిపోయాడు. "చూసావా? కాలం ఇంత మారినా ఇంకా ఈ బ్రాహ్మణుల అహంకారం పోవటంలేదు. నుయ్యి దగ్గరకు ఒక హరిజనుడు నీళ్ళు త్రాగటానికి వచ్చినంత మాత్రాన బ్రాహ్మణుడు అతణ్ని నీళ్ళు త్రాగనియ్యక పోవ టమే కాక, బొక్కెనతో కొట్టాడు ఈ అన్యాయాన్ని ఆందోళనతో, ప్రజల దృష్టిలోకి తీసుకురావాలి"

యతికికూడా ఇది చాలా దురన్యాయ మనిపించింది. ప్రభుత్వం శాసనాలు చేస్తుంది. అవి కాగితాలలోనే వుం టాయి. అమలులోకి రావు. అవి అమలుజరిగేలా చూడవలసిన

బాధ్యత ప్రజలదే! అంటే తమదే! యతి నాయకత్వాన ఆందోళన మొదలయింది పెద్ద పెద్ద నినాదాలతో విద్యార్థులు రోడ్లవెంబడి ప్రొసెషన్‌గా వెళ్ళి దుకాణాలన్నీ మూసేసారు. వాహనాలు కదలనీయలేదు. ప్రభుత్వ కార్యాలయాల పైన రాళ్ళు రువ్వారు. విద్యార్థులను కాదని తెరిచిన దుకాణాలు తగలబెట్టేశారు. పోలీసులు రంగంలోకి వచ్చారు లాఠీఛార్జీలూ-భాష్పవాయువు ప్రయోగాలూ జరిగాయి- కొందరు విద్యార్థులకు తీవ్రంగా గాయాలు తగిలాయి. అక్కడితో విద్యార్థులు మరింత రెచ్చిపోయి ఆందోళన మరింత తీవ్రం చేశారు. కొందరికి దెబ్బలు తగిలాయి. మరి కొందరిని తాత్కాలికంగా లాకప్‌లోకి తీసుకున్నారు. అప్పటికి ప్రభుత్వంకొద్దిగా కదిలి సమస్యను విచారిస్తామని హామీ ఇచ్చింది. వెంకటయ్య ఆజ్ఞ ననుసరించి విద్యార్థులు ఆందోళన విరమించారు. కానీ, బ్రాహ్మణుడు హరిజనుడికి క్షమాపణ చెప్పుకోవలసిందే అని పట్టుబట్టారు. బ్రాహ్మణుడు సిద్దపడ్డాడు. కానీ, హరిజనుడు గడగడలాడుతూ- "ఓయ్ నాయనో! నా వంశం నాశనమయిపోతాదండీ నేను నరకంలోపడిపోతానండీ" అని గోలపెట్టేసి బ్రాహ్మణుడు తనకు క్షమాపణ చెప్పుకోవటానికి ఒప్పుకోలేదు. అతడే ఒప్పుకోనప్పుడు క్షమాపణ ఎవరికి చెప్పుకోవాలని ఆ విషయం వదిలేసారు అందరూ ...

అక్కడ హరిజనులకు వేరుగా బావి తవ్విస్తామని ప్రకటించి సమస్యలను పరిష్కరించేసింది ప్రభుత్వం- బావితవ్వటానికి ప్రారంభోత్సవమూ, మంత్రులరాక, పార్టీలూ అన్నీ అయ్యాయి. మావిడాకుల తోరణాలూ చిన్న మట్టికుప్పలూ

మిగిల్చి ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయారు ఈలోగా పోలీసుల దెబ్బలకు గాయపడిన ఒక విద్యార్థి మరణించాడు. యతి చాలా బాధపడ్డాడు అతనిని కాని, అతనికోసం ఏడుస్తున్న అతని తలిదండ్రుల్ని గాని పట్టించుకొన్నవాళ్ళే లేరు. యతి వెంకటయ్యకీ విషయంచెప్పాడు. వెంకటయ్య ఉద్రేకపడిపోతూ "ఎంత దారుణం జరిగిపోయిందీ? పోలీసులు ఒక నిండుప్రాణాన్ని బలి తీసుకున్నారా? ఈ ఘోరం మీరు ప్రజల దృష్టికితేవాలి. ఈ పోలీసుల అమానుషచర్యలను అరికట్టాలి" అని అరిచాడు. అంతే! ఉసూరుమనిపోయాడు యతి. విద్యార్థి మరణశయ్య పక్కన గుండెలు పగిలేలా యేడుస్తున్నారు తలిదండ్రులు. మామూలు మధ్యతరగతి కుటుంబీకులు ఉన్నదంతా వూడ్చి కొడుకును చదివిస్తున్నారు. ఆ కొడుకు చదువుకుని వృద్ధిలోకి వచ్చి తమను ఆదుకొంటాడని ఆ వృద్ధ దంపతుల ఆశ-చదువుకుంటానని ఇల్లు వదిలి వచ్చినబిడ్డ చచ్చిపోయి కనిపించటం వాళ్ళకు భరించరానిదిగా వుంది. వాళ్ళను ఎలా ఓదార్చాలో అర్థంకాలేదు యతికి-శవ సంస్కారాలయ్యేవరకూ ఆ దంపతుల కూడావుండి, వికలమైన మనసుతో తిరిగివచ్చాడు.

హరిజనులకు ప్రత్యేకించి వేరుగా కట్టదలుచుకున్న బావి ప్రారంభోత్సవం తాలూకు మావిడాకులు ఎండిపోయాయి మట్టికుప్పలు చెదిరిపోయాయి. ఒక చిన్న గొయ్యి మాత్రం అలాగే వుంది.

బ్రాహ్మణుడికీ హరిజనుడికీ రాజీ కుదిరిపోయింది. ఇద్దరూ కలిసే సంత కెళుతున్నారు- బ్రాహ్మణుడికి ఒక పది

గజాలదూరంలో హరిజనుడు, బ్రాహ్మణుడి సంచీని భుజానికి తగిలించుకొని, భయభక్తులతో- అతి వినయంగా-

ఏ విషంలోనూ ఎక్కడా మార్పులేదు వెంకటయ్య ఇంట్లో తప్ప. సతని ఇంటిపైన మరో అంతస్థు లేచింది. అటు బ్రాహ్మణుల దగ్గరా ఇటు కారుల దగ్గరా డబ్బు గుంజాడని అందరూ అనుకున్నారు.

చనిపోయిన విద్యార్థి సమాధిమాత్రం "ఈ బలిదానం దేనికోసం? ఎవరి కోసం ఈ త్యాగం?" అని దీనంగా ప్రశ్నిస్తోంది. ఆ ప్రశ్నకు సమాధానం తెలుసుకోలేక మదలపడి పోతున్నాడు యతి.

# 16

బాబ్డ్ హెయిర్-స్లీవ్ లెస్ బ్లవుస్-హైహీల్డ్ షూస్ లిప్ స్టిక్-బాగా పైకి కనపడుతున్న పొట్టపైన పల్చగా ఫారిన్ జార్జెట్ చీర-స్థూలకాయం-వయసుమీద పడుతున్న కారణంగా ఎక్కడికక్కడ వదులుగా సంచులుగా వేలాడుతున్న చర్మం-నలుపులో కలసే చామన చాయ, ముఖంపైన దట్టంగా అద్దుకొన్న పౌడర్-గట్టిగా నవ్వుతూ నవ్వుతూ వెంకటయ్యతో మాట్లాడుతున్న ఆ స్త్రీని విచిత్రంగా చూస్తూ నిలబడి పోయాడు యతి. యతి అలాచూస్తూ నిలబడిపోయింది.

ఆమె వేష ధారణకి కాదు. వెంకటయ్య దగ్గరకి వచ్చేవాళ్ళలో "ఎన్నో వేషాలవాళ్ళు" ఉండటం యతికి బాగా అలవాటై పోయింది. ఆ రోజు వెంకటయ్య యతితో "సాయంత్రం మూడు తర్వాత రా! నీకు ఒక విప్లవకారిణిని పరిచయం చేస్తాను" అన్నాడు. ఆ విప్లవకారిణిని చూడాలని యతి ఎంతో కుతూహలంగా వచ్చాడు. ఈవిడా విప్లవకారిణి? నమ్మశక్యం కావటం లేదు. అతని మనసులో లలిత మెదిలింది. లలితను చూసినపుడు కూడా విప్లవకారిణి అనుకోలేక పోయాడు. అందుకు కారణం ఆవిడ ముఖంలో కనిపించె సాత్వికత. కాకే లలితతో పరిచయమయిన కొద్దిసేపట్లోనే అది కేవలం సాత్వికత కాదనీ, సాత్విక తేజస్సు అని అర్థం అయింది. అతి ప్రశాంతంగా ఉన్న ఆ ముఖం నిప్పులు చెరగటం చూసాడు. నిప్పులు చెరుగుతున్నపుడు కూడా నిగ్రహం కోల్పోకపోవటం చూసాడు. అప్పుడనుకున్నాడు ఈవిడే నిజమైన విప్లవకారిణి అని.

యతి అలా తెల్లబోయి చూస్తోంటే వెంకటయ్య పరిచయం చేసాడు. "ఈవిడే మిసెస్ జ్వాలాకుమారి. చాలా ప్రోగ్రెసివ్ థాట్స్ ఉన్న సోషల్ వర్కర్. సంపూర్ణ విప్లవం రావాలని ఈమె ఆశయం. అందుకే కృషి చేస్తున్నారు" అన్నాడు. యతి చేతులు జోడించాడు. అప్పటికి, విభ్రాంతిలోంచి తేరుకోలేక-వెంకటయ్య తనను అంత పొగిడినందుకు మోడెస్ట్‌గా సిగ్గు పడుతున్నట్లుగా భుజాలు కుదించి నవ్వింది గర్వంగా. ఆ నవ్వు చాలా గమ్మత్తుగా ఉంది. ఎవరినో వెక్కిరిస్తునట్లు- యెవరిమీదో కసి ఉన్నట్లు...తన అంతరాంత

రాలలో ఉన్న రహస్యాలు యెదుటి వాళ్ళకి తెలిసిపోతా యేమోనని కంగారు పడుతూ దాచుకొంటున్నట్లు - చాలా మంది ముఖాలు నవ్వుతున్నప్పుడే బాగుంటాయి సాధా రణంగా. కానీ ఈవిడ మాత్రం నవ్వుతున్నప్పుడే భయం కరంగా వుంది. అంటే అంత వికారంగా అని కాదు. ఆ నవ్వును సూక్ష్మంగా పరిశీలించగలిగిన వాళ్ళకి ఆ నవ్వులో భయపెట్టే లక్షణమేదో తప్పకుండా కనిపిస్తుంది.

"ఇవాళ సాయంత్రం మీరు మా యింటికి రావాలి. వెంకటయ్యగారు చెప్పారు మీ గురించి, మీలాంటి వ్యక్తులు దేశానికి ఈనాడు చాలా అవసరం ఇంకా మనవాళ్ళు ఇద్దరు ముగ్గురు వస్తున్నారు" అంది. జ్వాలాకుమారి మాట్లాడు తున్నప్పుడు మాత్రం ఆవిడ చాలా గంభీరంగా ఉంది. మాటల్లో ఏదో కమేండింగ్ ధోరణి ఉంది. "అలాగే" అన్నాడు యతి. ఆ కమేండింగ్ ధోరణికి లోలోపల ఆశ్చర్య పోతూ. ఏదో ఒక లక్షణం లేకపోతే ఈ మాత్రం గుర్తింపు యెలా వస్తుంది?

ఆ సాయంత్రం వెంకటయ్యగారితో కలిసి జ్వాలా కుమారి ఇంటికి వెళ్ళాడు. అతడిని అన్నింటి కంటే ఆకర్షిం చింది "మనవాళ్ళు ముగ్గురు నలుగురు వస్తున్నారు" అనే మాట! ఆ అభ్యుదయవాదులను కలుసుకోవాలని అతనికి ఆరాటం కలిగింది. యతి, వెంకటయ్య జ్వాలాకుమారి ఇంటికి వెళ్ళేసరికి జ్వాలాకుమారి చాలా హడావుడిగా ఇంట్లో ఫర్ని చర్ అంతా మెనరో ఫ్యూనుద్వారా బయటికి పంపిస్తోంది. వెంకటయ్య నవ్వుతూ "ఏమిటండీ! చేస్తున్నారు?" అంటూ

ప్రశ్నించాడు. జ్వాలాకుమారి రుమాలుతో నుదుటిమీద చెమట తుడుచుకుంటూ "ఎవరో చెకింగ్‌కి తగలబడ్డారుటండీ! ఈ ఫర్నిచర్ అంతా ఇప్పటికిప్పుడు ఆఫీసుకు తరలించ మన్నాడు మా పతిదేవుడు! ఛస్తున్నాను. ఇవాళ ఆఫీసులో పని ఎక్కువగా వుందని శామ్యూల్ కూడా ఆఫీసులోనే ఉండిపోయాడు. గార్డెన్ వర్కంతా నేనే చేసుకోవాల్సి వచ్చింది" అంది తన చికాకునూ, విసుగునూ ఏ మాత్రం దాచుకోకుండా. వెంకటయ్య నవ్వుతూ "ఆ! ఎంత? ఒకటి రెండు రోజులేగా! ఆ తరువాత మీ ఫర్నిచర్ మీకొస్తుంది. నౌకరూ వస్తాడు" అన్నాడు.

"అవుననుకోండి! ఇవాళ అందరం చాపలమీద కూచోవాలిగా! అలవాటు లేదు బాబూ! వెన్ను నొప్పెడుతుంది!" అని విసుక్కుంటూనే చాపలు పరిచింది. వెంకటయ్య చాప మీద కూర్చుంటూ "పోనీ మీరలా కుర్చీలో కూచోండి!" అన్నాడు యతి తెల్లబోయాడు. వెంకటయ్య లాంటి వ్యక్తి ఆవిడకు అంత ప్రాముఖ్యం ఇస్తున్నందుకు... అతనికి ఒక్కొక్క విషయమే అర్థం కాసాగింది. ఈ "ప్రోగ్రెసివ్ థాట్స్"వున్న సోషల్ వర్కర్ భర్త ఏదో గవర్నమెంట్ ఆఫీసర్ అయి వుండాలి! ఆఫీస్ ఫర్నిచర్ ఇంట్లో చేరింది. ఆఫీసు ఫ్యూను ఇంట్లో పని చేస్తున్నాడు. ఇప్పుడు ఎవరు చెకింగ్ కొస్తున్నారో! అన్నీ హడావుడిగా సర్దేస్తున్నారు. ఒక్కసారి ఇల్లంతా కలయచూశాడు. అది రెండంతస్థుల విశాలమైన భవనం. పై భాగం అద్దె కిచ్చినట్లున్నారు. క్రింది భాగంలో ఉంటున్నారు. ఇంటిముందు చక్కని గార్డెన్, అంద

మైన లాన్ వున్నాయి. ఇల్లంతా ఐశ్వర్యం చిహ్నాలున్నా ఫర్నిచర్ లేక బోసిగా వుంది. జ్వాలాకుమారి మరోసారి భుజాలు కుదించి నవ్వుతూ "భలేవారే! మిమ్మల్ని క్రింద కూర్చోబెట్టి నేను పైన కూర్చుంటానా? ఏం చేస్తాను? నేనూ క్రిందే కూర్చుంటాను - వెన్ను నొప్పి భరిస్తాను" అని ఔదార్యాన్ని ప్రకటిస్తూ చాపమీద గోడ నానుకుని కూచుంది.

గడియారం చూసుకుంటూ "ఇంకా మనవాళ్ళు రాలేదు" అంది. ఆవిడ మాట పూర్తి కాకుండానే సిగరెట్ కాల్చుకుంటూ రేగిన క్రాఫ్‌తో ఒక యువకుడు వచ్చాడు.

"హల్లో శివకుమార్! ఆయీయే! ఆయీయే!" అంటూ ఆహ్వానించింది జ్వాలాకుమారి నవ్వుతూ. అతడు లోపలికి వచ్చి నోట్లో సిగరెట్ చేత్తో పట్టుకుని వెంకటయ్యను, జ్వాలాకుమారినీ 'హలో' అని పలకరించి యతిని చూసి "కొత్తనేస్తరు" అన్నాడు. వెంకటయ్య "మనవాడే! స్టూడెంట్ లీడర్" అని పరిచయం చేశాడు. "అచ్ఛా! ఇవాళ బాధ్యత అంతా మీ యువకులమీదే వుందయ్యా! గ్లాడ్ టు మీట్ యూ!" అని యతిని చెయ్యి పట్టుకుని ఊపేసాడు.

"ఇదేమిటి! సోఫాలన్నీ ఏమయ్యాయి?" అన్నాడు చుట్టూ చూస్తూ.

"ఎగిరి పోయాయిలే! క్రింద కూచో! అందుకేగా చాపలేసాను?" అంది జ్వాలాకుమారి కోప్పడుతున్నట్లు.

"అన్యాయం - నా ఇస్త్రీ ప్యాంట్ నలిగిపోతుంది. మరో ప్యాంట్ లేదు. మా హౌస్ ఓనర్ గంటకో డ్రెస్ మారుస్తాడు. వాడిని షూట్ చేసి వాడి డ్రెస్‌లన్నీ తెచ్చుకోవాలని వుంటుంది"

జ్వాలాకుమారీ, వెంకటయ్యా నవ్వారు.

"అతడిని గంటకోసారి నువ్విలా చూస్తావయ్యా!" అన్నాడు వెంకటయ్య.

"అవేనండి సార్! కాస్త కవిత్వ భాషలో చెప్పాను. అస్తమానూ వచ్చి ప్రోజు మాట్లాడాలంటే విసుగొస్తుంది."

మళ్ళీ అందరూ నవ్వుకున్నారు. ఇంతలో ఖద్దరు కట్టుకున్న నడివయసావిడ వచ్చి అందరికీ నమస్కారం చేసింది.

"ఏంటమ్మా! ఖద్దరు కడితేగాని దేశభక్తి పుట్టిపడదా ఏం?" అని వేళాకోళం చేసింది. జార్జెట్ చీర కట్టుకున్న జ్వాలాకుమారి. ఆవిడ శాంతంగానే అస్తమానూ నాయకులతో ఏదో ఒక మీటింగ్ కి తిరగాలి. ఏదో ఇలాగే అలవాటయి పోయింది" అంది జ్వాలాకుమారి వ్యంగ్యం పట్టించుకోకుండా.

అంతలో ఫోన్ మ్రోగింది. జ్వాలాకుమారి అందుకుని మాట్లాడి సత్యమూ- రాధాకృష్ణా రారట! ఇంక మనమే!" అని వంటింటి వైపు తిరిగి "రత్నా! నాలుగు కప్పులు కాఫీ తీసుకురా! మొన్న బొంబాయిలో కొన్నాను చూడు, ఆ కప్పుల్లో తీసుకురా!" అని మళ్ళా మిత్రులవైపు తిరిగి "ఈ మధ్య మా వారు ఏదో పనిమీద బొంబాయి వెళుతుంటే నేనూ వెళ్ళానులెండి- అయిదు వేలు పట్టుకెళ్ళినా, కావలసిన సామాను కొనుక్కోవడానికి సరిపోలేదు. అక్కడ ఈ కప్పుల డిజైన్, గోల్డుకలర్, నా కెంతో నచ్చి సెట్ నూటయాభై చెప్పినా కొనేశాను." అంది. ఖద్దరుచీర కట్టుకున్నావిడ ఏం కొన్నారని అడిగింది. జ్వాలాకుమారి ఏదో

చెప్పసాగింది. యతికి ఆ సంభాషణ ఆసక్తి లేక వినిపించుకో లేదు. కుమార్ కూడా సిగరెట్ కాలుస్తూ ఎటో చూస్తూ ఆలోచిస్తున్నాడు. ఇంతలో రత్న అనబడే ఆ పనిమనిషి ట్రేలో కాఫీకప్పులు సర్ది తీసుకురానాగింది. జ్వాలాకుమారి ఏదో చెప్పి నవ్వుతుంటే, అనుకోకుండా కుతూహలంకొద్దీ ఆ మాటలు వింటూ కాలికి స్టూలు తగిలి పడిపోయింది. ట్రే కిందపడింది. కప్పులు ఫెళఫెళ్ళున పగిలిపోయాయి. కాఫీ ఒలికి పోయింది. అందరూ "అమ్మో" అంటుండగా-క్రిందపడిలేచిన రత్న బిత్తరపోయి చూస్తూండగా కాళికలాగా లేచిందిజ్వాలా కుమారి!

"రాస్కెల్! వాళ్ళు పైనా తెలియటం లేదు. తెగ తిని బలిసి పొగరెక్కి కొట్టుకుంటున్నావు. చెంప పేలగొట్టి పళ్ళు రాలగొడితేకాని నీకు బుద్ధిరాదు. మదమెక్కి చస్తు న్నావు. నూటయాభై పెట్టి కొన్నాను అరడజను కప్పులు. అయిదు పగలగొట్టేశావు. నీ జీతంలోంచి విరగ్గోడతాను ఆ డబ్బులు ఏంటి. ఇంకా అట్టా బొమ్మలాగ చూస్తా నిల బడ్డావ్! ముందా గాజుపెంకులు పారబోసి. ఆ కాఫీ అంతాతడి గుడ్డ పెట్టి తుడు, మళ్ళీ కాఫీచేసి ఈ సారైనా వయ్యారాలు వలక బొయ్యకుండా పట్టుకురా! మెడ్రాస్ కప్పుల్లో పట్టు కురా. పో! లోపలికి చావు."

ఒక పురుగును విదిలిస్తున్నట్లు చీదరించుకుంటూ, నిప్పులు కురిపిస్తున్నట్లు కసురుకుంటున్న జ్వాలాకుమారిని కన్నీళ్ళు ఆపుకొంటూ దీనంగాచూసి లోపలికి ఈడ్చుకుంటూ పోయింది రత్న, గాజుపెంకు ముక్కను చేతిలో ఎత్తుకుని—

రత్న పనిమనిషే కావచ్చు. చేసింది తప్పే కావచ్చు. అందువల్ల జ్వాలాకుమారికి నష్టం కలిగి వుండవచ్చు. కానీ, అంతమాత్రాన అంతమందిలో అంత నిర్దాక్షిణ్యంగా అలా చీదరించుకుంటే ఆ వ్యక్తి ఏమయిపోతుంది? ఎంత పనిమనిషి అయినా, అది మనిషి కాదా? దానికి మనసులేదా? అదేనా ప్రోగ్రెసివ్ ఔట్‌లుక్.

జ్వాలాకుమారి ధోరణిలో పెత్తనం చెయ్యటానికి అల వాటుపడ్డ ధోరణీ, యేదో పొడిచేద్ధోరణీ కనిపిస్తుంది. అయితే అందరితోనూ అలా వుండదు. కాస్త లోకువగా ఉన్న వాళ్ళ తోనే అలా మాట్లాడుతుంది. ఖద్దరు చీరావిడని ఎప్పుడూ పొడుస్తూనే మాటాడుతుంది. పాపం! ఆవిడ సర్దుకుపోవటా నికే ప్రయత్నిస్తుంది. కుమార్‌ని ఆటలు పట్టిస్తూ సరదాగా మాట్లాడుతుంది. అతడు అదొక ఆటలాగ సరదాగానే సమాధానాలు చెపుతాడు. వెంకటయ్యతో గౌరవంగా మాట్లాడుతుంది యతి మాట్లాడిన నాలుగైదు మాటల్లోను, అతడి శక్తిని అంచనా వేయటానికి ప్రయత్నిస్తూ అతడి విష యాలు ఆరా తీయటానికి ప్రయత్నిస్తుంది. ఈ చాతుర్యా నికి ఆవిడను మనసులో మెచ్చుకున్నాడు. ఆ తర్వాత వాళ్ళ చర్చ ప్రస్తుత రాజకీయాలమీదకు మళ్ళింది. అప్పుడు మాత్రం యతి మనసు చాలా సంతృప్తిపడింది. ఎందుకంటే ఆ నలుగురూ మంచి రాజకీయ పరిజ్ఞానం వున్నవాళ్ళే. అంద రికీ ప్రస్తుత రాజకీయరంగంలో జరుగుతున్న అవకతవకలు తెలుసు. తెరమీదవీ, తెరవెనుకవీ భాగవతాలు తెలుసు. ప్రస్తుత వ్యవస్థను అందరూ తీవ్రంగా విమర్శిస్తున్నారు. ఈ

అక్రమాలన్నీ బయట పెట్టాలని నిర్ణయించుకొన్నారు. గొర్రెల్లా తలలాడిస్తూ బ్రతికే మూర్ఖులున్న సమాజంలో. "నా చిన్ని పొట్టకు శ్రీరామరక్ష" అనుకొంటూ తమజీవితమే తాము చూసుకునే మధ్య తరగతి మహానుభావులున్న సమాజంలో. అన్నీ తెలిసీ అక్రమాలనే సమర్థించే స్వార్థపరులున్న ఇలా ప్రభుత్వాన్నీ, ప్రభుత్వ కార్యాచరణలనూ నిశితంగా నిర్భయంగా విమర్శించేవారు ఎంతేనా అవసరం.

ఆ చర్చలు దగ్గర దగ్గర రెండుగంటలకు పైగా సాగాయి. అందరూ మహోద్రేకంతో మాట్లాడుతున్నారు. వీరావేశంతో ఊగిపోతున్నారు.

అంతా పూర్తయి ఇంటికి బయలుదేరు తున్నప్పుడు కారులో (వెంకటయ్య ఎక్కడికి బయలుదేరినా కారులోనే వెళతాడు) యతి వెంకటయ్యను అడిగాడు. ఈవిడ కూడా మీ ఆందోళనలో పాల్గొంటారా అని. వెంకటయ్య నవ్వాడు.

"వాళ్ళ ఆయనది గవర్నమెంట్ వుద్యోగం. ఆవిడ ఏ ఉద్యమాలలోనూ పాల్గొనదు."

"అయితే మీ రెందుకు ఈవిడచుట్టూ తిరుగుతున్నట్లు?"

వెంకటయ్య దగ్గర ఏర్పడిన చనువుతో నిర్భయంగా అడిగేశాడు యతి. వెంకటయ్యకు కూడా యతి అప్పుడయిపో బట్టి అతడు విస్సంకోచంగా సమాధానం ఇచ్చేసాడు.

"మనవూళ్ళో కాలేజీ ప్రారంభించాను కదూ! దానికి

గవర్నమెంట్ గ్రాంట్ రాలేదు. ఈవిడకి ఎడ్యుకేషన్ సెక్రటరీ తెలుసు. ఏదైనా సహాయం చేస్తుందేమోనని..."

"ఆ!..." అన్నాడు యతి. అంతే! ఇంకేమీ మాట్లాడలేకపోయాడు. అతనికి ఆలోచించే శక్తి నశించిపోయింది.

# 17

వెంకటయ్యకి ఎక్కడెక్కడ ఏం జరుగుతోందో సమాచారం అందించేవాళ్ళు చాలామందే వున్నారు. సమాచారం అందిన వెంటనే అతడు గోరంతను కొండంతగా చేసి ఆందోళన లేవదియ్యటానికి అవకాశాల కోసం చూస్తూ వుంటాడు. గొడవ ప్రారంభం కాగానే యతికి చెప్తాడు. విద్యార్థుల ప్రవేశంతో ఎంత చిన్నగొడవ అయినా పెద్ద ఆందోళనగా మారిపోతుంది. ఇటీవల యతి మనసులో ఈ ఆందోళనలపట్ల వ్యతిరేకత ఎక్కువ కాసాగింది. వెంకటయ్యతో సన్నిహిత పరిచయం పెరిగినకొద్దీ-అతని "బహుముఖ వ్యక్తిత్వం" అర్థమవుతున్నకొద్దీ ఈ ఆందోళనలోని నిజాయితీ ఏ మాత్రమనే ప్రశ్న అతనిని వేధించసాగింది. జనపనార మిల్లులోని కూలీలకీ, యజమాని కొడుకుకూ మధ్య ఏదో ఘర్షణ జరిగిందని తెలుసుకున్నాడు వెంకటయ్య. ఆ విషయమేదో తెలుసుకుని రమ్మని యతిని పంపించాడు. కూలీల గుడిసెల దగ్గరకు వెళ్ళి విషయం తెలుసుకున్న యతి తన చెవులను తను నమ్మలేకపోయాడు. ఈ నాగరిక సమా

జంలో ఇలాంటిది సాధ్యమా? అని నివ్వెరపోయాడు. యాజ మాన్యానికి సంబంధించిన ఒక అధికారి కొడుకు కంటికి కాస్త అందమైన ఆడపిల్ల కనిపించింది. అతడు నలుగురిలోనూ ఆ అమ్మాయిని చూసి కన్నుకొట్టి నవ్వాడు. ఆ అమ్మాయి మండిపడింది. ఛీ అని చీదరించుకొంది. చుట్టూవున్న కూలీలు ఊరుకోలేదు. తిరగబడ్డారు. మా ఆడకూతుళ్ళ జోలికొచ్చా వంటే జాగ్రత్త- అని బెదిరించారు.

అతను అప్పటికి ఊరుకున్నాడు. కానీ, తరువాత మళ్ళీ ఆ పిల్లచేతిలో వందరూపాయయి పెట్టి "మా సర్వెంట్ క్వార్టర్స్‌కి రా!" అన్నాడు. వందరూపాయలు చేతిలో పెట్ట గానే అది పొంగిపోయి తన వెంటబడుతుందని అతని నమ్మ కం. అది ఆ డబ్బు వాడి ముఖానకొట్టి బండ తిట్లు తిట్టింది. ఆ తరువాత ఆ పిల్లనూ, ఆపిల్ల తండ్రినీ ఏదో కుంటిసాకుతో పనిలోంచి తీసిపారేసారు. అక్కడితో కూలీలలో ఉద్రిక్తత పెరిగింది అందరూ సమ్మె ప్రారంభించారు.

అక్కడికి వెళ్ళి ఆ పరిస్థితినంతా పరిశీలించిన యతి పాపం, ఆ కూలి జనుల మండే మనసులతోపాటు కాలే కడు పులను చూసాడు. రెక్కాడితే గాని డొక్కాడని జాతి! దాచుకోవటం తెలియని జాతి! ఎంత సంపాదించినా అప్పటి కప్పుడు తిని, త్రాగి ఖర్చు పెట్టేస్తారు. పసిపిల్లలు ఆకలికి తెగ ఏడుస్తున్నారు. కాస్త జ్ఞానం వచ్చిన పిల్లలు తిండికోసం ఊరిమీద పడ్డారు. ఎవరి ముఖం చూసినా దైన్యం తాండ విస్తోంది అయినా వాళ్ళు పళ్ళ బిగువున సమ్మె కొనసాగి స్తూనే వున్నారు.

జరిగినది అన్యాయమే! సందేహం లేదు. ఈ అన్యాయం అరికట్ట వలసిందే! కానీ, ఆందోళనవల్ల ఇంతవరకూ జరిగిందేమిటి? అన్యాయం అన్యాయంలాగే ఉండిపోయేది! ఆందోళన ప్రారంభం కావటమూ, దానిని అణచటమూ ద్వారా వెంకటయ్య ఎప్పటికప్పుడు ఉభయపక్షాలనుండీ లాభం పొంది తను బాగుపడేవాడు. అంచేత ఇప్పుడు విద్యార్థులు రంగంలోకి దిగి ఆందోళన జరపడంద్వారా కూలీల పరిస్థితి మెరుగు పడకపోగా మరింత విషమిస్తుందని అనుభవం ద్వారా తెలుసుకున్నాడు యతి. అలాగని జరుగుతున్న అన్యాయం చూస్తూ తన కేమీ పట్టనట్లుగా ఊరుకోవటానికి అతనికి మనస్కరించలేదు. తన జట్టులోని మరో అయిదారుగురు కుర్రాళ్ళతో కలిసి తిన్నగా ఆ యువకుడి ఇంటికే వెళ్ళాడు. ఇంటికెప్పుడు వెళ్ళినా ఎవరూ ఉండేవారు కాదు. అయ్యగారు ఒక మీటింగ్ కి, అమ్మగారు మరో క్లబ్ కి, పిల్లలు ఊరిమీదకి ఇలా వెళ్ళిపోయేవారు. ఇంట్లో ఎప్పుడూ పదిమంది నౌకర్లు అరుచుకుంటూ, గోల చేసుకుంటూ ఉండేవారు. ఎప్పుడు వెళ్ళినా కనిపించేది నౌకర్లే! చివరకు ఎలా అయితేనేం ఆ రోజు రాత్రి పదకొండు గంటలకి పెద్దయ్యగారు ఇంటికి భోజనానికి వస్తారని చెప్పాడు నౌకరు. యతి స్నేహితులతో వెళ్ళాడు. పెద్దయ్యగారు బాగా "మందు" వేసుకుని మంచి మూడ్ లో ఉన్నాడు. వీళ్ళు పగలంతా క్షణం తీరిక లేకుండా డబ్బు సంపాదించేది రాత్రి అయ్యేసరికి ఇలా తగలబెట్టటానికే! ఆ పరిస్థితుల్లో ఉన్న పెద్దయ్యగారితో మాట్లాడటం ఏమంత ప్రయోజనం అనే ఆలోచన రాక పోలేదు యతికి కానీ, మరోదారి అతనికి అసలు కనపడదు.

పొద్దున ఎప్పుడు లేస్తాడో తెలియదు. లేవగానే ఎటు వెళతాడో తెలియదు. పోనీ, పొద్దున్నే వచ్చి కాచుకు కూచుందామన్నా నౌకర్లు కూచోనియ్యరు

పెద్దయ్యగారికి నమస్కారం చేసి యతి తనను తాను పరిచయం చేసుకున్నాడు. ఎవ మిత్రులను పరిచయం చేసాడు. అతను కూచోమన్నైనా అనకుండా కనుబొమలు చిట్లించి "నాతో ఏం పని?" అన్నాడు. యతి ముందుకు వచ్చాడు.

"యశోదనూ, ఆమె తండ్రినీ పనిలోంచి తీసెయ్యటం అన్యాయం. తిరిగి పనిలోకి తీసుకోండి!" అన్నాడు.

పెద్దయ్య ముఖం జేవురించి కళ్ళు ఎర్రబడ్డాయి.

"మా వ్యవహారాలలో కలిగించు కోవటానికి మీ రెవరూ? గెటవుట్!" అన్నాడు.

ఈ ప్రవర్తనతో యతిలోనూ సహనం నశించింది.

"మీ కొడుకు పాశవిక వాంఛలకు ఒక మర్యాదగల ఆడది లొంగకపోతే, మీ కొడుకును మందలించవలసింది పోయి, పాపం ఆ అమాయకురాలినీ, ఆమె తండ్రినీ పని లోంచి తీసేస్తారా?" అన్నాడు కోపంగా.

"షటప్! నువ్వేం వాగుతున్నావో నీకు తెలుసా? రుజువు చెయ్యగలవా, నా కొడుకు ఆ పిల్లతో అమర్యాదగా ప్రవర్తించాడని! నా కొడుక్కు ఆ కూలిమనిషే కావలసి వచ్చిందా? బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తే కూలి వాళ్ళను తొలగించే హక్కు యాజమాన్యానికుంది. కూలీల ఈ సమ్మె వెనుక సంఘ విద్రోహకాగుల చెయ్యి ఉందని మాకు తెలుసు, దానిని ఎల్లా అణచాలో కూడా తెలుసు!"

"ఇది చాలాఅన్యాయం. మీా కొడుకు- మీారు బుద్ధి చెప్పకపోతే వాళ్ళే బుద్ధి చెప్తారు ఇది న్యాయంకోసం జరుగుతున్న పోరాటం. ఇందులో సంఘ విద్రోహక చర్య ఏమీా లేదు"

"ఏమన్నావ్? నా కొడుక్కి- వాళ్ళు. . ."

పెద్దయ్య చెయ్యి ఎత్తాడు. యతి ఆ చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. పెద్దయ్య అనబడే యాదవదేవ్ అంగరక్షకులు కర్రలతో తాతి బృందం మీాద పడ్డారు. ఎవరో పోలీసులకు ఫోన్ చేసారు. యాదవదేవ్ ఇంటిమీాదకి గూండాలు వచ్చి పడ్డారని— అదిచూచి యతి మిత్రబృందం పారిపోయారు. పారిపోక నిలబడ్డ యతిని యాదవదేవ్ గారి నౌకరొకడు పాత కత్తితో ఎదుర్కొన్నాడు. వంటినిండా కత్తిపోట్లతోగాని బయటపడలేక పోయాడు. నరకబాధ- పోలీసుల భయం. ఇక బ్రతకననుకున్నాడు యతి. ఇక ఆ సమయంలో ఎంతకాలంగానో తనకు తెలిసినా ఏనాడూ వెళ్ళటానికి ప్రయత్నించని మాయూర ఇంటి తలుపు తట్టాడతను.

# 18

ఆందోళనలు! ఎటు తలతిప్పినా ఆందోళనలు! విశాలాంధ్ర కోసం—ప్రత్యేక తెలంగాణా కోసం! హిందీకి వ్యతిరేకంగా-జీతాలు పెరగాలని - బోనసులురావాలని....

ఇంపీరియాలిజాన్ని - కేపిటలిజాన్ని పడగొట్టడానికి సాయుధ విప్లవం కంటే మరో మార్గం లేదని నిశ్చయించుకున్నారు కొన్ని వర్గాలవారు అయితే తెలంగాణాలో వెనుకబడిన వర్గాలలోనే అనేకమంది ఆంతరంగికంగా, సాంఘికంగానూ కూడా సాయుధ విప్లవానికి అనుకూలంగా లేరు. అంచేత ప్రథమదశగా జాతిలో చైతన్యం కలిగించటానికి ఈ ఆందోళనలు అవసరమయ్యాయి. ఈ ఆందోళనలలో విద్యార్థులు చాలా ప్రముఖపాత్ర వహిస్తున్నారు, దేశమంతటా... అయితే, కొన్ని స్వార్థశక్తులు రాజకీయాల రంగులు పులుముకొని, ఈ ఆందోళనలలో ప్రమేయం కలిగించుకుంటున్నాయి. విద్యార్థులను తమ సోపానాలుగా వాడుకుంటున్నాయి. నిస్వార్థ దేశసేవకులెవరో, స్వార్థపూరిత నయవంచకులెవరో తెలుసుకోలేక విద్యార్థులు నలిగి పోతున్నారు వ్యర్థంగా.

ఎక్కడి పులి?-ఎక్కడి వెంకటయ్య?

ఎక్కడి లలిత?—ఎక్కడి మిసెస్ జ్వాలాకుమారి?

యతి, ప్రభాకర్ ఇద్దరి మనసులలోనూ ఇవే ఆలోచనలు!

నిండా పాతికేళ్ళు కూడా లేకుండా చదువులో ఎంతో ఆసక్తి, ఉత్సాహం ఉండికూడా దురదృష్టవశాన వెంకటయ్యలాంటి స్వార్థపరుల చేతుల్లో పడి వుద్యమాల పేరుతో అటు చదువూ, ఇటు జీవితమూ కూడా నాశనం చేసుకొన్న యతిని చూస్తే చాలా జాలి కలిగింది ప్రభాకర్‌కి.

"యతీ! ఇప్పటికీ నీకు వెంకటయ్య ఉద్యమాలలో నమ్మకం వుందా? ఇంకా అతడు దేశ శ్రేయస్సు కోసమే పాటుపడుతున్నాడని అనుకుంటున్నావా?" ప్రభాకర్ సూటిగా అడిగాడు యతిని.

యతి తల దించుకున్నాడు. అదే సమాధానమన్నట్టు.

"అయితే ఇప్పటి కయినా ఆ వెంకటయ్యను వదిలేస్తావా?"

ఆశగా, బెదురుగా చూసాడు, యతి ఈ విషవలయం లోంచి బయట పడటం సాధ్యమా అన్నట్టు.

ప్రభాకర్ మనసు కరిగిపోయింది.

"నీ కెందుకూ? నువ్వు నిశ్చింతగా ఉండు. ముందు నువ్వు పోలీసులకు దొరికిపో! నేను బెయిల్ మీద విడిపిస్తాను. లాయరుని నియమించి నీ కేస్ గెలిపిస్తాను. ఆ తరువాత ముందు నీ చదువు పూర్తి చేసుకో! చదువు పూర్తయ్యాకే ఏదైనా! ముందు నీకే సరయిన జ్ఞానం లేకపోయాక మరొకరికి ఏం బోధిస్తావు?" యతి సమాధానం చెప్పలేదు. భయంగా, దిగులుగా, ఆందోళనగా ప్రభాకర్‌ని చూసాడు. ఆ చూపుల నిండా లక్ష సందేహాలు! అర్థం చేసుకున్నాడు ప్రభాకర్.

" బి బ్రేవ్ మైయ్! ఇప్పుడింతకంటే మార్గం లేదు. ఇలా అజ్ఞాతంగా ఎంతకాలం గడుపుతావ్ ? నీకు నిజంగా పీడిత ప్రజా నీకాన్ని వుద్ధరించాలని వుంటే ఇది కాదు మార్గం. నువ్విప్పుడు కేవలం కొంచరు స్వార్థపరుల స్వప్రయోజనానికి వుపకరణంగా వున్నావు అంతే;"

ప్రభాకర్ మాటలతో యతికిధైర్యం వచ్చింది. "మీరేం. చెయ్యమంటే. అది చేస్తాను. నాకు భయమనేది లేదు కానీ. అన్యాయంగా బలి కావడంకంటే కర్తవ్యంకోసం పోరాడుతూ చావడం ఇష్టం" అన్నాడు.

యతి తనంతట తానుగా పోలీసులకు లొంగిపోయాడు. ప్రభాకర్ బెయిలు మీద విడిపించాడు. ప్రసిద్ధుడైన లాయర్ని నియమించి కేసు విచారణ ప్రారంభింప చేసాడు. క్షణాలలో ఈ కేసుకు సంబంధించిన రూమర్స్ దేశమంతటా ప్రాకి పోయాయి. అన్ని వార్తా పత్రికలోనూ ఈ విషయం అనేక రూపాలలో వచ్చింది. ఈ పరిణామాలకు అటు యాదవ దేవ్, ఇటు వెంకయ్య ఇద్దరూ భయపడి పోయారు. కోర్టులో కేసు విచారణకు వస్తే ఏయే విషయాలు బయట పడతాయో నని ఇద్దరు ఆరాట పడసాగారు. యతి వెంకటయ్యను కలుసు కోవటంపూర్తిగా మానేసాడు. వెంకటయ్య కబురంపినా వెళ్ళ లేదు. అంచేత వెంకటయ్య తానే యతితో మాట్లాడటానికి ప్రభాకర్ ఇంటికి వచ్చాడు. ప్రభాకర్ ఎంతో మర్యాదగా ఆహ్వానించాడు. వెంకయ్యకు యతి వినయంగా నమస్కారం చేసాడు. కమల అందరికీ కాఫీలు అందించింది. ప్రభాకర్, వెంకయ్య, చాలా సేపు దేశంలో రాజకీయాలు మాట్లాడు కున్నాడు. చివరకు వెంకయ్య యతితో "యతీ! నువ్విలాంటి పని చేస్తావనుకోలేదు." అన్నాడు అసలు విషయానికివస్తూ

"నేనేం చేసాను!" అమాయకంగా అడిగాడు యతి.

వెంకయ్యకు మండి పోసాగింది. "మన ధ్యేయం శాంతి

యుతంగా ఆందోళనలు జరిపించాలని. నువ్వు ఏకంగా యాదవ దేవ్ గారిని హత్య చెయ్యటానికి వెళ్ళావు"

"నేను యాదవదేవ్ గారిని హత్య చెయ్యటానికి వెళ్ళలేదు. అయనతో మాట్లాడటానికి వెళ్ళాను."

"ని కెందుకు అధిక ప్రసంగాలు? ఎవరితో ఎం మాట్లాడాలో అదంతా చూసుకోవడానికి నేనున్నానుగా. చూడు. ఇప్పుడెలా ఇరుకున పడ్డావో!"

"ఫరవాలేదులెండి! ఇప్పుడు నేనొక్కడ్ని ఇరుకున పడ్డాను. ప్రభాకర్ గారి దయవల్ల బయట పడనూవచ్చును. "మీ శాంతియుతమైన ఆందోళనల వల్ల ఈ పాటికి పోలీసుల చేతుల్లో ఎందరు అభం శుభం తెలియని విద్యార్థులు ఆహుతయి పోయేవారో!"

నిర్భయంగా వెంకటయ్యముఖం మీదే అనేశాడు యతి. వెంకటయ్య బిత్తరపోయాడు ఉక్రోషం అట్టుచుకోలేక పోయాడు "నేను నీ మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. నువ్వు పెద్ద దేశ నాయకుడివి అవుతావనుకున్నాను. చివరకు ఇలా గూండాలా తయారయ్యావు" అనేసాడు ప్రభాకర్ ఊరుకోకుండా "ఈరోజుల్లో ఎవరు నాయకులో, ఎవరు వినాయకులో తేల్చుకోవడం కష్టమవుతోంది లెండి? అందరిదీ ఒకటే దృష్టి: పదవులుఎలా దక్కించుకోవాలా అనీ" అంటూ చిన్న చురక అంటించాడు. ఉన్నమాట అన్నందుకు మండిపడుతూ, రాజకీయాలలో ఆరితేరటం వల్ల, ఆమంట అణచుకొని చిరునవ్వు చిందిస్తూ నమస్కారం చేసి బయట పడ్డాడు వెంకటయ్య

కోర్టులో కేసు విచారణ జరుగుతోంది: పాపం కూలీ

లకు కోర్టులంటే చాలా భయం: అనేక కారణాలు! వాళ్ళకు కోర్టు వ్యవహారాలు ఏమీ తెలియవు. కరడు గట్టిన అజ్ఞానం అన్నిటికీ ఎవరో ఒక నక్షత్రకుణ్ణి ఆశ్రయించవలసిందే ఆ నక్షత్రకుడు ఎముకలు తప్ప మరేమీ మిగలని వీళ్ళ ఎముకలు నమిలి కాని వదలడు. దీనికి తోడు కోర్టులో కేసు వాయిదాల మీద వాయిదాలు పడుతూ ఉంటుంది. వాళ్ళ గ్రామాలెక్కడో కోర్టు లెక్కడో: ఆ మూలనుంచి ఈ మూలకు లెక్కలేనన్ని సార్లు ప్రయాణం చెయ్యాలంటె, వాళ్ళ పనులూ పాడవుతాయి. ఇల్లూ గుల్లవుతుంది. అందుకే వాళ్ళు కోర్టులంటే బెదిరిపోతారు. ప్రభాకర్ గారి ప్రోత్సాహంతో యతి సాధించిన మొదటి విజయం, కూలి జనంలో ధైర్యం కలిగించి వాళ్ళు కోర్టుకు వచ్చి సాక్ష్యం చెప్పేలా ప్రోత్సహించటం. దీనితో యాదవదేవ్ నిజంగా బెదిరిపోయాడు. కూలిజనం భయంతో బెదిరిపోతూ అమాయకంగా "చిత్తం: చిత్తం అంటున్నంత వరకూ, అతడు బూటు కాలితో ఎంతైనా అణగద్రొక్కగలడు. కానీ. వాళ్ళు ధైర్యంగా కోర్టులో నిలిచి తనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పటానికి సిద్ధమయితే ఏం చెయ్యగలడు? అక్కడికీ తన చేతిలో వున్న ఒకే ఒక ఆయుధం ప్రయోగించి చూసాడు. డబ్బు గుప్పించి వాళ్ళని తన వైపు తిప్పుకోవాలని చూసాడు. యతికే దిగ్భ్రాంతి కలిగేలా కూలిజనం ఆ లంచాలకు లొంగలేదు. వెనకటి తమ కష్టాలు మరిచిపోకుండా ఒక్కమాటమీద నిలబడ్డారు. కోర్టుకొచ్చి జరిగినదంతా సాక్ష్యమిచ్చారు. కేసు విచారణ యించుమించు సంవత్సరం

సాగింది ఆ సంఘర్షణంతా ప్రభాకర్ అతి బలవంతంమీద యతిని తన ఇంట్లోనే ఉంచుకున్నాడు. కన్నకొడుకులా ఆదరించాడు. అయినా యతికి ఆ ఇంట్లో వుండటం నిప్పులమీద వున్నట్టే వుంది. అందుకు కారణం వేణు.

# 19

తమ ఇంటికి వచ్చిన అతిథిని వేణు అని గుర్తించిన క్షణం... అది అతని జీవితంలో అత్యంత దుర్ముహూర్తం! ఎవరిని తాను ద్వేషిస్తున్నాడో, ఎవరు తనపై ఆధిక్యతను నిరూపించుకుంటున్నారని కుమిలి పోతున్నాడో-ఎవరికి తను తాళికట్టి భార్యగా చేసుకున్న స్త్రీ హృదయంలో స్థానం ఉందని అతనికి నిశ్చయంగా తెలుసో, ఆ వ్యక్తి ఎదురుగా ఉన్నాడు. తనింట్లోనే వున్నాడు. అన్నిటికంటే తన తండ్రి పర్యవేక్షణలో వున్నాడు. ఏమీ చెయ్యలేని అసహాయత అతని కళ్ళలో నిప్పులుగా వురికింది. వేణుని చూసిన మరు క్షణం యతి పరిస్థితి అలాగే అయింది. దురాగ్రహుడు! పశు బలంతో ఒక అమాయకురాలి జీవితాన్ని సర్వనాశనం చేసిన అధముడు! యతి మనసు క్రోధంతో ఊగిపోయింది. ఆ క్షణంలో అక్కడికక్కడ అతడి పీక నొక్కాలన్నంత కసి కలిగింది. కానీ అంతలోనే ఆ ఉద్రేకం మీద నీళ్ళు చల్లింది. అతడు 'మయూర భర్త' అనేభావం! తనను ఇంతగా ఆదరించి అండగా ఉన్న ప్రభాకర్ కొడుకనే భావం!

"ఏం వేణూ. బాగున్నావా?" మర్యాదగా పలకరిం చాడు. వేణు ఒక్కసారి భుజాలు కుదించి ఎగరేసి, అతి నిర్ల క్ష్యంగా "నాకేం!" అన్నాడు. యతి ఇంకేమీ మాట్లాడలేక పోయాడు వేణు మనసు ఏదో కసితో రగులుకుపోసాగింది. తన ప్రతీకారాన్ని ఏ విధంగా తీర్చుకోవాలా అనే ఆలో చనే, అతని కెప్పుడూ—

మయూర కాఫీ కప్పుతో ముందుగదిలోకి వెళ్తూ కని పించింది.

"ఎవరికి కాఫీ?" అన్నాడు కర్కశంగా.

మయూర మాట్లాడలేదు. ఆ కాఫీ యతికని అర్థ మయిపోయింది వేణుకి.

"లోపలకి నడు! అడ్డమైన వెధవలకీ నువ్వు కాఫీ అందించక్కర్లేదు. పనిమనిషి ఇస్తుంది" కసురుకున్నట్లు అన్నాడు వేణు.

ఈ మాటలన్నీ యతికి విన్పిస్తున్నాయి. విపిస్తున్నా యని వేణుకు తెలుసు! వినపడాలనే అంటున్నాడు. మయూర కొంచెంసేపు బొమ్మలా నిలబడిపోయింది. తరువాత ముందుకే అడుగులు వేసింది. మయూర చెంప ఛెళ్ళుమనేలా కొట్టాడు వేణు. మయూర చేతిలో కాఫీ కప్పు ఎగిరి కిందపడి ముక్క లయింది. "అబ్బా!" అని అరిచింది మయూర. వంటింట్లోంచి కమల, ముందుగదిలోంచి యతి ఒక్కసారే లోపలికి వచ్చారు.

"అరరే! ఎంత దెబ్బ" అంటూ మయూర దగ్గరగా రాబోయాడు యతి. సింహంలా వచ్చి అడ్డు నిలిచాడు వేణు.

"మిస్టర్ యతీ! మీరు అనవసరంగా మా యింటి విషయాల్లో కలిగించుకోకండి. మీ పనులు మీరు చూసుకోండి!"

భీదరించుకొంటున్నట్లు, భుకుగునువిదిలిస్తున్నట్లుఅన్నాడు. కమలమ్మ తెల్లబోయి నిలబడింది. ప్రభాకర్ ఇంట్లోలేడు ప్రభాకర్ ఇంట్లో ఉండే సమయం చాలా తక్కువ.

కళ్ళలో రగులుతోన్న పౌరుషంతో, ఏమీ చెయ్యలేని అసహాయత్వంతో మయూరను ప్రేమగా, దీనంగా, బాధగా చూసే యతిని చూస్తోంటే వేణుకి పైశాచికానందం కలిగింది.

"ఇంకా నిలబడ్డావేం? లోపలికి నడు!" అని కసిరాడు. మయూరని. కమలమ్మ కంగారు పడిపోయింది.

"అయ్యయ్యో! ఏమిట్రా ఇది? మయూరా, ఏమిటి తల్లీ ఇది? వాడొక తిక్క మనిషైపోయాడు. ఏ క్షణంలో ఏం చేస్తాడో ఎవరికీ అర్థంకాదు. నువ్వు లోపలికి పదమ్మా! రా! పడుకో!" అని మయూర చెయ్యి పట్టుకొని లోపలికి తీసుకుపోయింది. యతి, వేణు ఇద్దరే మిగిలారు.

వేణు యతి ముఖంలోకి చూసి గర్వంగా నవ్వాడు. "దిక్కులేక మాయింట్లో పడివున్నావు. నామీదే పెత్తనం చెలాయించాలని చూడకు" అన్నాడు. యతి అభిమానం తీవ్రంగా గాయపడింది. అతడు ఆ క్షణంలోనే ఇల్లు వదలి వెళ్ళిపోయేవాడే! కానీ, మయూర దీనమైన ముఖం అతడికి కాళ్ళు ఆడనీయటంలేదు.

మయూరలో కళ్ళూ, ముక్కూ, నోరు, కాళ్ళు,

చేతులూ అన్నీ ఉన్నాయి. అంతే! కాని వీటన్నిటికి మించి నది మనిషిని మనిషిగా నిలిపేది ఆ చైతన్యమేదో మయూరలో నశించిపోయింది. ఆ గాజు చూపులకును యాంత్రికమైన ఆ కదలికలను చూసి యతి మనసు చెదిరిపోయింది. ఇంత దారుణంగా గాయపడిందా మయూర! మయూర వేణుని ఏనాటికీ ప్రేమించలేదని యతికి తెలుసు! కాని లోక సామాన్యంగా సర్దుకు పోయిందేమో అనుకున్నాడు. లేదు! ఆ సున్నితమైన హృదయం అమానుషంగా ముక్కలుగా తరగబడింది. తిరిగి మయూరను మామూలు మనిషిగా చెయ్యాలి! తన దానిని చేసుకోలేకపోయినా ఫరవా లేదు. మయూర మనిషిలా జీవిస్తే చాలు! తాను అక్కడ ఉండటంవల్ల మయూరకు మరింత హాని కలుగుతుందా? అనే ఆలోచన రాకపోలేదు యతికి. కాని, యతికి మంచినీళ్ళూ, కాఫీ, అందిస్తున్నపుడూ, భోజనం వడ్డించేటప్పుడూ ఆ గాజుచూపుల్లో లీలగా కదిలే సంతృప్తి తాను అక్కడ ఉండటమే అవసరమని తోపింపచేసింది యతికి

యతి ఆలోచనలలో సతమతమవుతూ వుండగానే కాఫీ కప్పుతో ఎదురుగా నిలచింది మయూర. వేళ్ళచారలతో ఎర్రగా కందిపోయిన బుగ్గలు, పాడికళ్ళు, బక్కచిక్కిపోయి తూలిపోతున్న శరీరమూ, చేతిలో ముందుకు చాచి పట్టుకున్న కాఫీకప్పూ.

"మయూరా!" బాధగా అన్నాడు.

"కాఫీ తీసుకో!" శాంతంగా అంది.

"నేను వెళ్ళి పోదామనుకుంటున్నాను."

యతి మాటలకు మయూర కళ్ళు చిత్రంగా కదిలి రెప రెపలాడాయి.

"ఇప్పుడు నువ్వు కర్తవ్య దీక్షాబద్ధుడవై వెళ్ళిపోవడం కుదరదు. కర్తవ్య దీక్షాబద్ధుడవై ఉండిపోవలసిందే! ఏ చికాకులెదురైనా—" అనేసి కాఫీకప్పు అతని కందించేసి వెళ్ళి పోయింది.

తెల్లబోయాడు యతి. మయూర ఈ మాత్రం ఆలోచిస్తోందా? తను, ప్రభాకర్‌గారు యేం ఆలోచించుకొంటు న్నారో మయూరకు తెలుసా?

ప్రభాకర్‌తో పరిచయం పెరిగాక యతికి తానెంతటి పొరపాటు మార్గాన్ని అనుసరిస్తున్నాడో బాగా తెలిసి వచ్చింది. వెంకటయ్యను గురించీ, మిసెస్ జ్వాలాకుమారిని గురించీ ప్రభాకర్ చెప్పిన విషయాలు అతని స్వానుభవా నతో చాలావరకు సరిపోయాయి.

వెంకటయ్య మొదటినుంచీ రాజకీయాలలో బాగా చురుకుగా పాల్గొంటున్న వ్యక్తి. అనేకమంది రాజకీయ నాయ కుల లాగానే, అతని దృష్టికూడా పదవుల బంగారుసింహాస నంపైనే కాని, ఆ సింహాసనాలు అందరికీ అందవుగదా! అతనికి అందలేదు. అందలేదనే అక్కసుకొద్దీ ఇలా ఆందోళ నలతో సింహాసనంమీద వున్నవాళ్ళ నిచికాకుపెడుతున్నాడు అంతే!

ఇక జ్వాలాకుమారి— ఆవిడగారికి బీదలపట్ల సాను భూతి వున్నమాట నిజమే! బీదలపట్ల సానుభూతికంటే గొప్ప వాళ్ళమీద కసి మరింత ఎక్కువ. అందుకు కారణం ఆవిడ

ఒకప్పుడు అతి మామూలు మధ్యతరగతి కుటుంబం నుంచి రావటమే! జీవితంలో పైకి రావటానికి అష్టకష్టాలు పడటమే! అయితే, ఆవిడకి గొప్పవాళ్ళ మీద వున్న కసి, అధికారంలో వున్నవాళ్ళను, అంతస్థులో వున్నవాళ్ళనీ కాకాలు పట్టడానికీ వాళ్ళ అనుగ్రహం సంపాదించడానికీ అడ్డురాదు. ఆవిడకి తన హోదా అంచెలంచెలుగా పెంచుకుంటూ పోవడంలో వున్న ఆసక్తి, దేశంలో లేనివాళ్ళందరి అంతస్థూ పెంచటంలో లేదు. అయితే దేశంలో బీదల దౌర్భాగ్యానికి కేపిటలిస్టులే కారణమంటూ చాలా ఉద్రేకంగా కత్తులు దూస్తుంది. ఆ కేపిటలిస్టుల పట్ల అంతకసి నిజంగానే ఆమెకు ఉందనటానికి ఏమీ సందేహంలేదు.

"ఇలాంటి స్వార్థపరుల నాయకత్వంలో మనం సాధించేదేముంది? మనకుకూడా ఏదైనా బావుకోవాలని వుంటే తప్ప" అన్నాడు ప్రభాకర్.

"అంతేకాదు-అతనికి తాను సాధించిన ఉద్యమంలో కూడా నమ్మకం నశించిపోయింది. పాలకవర్గంలో అవినీతి పెరిగిపోతోందని, దానిని యెదుర్కోవాలని- నడుం కట్టాం. ఎందరో ఈ ఉద్యమంలో దూకారు. ప్రాణాలకు తెగించి పోరాడాం. కుటుంబాన్నీ, భార్యాబిడ్డల్నీ అన్నిటినీ మరచిపోయి, ఈ ఉద్యమంలో మునిగిపోయాను. చివరకు సాధించాను. ప్రభుత్వం చేతులు మారింది. అయినా ఏం మిగిలింది ఒకనాడు గద్దెలమీద యే విధంగా ప్రవర్తించేవారో, ఈ నాడూ అదేవిధంగా ప్రవర్తిస్తున్నారు. అదే స్వార్థం- అదే

అవినీతి. అవేకుళ్ళు రాజకీయాలు! కథ గిర్రునతిరిగి మొదటి కొచ్చినట్లయింది. ఇప్పుడు మళ్ళీ మరొక వుద్యమం అవసర మేమో! ఎన్ని వుద్యమాలు నడిపినా ఫలితమింతే. ఇదికాదు మార్చడం. మనం జాతిని చైతన్యవంతం చేయాలి. విద్యా వ్యాప్తి కలిగించాలి మనం ఏదో వాళ్ళకు బోధించటంకాదు. వాళ్ళంతట వాళ్ళే మన మార్గంలో ఆలోచించేలాగ చెయ్యాలి. ఇదొక్కటే విముక్తిమార్గం"

ప్రభాకర్ మాటలు యతికి చాలా నచ్చాయి. ప్రభాకర్ ఆధ్వర్యంలో ఉత్సాహవంతులైన యువకులు చాలా మంది వున్నారు. వాళ్ళు గ్రూప్స్‌గా విడిపోయి, ఒక్కొక్క గ్రూప్ ఒక్కొక్క గ్రామాన్ని చేపట్టి, ఆ గ్రామంలో వెనుకబడ్డ వారందరినీ జాగృతం చెయ్యటమే తమ కర్తవ్యంగా దీక్ష వహించారు. ఈ యువకులలో ఎవరూ తమ తమ చదువులు అశ్రద్ధ చేయకూడదనేది. ప్రభాకర్ విధించే షరతులలో మొదటిది!

ఆ వారాంతంలో మరో యిద్దరితో కలిసి యతికూడా గ్రామాలకు వెళ్ళిరావటానికి నిశ్చయించుకొన్నాడు.

మయూరకుకూడా ఈ విషయాలన్నీ తెలియటం, ఈ స్థితిలో కూడా "కర్తవ్యదీక్ష"ను గురించి హెచ్చరించటమే యతికి ఆశ్చర్యం!

# 20

"ఇప్పుడెందుకు వంట చేస్తున్నావ్ ?" వంటింట్లోంచి వేణు కేక గట్టిగా వినిపించింది. రాత్రి పదిగంటల సమయంలో. ప్రభాకర్ ఇంట్లోలేడు. ప్రభాకర్ ఇంట్లోలేని సమయంలోనే వేణు గొంతు గట్టిగా వినిపిస్తుంది.

ఏ విధంగా మయూరను కాల్చుకు తినాల్నదే, వేణు ఏకైక ధ్యేయం అయిపోయింది వేణు ఎన్ని విధాలుగా ఎంత అభ్యంతరం చెప్పినా మయూర యతికి కావలసినవి చూడటం మానటం లేదు. ఈ మౌన తిరస్కారానికి మండిపడి పోతున్నాడు వేణు. ఆరోజు మయూర చాలా శ్రద్ధగా వంటచెయ్యటం గమనించాడు ఆ రోజె యతి గ్రామంనుంచి తిరిగి వస్తాడని స్ఫురించింది. మనసులో కసిచెలరేగింది. నలుగురుస్నేహితుల్ని తీసుకొచ్చి ఇంట్లోనే తాగేసాడు. నలుగురితో కలిసి భోజనంచేసి పాత్రలన్నీ ఖాళీ చేసేసాడు. వాళ్ళుఉండే, మయూరపైన పెత్తనం చెలాయిస్తూ అదీ, యిదీ అందియ్యిమని అరిచాడు. మయూర ఆ అరుపులు వినిపించుకోలేదు. త్రాగిన మైకంలో వేణులోని పశువు విజృంభిస్తున్నాడు. అంత రాత్రివేళ అప్పుడు వంటప్రయత్నం చేస్తున్న మయూరను చూస్తుంటే ఆపశువు వేణుమనసును కొమ్ములతో కుమ్ముతూ విజృంభిస్తోంది.

"మాట్లాడవేం? ఎందుకిప్పుడు వంట? వంట చెయ్యటానికి వీలేదు-" మయూర చేతుల్లోంచి గిన్నెలు లాగేసుకుని మయూరను వంగదీసి గుద్దసాగాడు. ఆ సమయంలో

వచ్చిన యతి "రాస్కెల్" అంటూ వేణుమీద పడ్డాడు. తాగితూలుతున్న వేణు ఒక్క దెబ్బకే కిందపడ్డాడు.

"ఎవడ్రా రాస్కెల్! నా పెళ్ళాన్ని నేను కొట్టుకుంటాను. నీ కెందుకురా!" అని అరుస్తున్నాడు వేణు.

"నీ పెళ్ళాం! పెళ్ళామయినంత మాత్రాన యిష్టం వచ్చినట్లు బాదవచ్చని ఎక్కడా లేదు. పెళ్ళాం అంటే బానిస కాదు. మరొక్కసారి చెయ్యెత్తావా, జాగ్రత్త!" హుంకరించాడు యతి. వేణులో మొండితనం పెరిగింది.

"ఏం చేస్తావు? ఏం చేస్తావురా చంపుతా! దాన్ని చంపుతా! నీ కళ్ళముందే చంపుతా! నా పెళ్ళాం! తాళికట్టిన పెళ్ళాం!...తాళి...తాళికట్టాను."

ఏడుస్తూ నవ్వుతూ అంటూ మళ్ళీ మయూర మీదకు యెగబడబోయాడు వేణు. యతి అడ్డుపడి మయూర చెయ్యి పట్టుకుని "మయూరా! ఈ నరకంలో ఒక్క క్షణం వుండటానికి వీల్లేదు. నాతోరా!" అన్నాడు. మయూర నెమ్మదిగా చెయ్యి విడిపించుకుంది.

"ఈయన దిగులుతో అత్తయ్యగారు ఆస్పత్రి పాలయ్యారు. మావయ్యగారు ఆ బెంగతో నిమిత్తం లేకుండా ఉన్నారు. ఈ పరిస్థితుల్లో నేను నీతో రాలేను" అంది

నిశ్చేష్టుడయిపోయాడు-యతి. తన అనాలోచిత ప్రవర్తనకు చాలా బాధ పడ్డాడు. తనను కన్నబిడ్డలా ఆదుకున్న ప్రభాకర్ గారికి తాను చేసే ప్రత్యుపకారం ఇదా? అనుకుని చాలా సిగ్గుపడ్డాడు. కాని తన కర్తవ్యం ఏమిటి? తన కళ్ళ ఎదుట మయూర అనుభవిస్తున్న క్షోభను చూస్తూ ఇక్కడ వుండ

వలసిందేనా? మయూరతో చెప్పి వెళ్ళిపోవటానికే నిశ్చయించు కున్నాడు. అలసటగా మంచంమీద పడుకున్న అతనికి వెంటనే నిద్ర వచ్చేసింది. ఒకరాత్రివేళ ఎవరో లేపినట్లయి మెలకువ వచ్చింది. మంచం పక్కనే నిలబడి వుంది మయూర. గాభరాగా లేచి కూచుని "ఏమిటి" అన్నాడు. మయూర నవ్వి "అంత గాభరా దేనికి? అన్నం తినకుండా పడుకున్నావు. లేచి అన్నం తిని పడుకో!" అంది. అప్పుడొక్కసారి జరిగినదంతా గుర్తొచ్చింది యతికి. అంత జరిగిన తరువాత ఆ రాత్రివేళ మళ్ళీ వండిందా తనకోసం!

"నేను అన్నం తినను. నేనసలు ఇక్కడ వుండను" అన్నాడు. నిజంగానే వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడని వణికి నట్లయి నిలబడలేక వంగి, మంచాన్ని గట్టిగా పట్టుకుంది మయూర. "ఏమిటి? ఏమిటి?" అన్నాడు యతి. మయూర సమాధానం చెప్పలేదు. కొంతసేపట్లో స్థిమితపడింది.

"నువ్వు ముందు లేచి అన్నానికి రా! అన్నం తిన్నాక మాట్లాడుదువుగాని. ఎక్కువసేపు నిలబడలేక పోతున్నాను" అంది.

"అదేం? నీకు వొట్లో—?"

"ఇప్పుడు కొత్తగా వట్లో ఏం లేదు- ఇంచుమించు ఏడాదికి పైగా బతికికూడా చచ్చినదానిలా మంచంలో పడు కొని వున్నాను. కోలుకోవద్దా?"

"ఎప్పుడు? ఏమిటి?" అని అడగలేదు యతి మయూరను. ఇంకా కష్టపెట్టలేక అన్నానికి వచ్చాడు. నిజా నికి అతడికి తినాలని లేదు. కాని తినకపోతే మయూర భరించ లేదని అతనికి తెలుసు.

అతనికి అన్నం వడ్డిస్తూ మయూర చెప్పటం ప్రారంభించింది.

"ఆ రోజుల్లో నాకసలు ఏమీ తెలిసేది కాదు అసలు మనసు పనిచేస్తున్నట్లే వుండేది కాదు. కానీ, ఆ సమయంలో కూడా ఏదో ఒక అభిమాన పూరితమైన స్పర్శ నాకు తెలిసేది. ఆ జడస్థితిలో నుండి నేను మనిషిగా బయటపడ్డానంటే అదంతా మామయ్యగారి చలవే!"

యతి తింటున్నాడు. మాట్లాడలేదు.

"యతీ! ఇప్పుడు నా మనసుకి బాధలేదనీ, చాలా సుఖంగా వున్నాననీ చెప్పలేను. కానీ చిత్రంగా జీవితంలో అతి చిన్న దశలోనే నేను ఎన్నో అనుభవించేసాను చిన్నప్పుడు సుఖం అనుభవించాననే అనుకున్నాను. కానీ నిజానికి అది అజ్ఞానం. అనాడు నాకు సుఖానికీ, దుఃఖానికీ తేడా తెలియదు. నేను కోరింది దొరుకుతుంది. అదే సుఖమనుకున్నాను. ఆ తరువాత దుఃఖం. నిశ్శబ్దమైన దుఃఖం. తీవ్రమైన దుఃఖం. నీదైన సంపద. నువ్వు అపురూపంగా దాచుకొన్న సంపద. నీ ఆత్మలో ఒక భాగమైన సంపద-బలాత్కారంగా దోచుకున్నప్పుడు కలిగే దుఃఖాన్ని అనుభవించాను. ఆ తరువాత నా జీవితం.... యతి! నా శత్రువుకైనా ఆ స్థితి వద్దు. శత్రువులైనా అలా బ్రతకటానికి ఇష్టపడవేమో! మందులతో, సూదులతో బలవంతాన ఆహారం ఎక్కించి ప్రాణం నిలపటం ప్రాణం నిలపటమే తప్ప మరోశక్తి లేకపోవటం- మనసుకి ఆలోచించేశక్తి లేకపోవటం-అదంతా లీలగా లోపల పొరలకి తెలుస్తూ ఉండటం. ఏదో చెయ్యాలనే తపన- లేచలేని బల

హీనత - ఏవేవో ఆలోచనలు రావటం - ఏ ఆలోచనలోనూ మనసు ప్రసరించకపోవటం. ఇదంతా ఎంత నరకమో! అనుభవించిన నేను తప్ప ఎవరూ ఊహించలేరు. ఆ దశ తరువాత ఇప్పుడు ఈ బాధ ఎంత సుఖంగా వుందో నేను చెప్పలేను. అవును! నేను బాధపడుతున్నాను. కానీ, బ్రతుకుతున్నాను"

వినలేకపోయాడు యతి. ఆ స్థితిలోనే మయూర ఉండాలనుకోవటం అసలు సహించలేక పోయాడు.

"ఎందుకు సహించాలి నువ్వింత బాధ! ఎందుకీ రంపపు కోత నీకు?" అన్నాడు ఉద్రేకంగా. మయూర మెత్తగా నవ్వింది.

"ఈ జీవిత ప్రవాహం వెంటపడి కొట్టుకుపోయే వారికే బాధా వుండదు. ఒక ధ్యేయంతో ప్రవాహానికి ఎదురీదే వాళ్ళకే బాధలన్నీ. కానీ, అది వాళ్ళకు బాధగా వుండదు. ఒక విషయం చెప్పు. ఉరితీయబడటం తక్కువ బాధా? కోరి కోరి ఆ బాధను భరించటంలో పులిగారు పొందిన ఆనందం ఏమిటి? ఎప్పటికప్పుడు పోలీసులను ఎదుర్కోవడం, బడి ముసుగులో సమావేశాలకు అవకాశం కల్పించే లలితగారు పొందుతున్న బాధలలోని ఆనందం ఎలాంటిది?

యతి తెల్లబోయాడు అతనికి సమాధానం తోచలేదు. గొణుగుతున్నట్లు "అదీ ఇదీ ఒకటెలా అవుతుంది!" అన్నాడు.

"కాదని నువ్వనుకుంటున్నావు. ఒక ధర్మానికీ, ఒక ఆశయానికి మధ్య సంఘర్షణను ఎదుర్కొంటున్నాను. నేను అ తయ్య ... ... కలిగించలేను. నీకు

కావలసినవి అందిస్తూ పొందగలిగే ఈ కొద్దిపాటి ఆనందాన్ని వదులుకోలేను. ఇందులో అధర్మం ఏమీ లేదని నా అంతరాత్మకు తెలుసు గనుక..."

కానీ. దానికోసం వేణు నుండి నువ్వు అనుభవిస్తున్న. చివాట్లు చీదరింపులూ... దెబ్బలు"

మయూరాగ కొంచెంసేపు సమాధానం చెప్పలేక పోయింది ఆ తరువాత నెమ్మదిగా అంది.

"నేను వేణూని ఒక మనిషిగా చూడను. అందుచేత అతని చివాట్లూ చీదరింపులూ, నాకే మాత్రం బాధ కలిగించవు. నువ్వు "నేను వెళ్ళిపోతాను" అన్నప్పుడు కలిగే బాధలో వెయ్యోవంతు కూడా కలిగించవు. అతని దెబ్బలు శారీరకంగా బాధ కలిగిస్తాయనుకో! కానీ అవి మనసుకి ఒక విధమయిన తృప్తిగానే వుంటాయి. ఒక భార్యగా అతనికి నేనే విధంగానూ పనికిరాక పోతున్నాను. దానికి ఈ దెబ్బలకి సరి అనుకుంటాను...'

నవ్వుతూ చెప్పుతుంది మయూర.

ఆ శాంతమూ ఆ స్థిమితమూ చూసి నివ్వెరపోతున్నాడు యతి మరి ఆ నవ్వు మయూరను ఏ శిఖరాల మీదకో ఎత్తేస్తోంది.

సంకోచస్తూనే "అయితే, నువ్వు జీవితమంతా ఇలా వ్యర్థం చేసుకుంటావా!" అన్నాడు యతి.

"వ్యర్థం చేసుకుంటానా? అలా అని ఎవరు చెప్పారు? జీవితమంటే ఏమిటి యతీ? తినటం, బట్టలు కట్టుకోటం పెళ్ళి చేసుకోవటం, పిల్లల్ని కనడం. ఇంతేనా? ఇలా యాంత్రికంగా బ్రతికేస్తే జీవితం సఫలమయి పోయినట్లేనా?

కాదనిపిస్తోంది, ఇంతకంటే జీవితంలో అందుకోవలసింది ఏదో వుంది. శరీరానికి కాక, ఆత్మకు కూడా తృప్తినిచ్చేది బాదలో సైతం ఆనందాన్నే అందించేది అది అందుకోవటానికే ప్రయత్నిస్తున్నాను. వ్యర్థం చేసుకోటంలేదు''

యతికి ఉక్రోషం వచ్చింది.

''మరి నన్ను వెళ్ళొద్దనటం దేనికి? ఈ క్షోభంతా దేనికి?'' అన్నాడు.

మయూర అతి ప్రేమగా యతి కళ్ళలోకి చూసింది.

''నేను నిన్ను ప్రేమిస్తున్నాను కనుక: నీ సాహచర్యంలో నా మనసు ఆనందం పొందుతోంది కనుక. బలహీనంగా వున్న నా మనసు ఈ కొద్దిపాటి ఆనందంతో బలాన్ని పుంజుకొంటుంది గనుక యతీ. ''ప్రేమంటే ఏమిటి! కేవలం శరీరాలు పరస్పరం కోరుకోవటాన్నే ప్రేమ అంటున్నారు. హృదయం గిదయం అని పెద్ద పెద్ద మాటలు వాడతారు హృదయం అంటే రక్తాన్ని ప్రసారం చేసే యంత్రం తప్ప మరేం కాదు!'' అని కాదనరనడం నాకు తెలుసు అది అవునని కానీ కాదనికాని, నేను వాదించను లోకంలో ఎవరైనా తమ మానసిక స్థాయినిబట్టే ఆలోచించి సిద్ధాంతాలు చేసేస్తూ వుంటారు. నాకేమో వునికి ఆధారమైన ఊపిరిలాగ మానసిక చైతన్యానికి ప్రేమ అవసరమనిపిస్తుంది ప్రేమతో ఆర్ద్రమైన హృదయాలే కరకర్తవ్యాలను సునాయాసంగా నిర్వర్తించగలవని పిస్తుంది నీ ప్రేమ శారీరకంకాద టున్నావుకదా. నేను వెళ్ళిపోతేనేం!'' అనవచ్చు కానీ భావనకైనా ఆధారం

కావాలి యతీ! ఆ ఆధారమే నువ్వు. వెళ్ళిపోకు! ఇప్పుడిప్పుడే జీవిస్తున్న నా మనసును చెదరగొట్టకు...."

యతి భోజనం పూర్తయింది. వాష్‌బేసిన్‌లో చెయ్యి కడుక్కొని టవల్‌తో తుడుచుకుంటూ ఉండగా "వెళ్తావా ?" అంది మయూరి జాలిగా.

"వెళ్ళను" అని ముందు గదిలోకి వెళ్ళిపోయాడు యతి.

కమలమ్మ హై బ్లడ్ ప్రెషర్‌తో ఆస్పత్రిలో వుంది. ప్రభాకర్ ఆమెదగ్గరే వున్నాడు. వేణు తప్పతాగి వున్నాడు. ఆ సమయంలో ముందు గదిలో యతి, లోపలి గదిలో మయూర. ఒక విధమయిన ప్రశాంతతతో సుఖ నిద్రపో జారుకోగలిగారు.

# 21

మయూరలో వచ్చిన మార్పు కమలా ప్రభాకర్‌లిద్దరికీకూడా ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించింది. నిలబడటానికి కూడా శక్తిలేక తూలిపోయే మనిషి యంత్రంలా ఎన్ని పనులైనా చకచకచేసేస్తోంది. ఇంట్లో పనిచేస్తోంది. కమలకు కేరియర్‌కు మోసుకెళ్తోంది. కమలగారి దగ్గిరుండి ఉప్పు తక్కువగా వేసిన ఆహారం కబుర్లు చెప్తూ తినిపిస్తోంది మధ్యాహ్నం మళ్ళీవచ్చి ... తీసి అందిస్తోంది. మయూర్ ఉత్సాహం ముందు కమలమ్మ తన ముఖాన్ని

కూడా మరిచిపోతోంది. ఊరుకోలేక ఒక్క-సారి "అబ్బాయీ నువ్వూ బాగుంటున్నారా అమ్మా?" అని అడిగేసింది. మయూర నవ్వి "మేం బాగుండనిది ఎప్పుడు?" అంది. ఆ వెర్రిబాగుల తల్లి అందుకే పొంగిపోయింది. ప్రభాకర్‌లో కూడా మయూర ఉత్సాహం కొత్త ప్రోత్సాహాన్ని కలిగించ సాగింది.

"మావయ్యగారూ! ఇంత ప్రేమగా చూసుకొనే మీరుండగా అత్తయ్యగారిని ఆ దేవుడుకూడా ఏం చెయ్యలేడు. అలా దిగులుపడుతూ కూచుంటే ఎలా? లేవండి_ఇవాళ మీ స్టూడెంట్స్ దియసాఫికల్ మిడిల్ స్కూల్‌లో గెట్‌టుగెదర్ ఏర్పాటు చూస్తున్నారు. మీరు లేకపోతే వాళ్ళకు ఉత్సాహం ఏముంటుంది? వెళ్ళరా?" అని బయలుదేరదీసేది. ఏ విషయాన్నీ గుర్తుంచకోలేని మయూర. ప్రభాకర్ అపాయింట్‌మెంట్స్‌న్నీ గుర్తు పెట్టుకొని పి. ఏ. లాగ అతనికి గుర్తు చేసేది. కొందరు మంత్రులతో, అధికారులతో, అతడు మాట్లాడాలనుకొని వ్రాసిపెట్టుకొన్న విషయాలను సమయానికి గుర్తుచేసేది. ఊపిరాడకుండా పనిచేసే ప్రభాకర్ ఆస్పత్రిలో వుండిపోవటంవల్ల మూలపడ్డ పనులన్నీ వరసగా అతని దృష్టికి తెచ్చేది.

ప్రభాకర్ ఆనందంతో "నీలో ఈ మార్పు చాలా ఆశ్చర్యంగా వుంది. ఇదంతా ఏ కారణమూ లేకుండా అంటే నమ్మను" అన్నాడు హాస్యంగా అన్నట్టు.

మయూర అతనికి కోటు అందిస్తూ

"కారణం ఎందుకు లేదూ? ఉంది" అంది. ప్రభాకర్ కుతూహలంగా "ఏమిటా కారణం?" అని అడిగాడు.

"అంతరాంతరాలలో ఒక ఆశ."

"ఆశ? ఏమిటా ఆశ?"

"తీరా చెప్తే మీరు కాదంటారేమో!"

"అంత కోరరానిదా?"

"కోరరానిది కాదు. నా మీద అభిమానంతోనే మీరు కాదనవచ్చు.

"ఏమిటి చెప్పు. ఏ మాత్రం అవకాశం వున్నా నీ ఆశ నెరవేర్చటానికే ప్రయత్నిస్తాను."

"ఏంలేదు. మీ గ్రూప్స్‌లో ఆడపిల్లలుకూడా వున్నారు కదా! నాకుకూడా ఆ గ్రూప్స్‌లో చేరి గ్రామాలకు వెళ్ళి జాతిని చైతన్యవంతం చేసే కార్యక్రమాలలో పాల్గొనాలని వుంది."

ప్రభాకర్ ముఖం మలినమైపోయింది. అతడు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. "నాకు తెలుసు. మీరు ఒప్పుకోరు. వూళ్ళో అందరినీ ప్రోత్సహిస్తారు కాని, మీ సొంతకోడలు వెళ్తానంటే మాత్రం ఒప్పుకోరు."

నిష్ఠూరంగా అంది మయూర.

"పిచ్చిపిల్లా! అంతేనా? నువ్వు అర్థం చేసుకొన్నది? నువ్వు యింకా మానసికంగాను, శారీరకంగాను కూడా పూర్తిగా కోలుకోలేదు. గ్రామాలలో తిరిగే కార్యక్రమం అంటే, ఆటుపోటులకు ఆగగలగాలి! నువ్విలా తిరగ గలవా? నా మాటవిని ఇవాళనుంచి సరిగ్గా నెలరోజులు నేను ఇచ్చిన మందులు వేసుకుని నేను చెప్పిన ఆహారం తీసుకో. ఆ తరువాత తప్పకుండా నిన్ను గ్రూప్స్‌లో చేర్చుకుంటాను.

"అలాగే! తప్పకుండా తీసుకుంటాను" ఎంతో ఆశగా, ఉత్సాహంగా అంది మయూర. ప్రభాకర్ కూడా చాలా సంతోషించాడు— అంతకుముందు ప్రభాకర్ ఎన్ని విధాలుగా బ్రతిమాలినా మయూర వేళకు మందులు తీసుకొనేది కాదు ఆహారం విషయంలో అసలు శ్రద్ధ తీసుకొనేది కాదు. ఒకపూట తింటే మరొకపూట తినేదికాదు. బ్రతిమాలి కాని బలవంతపెట్టి కాని ఆమెచేత ఎవరూ యేమీ చేయించలేరనేది ప్రభాకర్ అనుభవ పూర్వకంగా తెలుసుకొన్న సత్యం. అంచేత అస్థిపంజరంలా తయారయి కళ్ళలో ప్రాణాలు పెట్టుకొని తిరుగుతోన్న మయూరను చూస్తూ కూడా యేం చెయ్యలేక ఊరుకోవలసి వచ్చేది. మయూర ఈ రకంగానయినా బాగుపడితే, అంతే చాలనుకొన్నాడు ప్రభాకర్.

ఆ రోజు అనుకోకుండా ఒకరోజుముందుగా ఊరినుండి వచ్చాడు ప్రభాకర్. ఇంట్లోనుంచి కేకలు, అరుపులు, గోల, నవ్వులు వినిపిస్తోంటే. కారణం తెలియక చికాగ్గా, కోపంగా లోపలికి వచ్చి అక్కడి దృశ్యంచూసి స్తంభించి పోయాడు. మెయిన్‌హాల్లో వేణు, అతని స్నేహితులు మరో ముగ్గురు వున్నారు. ఇద్దరమ్మాయిలు అరనగ్నంగా వెకిలిగా నవ్వుతూ సోఫాలోపడి దొర్లుతున్నారు. విస్కీసీసాలు, గ్లాసులూ, ప్లేట్లూ, తినుబండారాలూ, సిగ్రెట్లు సరంజామా అంతా వుంది. వీటన్నిటికంటే భీభత్సకరమైన దృశ్యం, అక్కడి నుండి వెళ్ళిపోవాలని గింజుకుంటున్న మయూరను వేణు భుజాలు పట్టుకొని బలవంతంగా అక్కడే కూచోబెడుతున్నాడు.

"వేణూ!" అని గర్జించాడు ప్రభాకర్. ఎవరిలోకంలో వాళ్ళున్న అక్కడి వాళ్ళందరూ ఆ గర్జనకు అదిరిపడ్డారు. సోఫాల్లో వున్న అమ్మాయిలు ఎగిరిపడినట్లు లేచి కూచుని బట్టలు అడ్డదిడ్డంగా వంటిమీదకు లాక్కుని అటూ, ఇటూ పరిగెట్టబోయి ఎటూ దారి కనిపించక వణికిపోతూ నిలబడ్డారు. వేణు స్నేహితులు అప్పటివరకూ ప్రభాకర్ ముందు ఘరానా పెద్ద మనుష్యులుగా చెలామణి అవుతున్నవారే. యిప్పుడు ఆయనకు దొరికిపోయినందుకు వణికిపోతున్నారు.

"సారీ సర్! వేణు రమ్మన్నాడు సార్! రానంటే వూరుకోడు సార్..." అని అర్థం పర్థం లేకుండా యేదేదో వాగటం మొదలు పెట్టారు.

వేణు మూర్ఖుడిలా తండ్రిని చూడసాగాడు. అతని చేతులు మాత్రం అప్పటికీ మయూర భుజాలను వదిలి పెట్ట లేదు.

ప్రభాకర్ చూపులు మొదట మయూరమీదనే పడి నాయి. మయూర అప్పటికే పిచ్చిచూపులు చూస్తోంది. వేణుచెంప చెళ్ళుమనిపించి, మయూర భుజాలమీద నుంచి వేణు చేతులు తొలగించి "అమ్మా మయూరా!" అన్నాడు. మయూర అలాగే పిచ్చిచూపులు చూసింది. అప్పుడప్పుడే స్థిమితపడుతోన్న మయూర మనసు మళ్ళీ చెదిరిపోయిందని అర్థం చేసుకున్నాడు ప్రభాకర్. అతని గుండెల్లో రాయి పడింది. కొడుకుమీద పట్టరాని కోపం వచ్చింది.

"దుర్మార్గుడా! ఏమిట్రా, ఇదంతా! ఈ నరకమంతా ఇంట్లోనే ఎందుకు సృష్టిస్తున్నావ్? మయూరను బలవంతంగా ఇక్కడ ఎందుకు కూచోబెడుతున్నావ్?" అని అరిచాడు.

ఆ అరుపులకి మిగిలిన అందరూ వణికారుకాని, వేణు మాత్రం కొంచెంకూడా లక్ష్యపెట్టలేదు.

"అది నన్ను ఏడిపిస్తూంది. దాన్ని నేను ఏడిపిస్తాను. అన్నాడు ముద్దుముద్దగా. ప్రభాకర్ కి ఆ మాటల పూర్తి అర్థం బోధ పడలేదు. వేణు సమీపిస్తేనే మయూర భరించ లేకపోయేదని ఆతనికి తెలుసు. కాలక్రమాన అదే సర్దు కొంటుందని అనుకున్నాడు. కానీ వేణు నీడ సోకితేగా వణికి పోయే మయూరను చూసి చాలా దిగులుపడ్డాడు. ఇటీవల అన్నీ సర్దుకు పోయాయేమోననే ఆశకలిగింది. కానీ ఎవ్వరూ ఏమీ మారలేదు.

మయూరను నడిపించుకుంటూ లోపలిగదిలోకి తీసికెళ్ళి ఒక స్లీపింగ్ టాబ్లెట్ ఇచ్చి పడుకోబెట్టాడు. పసిపిల్లలా పడు కుంది మయూర. ఒకనాడు జీవం వుండీలేనట్లుగా మయూర గడిపిన రోజులు గుర్తువచ్చాయి. ప్రాణం వుసూరుమంది.

తన గది తలుపులు తెరుచుకుని బయటకు వచ్చింది కమల. ఆ భార్యాభర్తలిద్దరూ కొన్నిక్షణాలు ఒకరినొకరు చూసుకున్నారు. "కమలా! నువ్వు ఉండీ వాడిలా రెచ్చి పోతుంటే చూస్తూ కూచున్నావా?" అన్నాడు ప్రభాకర్.

కమల భరించలేక పోయింది. ఏడుస్తూ "ఏం చెయ్య మంటారండీ! ఒక్కగానొక్క కొడుకు! నా కళ్ళముందు వాడి బ్రతుకు సర్వనాశనమయి పోతుంటే చూస్తూ ఊరుకోవటం తప్ప ఏమీ చెయ్యలేక పోతున్నాను. మీకు పుణ్యం వుంటుంది వాడిని కాపాడండి. నాకోసం కాపాడండి!" అంది.

విచిత్రంగా అందరిలో తానే అపరాధి నయినట్లు

తోచింది ప్రభాకర్‌కి కమలను దగ్గరగా తీసుకుని ఓదార్పుగా భుజం తట్టాడు.

ముందుగదిలో సందడి తగ్గిపోయింది. అందరూ చల్లగా జారుకున్నట్లున్నారు. వేణు ఏం చేస్తున్నాడో చూద్దామని వెళ్ళాడు ప్రభాకర్. సోఫా చేతిపైన తల ఆనించి కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు వేణు.

ఇదా? తన కొడుకు ఇంత ఖర్చుచేసి, ఇన్ని అవమానాలను సిద్ధపడి సంపాదిస్తున్న సుఖం?

ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి?

మయూర మళ్ళీ మంచంలో పడింది. లోపలి గదుల్లో అయోమయావస్థలో వుంది. బయటి గదిలో వున్న యతి మనసులో మంటలు లేస్తున్నాయి. ఒక్కసారిగా ఆ గోడలన్నీ పగులగొట్టి, హద్దులన్నీ చెరిపేసి మయూరను తన చేతులలో ఎత్తుకుని ఈ చికాకులకన్నిటికీ దూరంగా తీసుకుపోవాలని వుంది.

ఏం జరిగిందో తెలుసుకున్నాడు యతి. మయూరను హింసించటమే ధ్యేయంగా పెట్టుకున్న వేణు మయూర కళ్ళ ముందే బజారు ఆడవాళ్ళతో కులకాలని సంకల్పించినట్లు న్నాడు. ఆ చర్యలోని పాశవికత మయూర మనసులో మానుతున్న గాయాన్ని కెలికి వుంటుంది. ఒకనాడు ఏ దెబ్బకు తట్టుకోలేక మతి కోల్పోయిందో ఆ స్మృతులను కెలికి వుంటుంది.

భగవాన్!.... రెండు చేతులలో తలపట్టుకొని తనను తాను అదుపులో వుంచుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు యతి. ఇది అన్యాయం! దారుణమైన అన్యాయం.

సంఘమూ, పెద్దలూ, న్యాయమూ, నీతీ అన్నీ కలిసి మానవ త్వానికి చేస్తున్న అన్యాయం! ఈ సంప్రదాయాలూ, నీతి నియమ నిబంధనలూ ఒక జీవితం కంటే విలువైనవా? ఒక ఒక సుకుమారమైన మనసు నిష్కారణంగా ఇలా నలిగిపోయి ఉన్మాద దశకు చేరుకుంటూ ఉంటే పరిష్కారం తెలిసికూడా సంఘానికీ, ఆ సంఘం అనుసరించే నీతికీ భయపడి చేతులు కట్టుకు కూచోవలసిందేనా? ఆ తరువాత ఉన్మాదినిగా మారిన మయూరను చూసి "ఖర్మ" అని తల పగులగొట్టు కోవలసిందేనా?

బోనులో సింహంలా రొప్పుతూ అటూ ఇటూ తిరుగు తున్న యతి ముందుకు వచ్చి నిలబడ్డాడు.

"నువ్వు పశువ్వి!" అరిచాడు యతి.

"హుష్! అరవకు. నాన్న ఇంట్లో వున్నారు."

యతి ఒక్కసారిగా చల్లబడి పోయాడు. వేణు నవ్వు తున్నాడు. ఏం నవ్వు అది! రోము నగరం తగలబడుతుండగా చూస్తూ నీరో అలానే నవ్వుకున్నాడేమో! కొంతమంది శాడి స్టులు తాము ప్రేమించిన స్త్రీ శరీరాన్ని సిగరెట్లతో కాల్చి ఆ బాధతో పాపం వాళ్ళు విలవిల లాడుతుంటే చూసి ఆనం దిస్తారట! ఆ నవ్వు ఇలాగే ఉంటుందేమో! ఆ చూపులనిండా అల్పత్వం! క్రౌర్యం! పాశవికత! అధమాధమ వ్యక్తిత్వపు వికారం! "మిస్టర్ యతీ! నేను పశువునా? అవును. పశువును చేస్తున్నదెవరో తెలుసా? నువ్వు."

"నేనా!"

"అవును! అవును! అవును! రాస్కెల్! ఏం తెలియ

నట్లు నలిపిద్దామను కొంటున్నావా! నేను పశువునే కాని చవటను కాదురా! నీలా డిగ్రీలు లేకపోవచ్చును కాని వాజమ్మను కాదురా! నువ్వు నా భార్యను ప్రేమిస్తూ ఇక్కడ కూచుంటే నేను చూస్తూ ఆనందిస్తూ పరవశించి పోతానను కొంటున్నావటరా! అది నా ముఖం చూడదా? నను చూస్తే అసహ్యమా? నీకు సకల సేవలు చేస్తుందా? ఒరేయ్! మీ ఇద్దరినీ నా కాలికింద నల్లుల్ని నలిపి పారేసినట్లు నలిపిపారేస్తా కాని మిమ్మల్ని సుఖపడ నియ్యనురా! అర్థమయిందిరా నే నెలాంటి పశువునో!"

పళ్ళు పటపటనూరుతూ వికృతంగా వున్న ఆ ముఖం చూస్తే ఎవరికయినా అర్థమయి పోతుంది. ఆ మనిషి పశువు మాత్రమే కాదు, రాక్షసుడని?

యతి వుద్రేకం పెరిగిపోతోంది.

"పశువా! నీ లాంటి పశువులకూ, పిశాచాలకూ నేను భయపడను. మయూరను ఇప్పుడే, ఈ క్షణమే నాతో తీసుకు పోతాను! ఏం చేస్తావో చేసుకో!" వేణు నవ్వాడు. అదే పైశాచికపు నవ్వు! ఎదుటి వాళ్ళను హింసించి ఆనందం పొందే.నవ్వు.

"మైడియర్ బ్రదర్! ఎవరి మంచితనం ఆధారంగా నువ్వు ఈ కప్పుకింద నిలవగలుగుతున్నావో. వారిమంచితనం ఆధారంగానే నేను మిమ్మల్ని చిత్రవధ చేస్తాను. మయూర లోపలిగదిలోవుంది. నాన్నగారు సర్వ్యవేక్షణలో వుంది. అక్కడికి నాన్నగారు ఎవ్వరినీ నన్నుకూడా రానియ్యటంలేదు. డాక్టర్‌సలహాను పాటించి అక్కడికి ఎలా వెళ్తావో వెళ్ళు.

ఏంచేస్తావో చెప్పు. మయూర మతి లేనిస్థితిలో వుంది. ఆ స్థితిలో, నువ్వు బలాత్కారంగా మయూరను తీసుకుపోతే సంఘమూ చట్టమూ నిన్నూ, దాన్నీ ఇద్దరినీ శిక్షించి దాన్ని నా కాళ్ళ ముందు విసిరిపారేస్తాయి. అప్పుడు ఇంతకు పదింతలుగా కసి తీర్చుకుంటాను. అంచేత నువ్వు అలాంటి వెధవ పనులేవీ చెయ్యలేవు. నువ్వు నిజంగా మయూర మేలుకోరితే నువ్వు చెయ్యగలిగే పని ఒక్కటే వుంది."

అదేమిటని యతి అడగలేదు వేణుతో మాట్లాలంటే అతనికి అసహ్యంగా వుంది. వేణు తనే చెప్పాడు.

"నువ్వుపో! ఇక్కడి నుంచి నువ్వు వెంటనే పో! అలా అయితేనా. మయూర అలా మంచంలో పడి ఏడుస్తూ ఉంటుంది. కనీసం ఆ మాత్రం కరుణిస్తాను. అలాకాక నువ్వు ఇక్కడే ఉన్నావంటే మయూరను పిచ్చిదాన్ని చేసేస్తాను. జుట్టుపీక్కుంటూ ఏడుస్తూ రోడ్లమీద తిరిగే పిచ్చిదాన్ని చేసేస్తాను. పో! నువ్వుపో"

ఉద్రేకంలో పళ్ళు పటపట కొరుకుతూ యతి ముఖం మీదికి పిడికిలి బిగించి ఊపి గిర్రున తిరిగి వెళ్ళిపోయాడు వేణు.

యతి నవనాడులూ కృంగిపోయాయి. తనకు ప్రతిద్వంద్వి వేణు ఒక్కడే అయితే సునాయాసంగా ఎదుర్కోగలిగే వాడు కానీ. అక్కడ ప్రభాకర్ ఉన్నాడు. దుర్మార్గాన్ని ఎదుర్కోవటం అంత తేలిక కాదు. మంచితనాన్ని ఎదిరించటం, వేణు అన్నంత పనీ చేస్తాడనటంలో ఏమీ సందేహం లేదు యతికి. మయూర జుట్టుపీక్కుంటూ ఏడ్చుకుంటూ. వీధు

లవెంటతిరగటం... ఊహామాత్రంగా కూడా ఆ దృశ్యం భరించలేక నిలువునా వణికాడు యతి ఆ రాత్రంతా అతడు నిద్రపోలేదు. అయినా ఏం లాభం? మయూర దరిదాపులకు వెళ్ళే అవకాశం కూడా అతనికి లేదు సహాయంగా ఆ ఆత్మ ఏది ఆర్థిస్తోందో, అది అందించగలిగే స్థితిలో లేడు. ఒక్క సారి నెమ్మదిగా తలుపులుతోసి లోపలికి చూసాడు. చిరుత పులి కళ్ళలా తీక్షణంగా వున్న వేణు చూపులు కనిపించాయి తాగి, తాగి ఎర్రగా వున్నాయి ఆ చూపులు. ఇక లాభంలేదు ఈ దుర్మార్గుడు తననేమి చెయ్యలేక. ఆకసంతా అసహాయురాలైన మయూర మీద తీర్చుకుంటాడు. ముందు మయూర కోలుకోవాలి. అదే ప్రధానంగా ఆలోచించవలసిన విషయం, మిగిలిన సమస్యలన్నీ ఆ తర్వాత ఆలోచించు కోవచ్చు.

అప్పటికప్పుడు తన సామానులన్నీ సర్దుకొని, మయూర పడుకున్న గది దిక్కుగా చీకట్లోకి నిరాశగా చూసి, ఆ యిల్లు వదిలి వచ్చేసాడు.

తెల్లవారింది ఉదయమే పేపర్ చదవగానే, ఆ రోజు విశేషాలు యతితో చర్చించటం ప్రభాకర్‌కి అలవాటు! అలాగే పేపర్ చేత్తో పట్టుకు నియతి గదిముందుకివచ్చి "యతీ! చూసావా..." అంటూ ఆగిపోయాడు. యతి గదిలో లేడు. అచ్చమైన మంచితనం తపవ కుత్సితాలు తెలియని ఆయన మనసు గదిలో యతి సామానులు లేవనే విషయాన్ని గమనించనేలేదు. ఎక్కడికో వెళ్ళిఉంటాడనుకొని. మళ్ళీవాలు కుర్చీలో కూచుని దేశంలో నానా చికాకుగా ఉన్న రాజ

కీయాల గురించి ఆలోచించసాగాడు. జంషెడ్‌పూర్‌లో అల్లర్లు హత్యలు! పోట్లాటలు! ప్రత్యేక కోర్టుల బిల్లుకు వ్యతిరేకంగా ఆందోళనలు-ఆందోళనలు! అల్లర్లు.... అంతే! నిజంగా దేశానికి ఏం కావాలో ఆలోచించేవాడు లేడు. కమిషన్లు, కోట్ల ఖర్చు... సాధించేది శూన్యం! శూన్యం! శూన్యం!

ఎంతకీ యతి రాకపోయేసరికి ఈసారి ఇల్లంతా తిరిగి చూశాడు. యతి కనపడలేదు. గాభరాగా "కమలా! యతి ఎక్కడికి వెళ్ళాడు, నీకేమయినా చెప్పాడా!" అన్నాడు. కమల అంతకన్నా గాభరాగా "లేదండీ!" "లేడా" ఎక్కడికి వెళ్ళిపోయాడు? అయ్యో! నిజంగా వెళ్ళిపోయాడా? మళ్ళీ వస్తాడేమో-" అంది.

యతి వెళ్ళిపోయాడనుకొనే సరికి ఆ దంపతులిద్దరికీ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"నేను ఏం లోటు చేసానూ! ఎందుకు వెళ్ళిపోయాడూ? నా కుడిభుజం విరిగినట్లుంది." అన్నాడు ప్రభాకర్ దిగులుగా-

"వస్తాడండి- నన్ను చూడకుండా ఉండలేడు" అంది కమల ప్రభాకర్‌కి ధైర్యం చెఫుతున్నట్లు తనకు తను ధైర్యం చెఫుతున్నట్లు తనకు తను ధైర్యం చెప్పుకొంటూ-

తన తలిదండ్రులిద్దరూ తన కళ్ళముందే యతి కోసం ఇలా బాధపడటం వేణు వంటికి కారం రాసినట్లుగా వుంది. అయినా యతి వెళ్ళిపోయినందుకు పరమానందంగా వుంది.

"అమ్మాయికేమయినా తెలుస్తుందేమో! వుండు అడుగుతాను" అంటూ మయూర గదిలోకి వచ్చాడు ప్రభాకర్. ఆ పరిస్థితిలో మయూరకు ఆ విషయం చెప్పటం ఎంత

ప్రమాదమో, పాపం! ప్రభాకర్‌కి తెలియదు. ఎలాగైనా యతిజాడ తెలుసుకోవాలనే ఆరాటమే ఆయనకి. కానీ, అది మయూర కెలాంటి దెబ్బో బాగా తెలిసిన వేణు ఆయన వెన కాతలే తనూవచ్చాడు. ఆ ఆనందాన్ని మనసారా అనుభవిం చటానికి.

"అమ్మా! మయూరా! యతి ఎక్కడకు వెళ్ళాడో నీకేమయినా చెప్పాడా!" మయూర మంచం దగ్గరగా వచ్చి ముందుకు వంగి నెమ్మదిగా అడిగాడు ప్రభాకర్.

"ఆ!" అని అరిచింది మయూర... మయూర అప్పు డున్న పరిస్థితిలో అది పిచ్చిదాని అరుపులా తోచింది ప్రభా కర్‌కి. దెబ్బతిన్న పిట్టఅరుపని అర్థమయింది వేణుకిమాత్రమే.

"ఏం లేదులే! ఊరుకోమ్మా ఊరుకో!" బుజ్జగింపుగా మయూర భుజంతట్టాడు. కానీ, మయూర ముఖం అప్పటికే ఎర్రగా అయిపోయింది. చూపులు ఒకచోట నిలపాలని ప్రయత్నిస్తున్నా మనసుకి ఆ శక్తిలేక తీవ్రమైన బాధతో చలించిపోతున్నాయి. అలా చలించిపోతున్న చూపులముందు నిలిచింది వేణునవ్వు-పరమ పైశాచికమైన విజయగర్వాన్ని సూచించే నవ్వు-

"నో!" అని ఒక్క అరుపు అరిచి సొమ్మసిల్లి పడిపో యింది మయూర. ప్రభాకర్ డాక్టర్‌కోసం పరుగెత్తాడు.

తెలివిలేక కిలాపడున్న మయూర శరీరాన్నితృప్తిగా చూసుకున్నాడు వేణు.

ఆ మరునాటికి మయూర మంచంమీాద లేదు. ఆ ఇంట్లోనూ లేదు. నిలబడి నాలుగడుగులు వేయలేని స్థితిలో

మయూర ఎక్కడికి వెళ్ళిందో, ఎలా వెళ్ళిందో, ప్రభాకర్ ఊహకికూడా అందని స్థితి.

దట్టంగా వున్న ఆ అడవిలో చెట్ల ఆకుల సందులగుండా సూర్యకిరణాలు సూటిగావచ్చి డేరాల చిన్న చిన్న కిటికీల్లోంచి ముఖాలమీద పడేసరికి 'అబ్బా అమ్మా!' అంటూ వళ్ళువిరుచుకొంటూ లేచారు డేరాలో అందరూ. పక్కడేరాలో ఇంకానిద్ర పోతున్నారు. మరికొందరు.వీళ్ళు లేచి డేరాలోంచిబయటకువచ్చేసరికి సూర్యోదయమయి చాలాసేపే అయిందని అర్థమయింది. "అబ్బాయిలూ! అమ్మాయిలూ నిద్రలేవండి." అనిగోలగా అరిచి వాళ్ళనుకూడా నిద్ర లేపారు. అంతా కలిసి పన్నెండు మంది ఉన్నారు వాళ్ళు. ఎనమండుగురు మొగవాళ్ళు, నలుగురు ఆడపిల్లలు. అడవులలో తిరగటానికి వీలుగా అందరూ పేంట్స్‌తోనే వున్నారు. ఏదో నీటిపారుదల ప్రదేశం చూసుకునే, రాత్రి ఆగటంచేత కాలకృత్యాలకు ఇబ్బంది కలగ లేదు. ఆడపిల్లలంతా పెద్దింటి పిల్లలే. చదువూ సంస్కారాలున్న వాళ్ళే! అరణ్యప్రదేశం కావడం వల్ల ఎక్కడికి కదిలినా నలుగురుకలిసి కదిలేవారు. అందరిదగ్గరా రైఫిల్స్‌వున్నాయి. వాటిని వుపయోగించే విధానము అందరికీ తెలుసు.

కాలకృత్యాలు ముగించుకొని పన్నెండుగురూ బ్రేక్‌ఫాస్ట్‌కి కూచున్నారు. టిన్స్‌లో చిన్న బిస్కట్స్, బ్రెడ్, బటర్ మొదలైనవి ఓపెన్‌చేశారు. టిన్స్ పై మూతలనే ప్లేటుగా వాడుతూ అదిఅందరూ ఉపయోగించుకొంటూ తిన సాగారు.

"నేను స్నానం చేస్తున్నపుడు అక్కడ ఒక అందమైన రాయి కనిపించింది ఎంత అందంగా వుందో! షో కేసులో

వుంచుకుంటే ఎంతో బాగుండేది! ఇంకా ముచ్చట పడిపోతూ అంది మనోహరి.

"తేవలసింది మరి, మనదగ్గరున్న ఫుడ్ టిన్స్ రెండు క్రింద పారేసి ఆ రాయి మోసుకు పోయేవాళ్ళం." వెక్కిరింపుగా అన్నాడు హేమంత్.

"అందుకే వదిలేసాను. ఇప్పటికే ఈ బరువు మొయ్యలేక ఛస్తున్నాము ఇంకా రాళ్ళుకూడా ఎక్కడ మొయ్యగలం?"

"బ్రహ్మాండమైన అడవిలో కొంతమంది మాత్రం మనుషులు, అతికొద్దిపాటి ఆహారపదార్థాలు, అలాంటప్పుడు రాసులకు రాసులు బంగారం కనిపిస్తుందనుకోండి. అప్పుడు మనిషి బంగారంమోసుకుపోతాడా! ఆహారంమోసుకుపోతాడా! ఆలోచించండి."

"ఇంచుమించు ఇలాంటి అయిడియా మీద ఈ మధ్య ఎవరో నవలవ్రాశారు."

"నాకు తెలుసు! నేను చదివాను. అందరూ ఒకరినొకరు చంపుకోటానికి ప్రయత్నిస్తారు."

"ఒక్కడు తప్ప. కానీ అతడూ చంపేస్తాడు తనని తాను కాపాడుకోటానికి. కానీ ఇక్కడ సమస్య అదికాదు. ఆహారం వుంది. బంగారం వుంది. ఈ రెంటిలో ఒకటిమోస్తే మరొకటి మొయ్యలేడు. ఆ పరిస్థితుల్లో మనిషి యేది మోస్తాడు?"

"మనిషి ఒక్కడే అయితే తప్పకుండా ఆహారమే మోస్తాడు. కాని మనిషి ఒక్కడే వుండడు, వుండలేడు. నలు

గురిలో వుండాలనుకుంటాడు. ఆ నలుగురిలో తానే ఎక్కు-
వగా వుండాలనుకుంటాడు. ఈ రెండు లక్షణాలూ మానవ
స్వభావంలో విడదీయరానంతలా కలిసిపోయి వున్నాయి. నలు
గురున్నప్పుడు ప్రతి ఒక్కరిదృష్టి బంగారంమీదే వుంటుంది.
ఆహారంతో పాటుగా బంగారాన్నికూడా తరలించుకు పోవా
లనే ఆశ ప్రతి ఒక్కరిలోనూ కలుగుతుంది. బలవంతుడైన
వాడు ఆహారాన్ని చేజిక్కించుకుని మిగిలినవాళ్ళను అర్థాక
లితో మాడ్చి వాళ్ళతో బంగారం మోయించి చివరకు ఆ
బంగారంకూడా తన ఆధీనం చేసుకుని పెత్తనం చెలాయిస్తాడు.
ఈ నాడు ప్రపంచమంతట జరుగుతున్న అన్ని అన్యాయాలకు,
అక్రమాలకూ బీజం ఇదే!'' ఆలోచిస్తూ వ్యాఖ్యానిస్తున్నట్లు
అన్నాడు ఉదయ్.

"మిగిలినవాళ్ళు అర్థాకలితో వుంటేనేం? వాళ్ళంతా
కలిసి బంగారం చేజిక్కించుకునే ఒక్కణ్నిచితకతన్ని సుఖంగా
ఆహారాన్నీ బంగారాన్నీ అందరూ అనుభవించవచ్చు కదా!''
ఉద్రేకంగా అంది మమత– ఉద్రేకంగా తల ఊపుతూ
మాట్లాడుతునప్పుడు ఆ అమ్మాయి ఉంగరాల బాబ్డ్ హెయిర్
విచ్చలవిడిగా ముఖం మీద పడుతూ ఉంటుంది–
చేతో తీసుకోవటానికి కూడా విసుగే ఆ అమ్మాయికి
పొగరుగా తల ఒక్కసారి పైకి ఎగరేస్తుంది జుట్టు వెనక్కి-
కీలా!

మమత మాటలకు తేజస్వి ఒప్పుకోలేదు. "నువ్వు
సూచించినది పరిష్కారమార్గం కాదనను. కానీ అది సంపూర్ణ
పరిష్కార మార్గం కాదు- మిగిలిన వాళ్ళంతా కలసి

ఒక్కణ్ణి అణిచేస్తారు. అంతవరకూ చాలా తేలికే! మళ్లీ వీళ్ళలో కొందరు మొదటి వాడిలాగే తయారవుతారు. కథ మొదటికొస్తుంది. అప్పుడు మళ్ళీ వాళ్ళను చంపాలి. వాళ్ళని వీళ్ళూ వీళ్ళనివాళ్ళూ చంపుకొంటూ పోవడమే నిరంతరంగా సాగుతుంది. ఇంత కంటే ఆ నలుగురూ సంపూర్ణ మానవత్వంతో నిండైన మనుష్యుల్లా ప్రవర్తిస్తే ఇలాంటి సమస్యలు రానేరావు.

"ఈమనుష్యుల్లో సంపూర్ణ మానవత్వ కాదండీ. మానవత్వం పూర్ణంగా. అంటే 'సున్నాగా, వుంటుంది' వాళ్ళను చావగొట్టి చెవులు నులియ్యకపోతే బుద్ధిరాదు"

కోపంగా అన్నాడు విమల్!

తేజస్వి ఒప్పుకోలేదు.

" అలా అంటే ఎలా? ఇప్పుడు మనమే వున్నాం! పన్నెండు మందిమి బయలుదేరాం. ఇంతవరకూ ఎప్పుడైనా ఒకరికి దక్కకుండా మరొకరకం ఏదైనా తినటానికి ప్రయత్నించామా?

"నాకు తెలుసు, మీరేం. అనబోతున్నారో! మనలో వున్నసంస్కారం వాళ్ళలో లేదని? ఒప్పుకుంటాను. కాని ఆ సంస్కారమే కలిగించటానికి ఎందుకు ప్రయత్నించకూడదు తేజస్వి మాటలను ఖండిస్తూ రవి అందుకున్నాడు.

"శరీరంమీద వ్రణం లేనప్పుడు ముందు ఆ వ్రణానికి శస్త్రచికిత్స చేసి ఆ తరువాత వ్రణం రావటానికి గల కారణాలను, నివారణోపాయాలనూ ఆలోచిస్తాం! ఈ మహానుభావులకు సంస్కారం మెత్తని మాటలతో రాదు లెండి!"

మమత లేచినిలబడి "కబుర్లు చాలు! లేటజ్ స్టార్ట్! గెటప్ మెన్" అంది.

కిరసనాయిల్ స్టౌ మీద పాలపొడి పాలలో కలిపిన ఇన్‌స్టెంట్ కాఫీ తాగి అందరూ లేచారు. టిన్స్ అన్నీ చక చక బేగ్స్‌లోకి సర్దేసారు-బేగ్స్ భుజాలకు తగిలించుకున్నారు అన్నింటి కంటే బరువు టెంట్స్! అవి ఇద్దరు కలిపి కావిడి లాగ పట్టుకున్నారు. ఉదయ్ దగ్గర మేప్ వుంది. అతడు మేప్‌నూ, పరిసరాలనూ పరిశీలిస్తూ మార్గ నిర్దేశిస్తున్నాడు. బరువైన బేగ్ భుజానికి తగిలించుకొన్న మమత కొంచెం ముందుకు వంగి నడుస్తూ, ఈమేప్‌లు బ్రిటిష్ గవర్నమెంట్ కాలం నాటివన్నారు ప్రభాకర్ సార్! అప్పటికీ, ఇప్పటికీ ఏమైనా మారిందేమో జాగ్రత్తగా చూడు! అంది.

ఉదయ్ నవ్వుతూ "మన ఇంటీరియర్ గిరిజన ప్రాంతాలు. బ్రిటీష్ గవర్నమెంటు కాలం నుంచీ, ఈ నాటి వరకూ ఆవగింజంతయినా మారలేదు. ఆ భయం నీకేం అక్కర్లేదు!' అన్నాడు.

"అయ్యయ్యో! అయితే మన ప్రభుత్వం వారి ప్రణాళికలు!"

"వాటికేం? అని నిక్షేపంగా ఉన్నాయి కాగితాల మీద."

'అయితే ఈ ప్రణాళికలు అమలుజరపనందుకు, ప్రణాళికలు సరిగ్గా పనిచేయనందుకు దానికి సంబంధించిన అధికారుల మీద ప్రభుత్వం ఏమీ చర్యతీసుకోదా?"

"ఎందుకు తీసుకోదు? ఈ వివరాలు పరిశీలించమని కమీషన్లు నియమిస్తుంది."

"ఆ తరువాత....?"

ఆ కమీషన్ల నిర్వహణకు కోట్లసంఖ్యలో డబ్బు ఖర్చవుతుంది!"

"ఆ తరువాత'..."

"ఆ కమిషన్లు విచారించిన అంశాలు ఏమీ లేవు గనుక ఆ కమిషన్లు వ్యర్థమని కమిషన్లు రద్దు చేసేస్తుంది"

అందరూ ఒక్కసారి విరగబడి నవ్వారు. భుజాల మీది బరువు. ఎండకు వళ్ళంతా పట్టిన చెమటలు కాలి నడకన ప్రయాణం చెయ్యటంవల్ల కలుగుతున్న శ్రమ. అన్నీ ఆ నవ్వులలో ఎగిరిపోయాయి.

"ఓ గాడ్" అని కేకపెట్టి నడుస్తున్నది ఆగిపోయింది శాంత కిందకు భయంగా చూస్తు. అందరూ ఆగిపోయారు. శాంత కాళ్ళదగ్గిర పడిపున్న స్త్రీ శరీరాన్ని చూసారు. వాళ్ళలో ఉదయ్. ప్రతాప్ లిద్దరూ మెడిసిన్ విద్యార్థులు. ప్రతాప్ ఫైనల్ లో ఉన్నాడు. ఉదయ్ మూడో సంవత్స రంలోకి వచ్చాడు. ఫస్ట్ అయిడ్ సరంజామా వాళ్ళదగ్గర వుంది. ప్రతాప్ ఆ యువతిని పరీక్షించి. "ప్రాణాలతోనే వుంది" అన్నాడు_ తరువాత ఏం చెయ్యాలన్నట్లు అందరూ నిస్సహాయంగా ప్రతాప్‌నే చూసారు." సొమ్మసిల్లిపోయింది. ముందు ముఖంమీద నీళ్ళు చల్లాలి! ఆ తర్వాత ఏదైనా పట్టించాలి! తేరుకోవచ్చు" అన్నాడు_ అందరూ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. వాళ్ళదగ్గిర రెండు మూడు వాటర్ బాటిల్స్ ఉన్నాయి. వాటిలో నీళ్ళు ఇలా ఖర్చు చేస్తే మళ్ళీ నీటిసదుపాయం ఉన్న ప్రదేశం చేరుకొనేవరకూ నీళ్ళుదొరకటం కష్టం—దాహంవేసినా తాగటానికి నీళ్ళు

వుండవు- వాళ్ళు తటపటాయించింది. కొన్ని క్షణాలు మాత్రమే- శాంత తన సంచిలోంచి వాటర్ బాటిల్ ప్రతాప్ కందించింది- తేజస్వి స్టౌ వెలిగించి చిన్నగిన్నెలో నీళ్ళుపడేసింది. పాలపౌడి డబ్బా, ఇన్‌స్టెంట్ కాఫీడబ్బా, తీసింది- హేమంత్ రైఫిల్ చేత్తో పట్టుకుని చుట్టూచూస్తూ ఓ కంట ప్రతాప్‌నీ తెలివిలేని యువతిని చూస్తూ తిరుగు తున్నాడు- ప్రతాప్ ఆ యువతి ముఖంమీద నీళ్ళు చల్లాడు వాటర్ బాటిల్ ఖాళీ అయింది- కానీ, శ్రమకు ఫలితం దక్కింది- ఆ యువతి కళ్ళు తెరిచింది. వెంటనే తేజస్వి కాఫీ త్రాగించింది-

"ఓ గాడ్" ఈవిడ చాలాబలహీనంగా వుంది- ఈ స్థితిలో ఎందుకు బయలుదేరినట్లు? అందులో ఒంటరిగా. .." అన్నాడు ఉదయ్ ఆ యువతి స్థితి చూసి నివ్వెరపోతూ- మనోహరీ. రీటా- ఆ యువతి పక్కనే ఉన్న సంచి చూసారు అందులో ఒక జత బట్టలు కొద్దిగా డబ్బు, ఒక పెద్ద కట్ట మేప్స్ వున్నాయి-

ఆ మేప్స్ చూడగానే అందరూ ఒక్క సారిగా, ఈవిడ దగ్గిర ఇంటీరియర్ విలేజ్‌స్‌కి మేప్స్ ఉన్నాయి!" అన్నారు ఆశ్చర్యంగా-

"కానీ ప్రభాకర్‌సార్ అన్ని మేప్సు ఒక్కళ్ళకే ఇయ్యరు! ఒంకటరిగా అసలుపంపరు!" ఆలోచిస్తూ అంది శాంత. ఈ లోగా ఆ ఆ యువతికి కొంచెం శక్తివచ్చింది- కొంతసేపు అయోమయంగా అందర్నీ చూసినా- త్వరలోనే కోలుకొని "థాంక్స్!" అంది-

"మీరు రెక్కడినుంచి బయలుదేదారు? ఇక్కడికెలా

వచ్చారు? రూట్ ఎలా ఎలా తెలిసింది? ఈ మేప్స్ ఎలా వచ్చాయి మీదగ్గరకి? రాత్రి ఎక్కడున్నారు? ఒంటరిగా ఎందుకు బయలుదేరారు?"

ఇలా ప్రశ్నల వర్షం కురిసింది ఆ యువతిపైన నాలుగువైపులనుంచీ...,

పాపం. ఆ యువతి వెంటనే సమాధానం చెప్పలేక పోయింది. ఎలాగో ఓపిక తెచ్చుకుని "నాకు కూడా మీ గ్రూప్స్‌లో చేరాలనిపించింది. ఇంట్లో ఒప్పుకోలేదు- అందు అందుకని చెప్పకుండా వచ్చేసాను!"

నివ్వెరపోయారు అందరూ. కొంత చికాకు కూడా కలిగింది. ఆమె మూర్ఖత్వానికి.

ప్రతాప్ కొంచెం తీక్షణంగానే "మీకు ఆరోగ్యం అంతగా బాగున్నట్లు లేదుకదూ,, అన్నాడు.

"అవును!,, ఒప్పుకుంది ఆ యువతి.

"మరి. ఈ అనారోగ్య స్థితిలో గ్రూప్స్‌లో చేరి ఏం సాధిద్దామని వచ్చినట్లు!" చికాగ్గా అన్నాడు- ఆ యువతి తలవంచుకొంది. తేజస్వి ప్రతాప్‌ను సమాధాన పరుస్తూ ఆ యువతితో నిదానంగా "మీ దగ్గరకి ఆ మేప్స్ ఎలా వచ్చాయి? మీరు ఎక్కడికని బయలుదేరారు?" అంది.

"ఆ మేప్స్ నాస్నేహితురాలి దగ్గర సంపాదించాను. ప్రత్యే కించి ఒకచోటికని బయలుదేరలేదు. చేతికందిన మేప్ తీసు కున్నాను. అందులో రాసిపెట్టిన ఊరికి టికెట్ కొనుక్కుని రాత్రి బయలుదేరి ఇవాళ ఉదయమే చేరుకున్నాను. ఆతరు వాత నడక ప్రారంభించాను."

"మై గుడ్‌నెస్! ఒంటరిగా! మీకు రూట్ తెలుసా! ఈ ప్రయాణంలో ఉండే ప్రమాదాలు తెలుసా!"

"ఏం తెలియదు- భగవంతుణ్ని ధ్యానిస్తూ నడక ప్రారంభించాను!"

గ్రూప్‌లో కొందరు ఈ మాటలకు గట్టిగా నవ్వారు- తేజస్వి కనుసైగతో వారించి ఏమీ అనుకోకండి. మాలో ఎవరమూ ఒక మూల కూచుని దేవుణ్ని ధ్యానించటంలో నమ్మకం లేనివాళ్ళం- అందుచేత అలా నవ్వారు" అంది-

"మీరు అదృష్టవంతులు! మీకు ఒక మూల కూచుని ధ్యానం చెయ్యవలసిన అవసరమేముంది. మీరు చేస్తున్నదీ, చెయ్యబోయేది, అంతా తపస్సుకాక మరేమిటి? విశ్వరూపి అయిన భగవంతుడికి అత్యంత ప్రీతిపాత్రమైన తపస్సు!"

ఈసారి వాళ్ళలో ఎవ్వరూ నవ్వలేదు- ఆ యువతిని గౌరవంగా చూసారు.

"మీ పేరు?" అని అడిగింది మమత.

"మయూర!" అని సమాధానం చెప్పింది ఆ యువతి-

తలవని తలంపుగా ఆ గ్రూప్ అంతటికీ సమస్యగా తయారయింది మయూర- లేచి నిలబడలేని స్థితిలొవుంది- వదిలేసివెళ్ళలేరు. ఆ ఎండలో_ ఆ అడవి మధ్య- నీటి వసతి లేనిచోట ఆగటానికి వీలులేదు-

గోచీ పెట్టుకుని భుజానికి ఒక పెద్ద గోనెసంచిమూట తగిలించుకొని, ఆ ఎర్రని ఎండలో అడవిదారిన నడిచి వస్తున్నాడు ఒక కొండదొర. అడవి మధ్యలో నాగరీక జన సమూహాన్ని చూసి ఆగిపోయాడు. హేమంత్‌కి ఇటీవలి సంచారాలతో ఈ అడవి జాతులతో ఎలా వ్యవహరించాలో

అర్థమయింది. అతడు సైగలతో మయూరను చూపించి జబ్బుగా వుందని చెప్పి నీళ్ళువుంటే కావాలని సైగలతో అడిగాడు. అతడు హేమంత్ చేతిలోవున్న రైఫిల్ని భయంగా చూసాడు. హేమంత్ మళ్ళీ అతడిని చంపనని సైగచేసి. టిన్‌లో వున్న చేపలను బహుమతిగా ఆశ చూపించాడు. అతడు జంకుతూనే దగ్గరగా వచ్చాడు. మయూరను చూసాడు. చెయ్యి పట్టుకుని చూసాడు. కను బొమల మధ్య వేలుంచి చూసాడు. తన భాషలో ఏమేమో అన్నాడు. వీళ్ళకు సరిగా అర్థం కాలేదు కాని, రవి విసుగ్గా "ఇతను ఈవిడకి దెయ్యం తట్టిందంటున్నాడు!" అన్నాడు. మిగిలినవాళ్ళు చిన్నగా నవ్వారు. అతడు అందరి చూసి రోషంతో తల అడ్డంగా తిప్పి ఒక చిన్న కొయ్య గిన్నెలో ఏదో వేరురసంపోసి ఇచ్చాడు.

"ఇలా ఏది పడితే అది తాగకూడదు!" అని అడ్డుపడ బోయాడు ఉదయ్.

"ఫరవాలేదు, నేను తాగుతాను" అని తాగేసింది మయూర. కొద్దిసేపట్లోనే మయూరకు నిస్త్రాణ తగ్గినట్ల యింది. నీరసం గానే లేచి నిలబడి "నేనునడుస్తాదా" అంది.

"లెటజ్ స్టార్ట్!" అన్నాడు ప్రతాప్.

కొండ దొరకు చేపల టిన్ బహుమతిగా ఇచ్చేసారు. అందరూ నీరసంగా తూలుతూ అడుగులు వేస్తున్న మయూరతోసహా ముందుకు నడిచారు.

# 22

"వచ్చేస్తాం!" అన్నాడు అందరికంటే ముందుగా నడుస్తున్న ప్రతాప్. అన్నీ కలసి ఓ వంద గుడిసెలుకూడా లేని గ్రామం అది! కొండల మధ్య ఉంది. దూరంగా ఒక కొండ కొమ్ముమీద నుంచి జలపాతంలాగ దార నీళ్ళు పడు పడుతున్నాయి అక్కడా ఇక్కడా చెదురు మదురుగా ఏవో పనిపాటలు చూసుకొంటున్న జనం కొత్తగా వచ్చిన నాగరికులను చూసి బెదిరిపోయారు అందరూ చేతుల్లో పనులు వదిలేసి ఒకరికొకరు దగ్గరగా గుమికూడారు గోచీలతో వున్న మొగవాళ్ళు అప్పుడే విల్లు ఎక్కుపెట్టసాగారు.

"చచ్చాం! వీళ్ళు మనమీద యుద్ధం ప్రకటిస్తున్నారు!" అన్నాడు ఉదయ్

"మేము మీకు శత్రువులంకాదు! స్నేహితులం!" అని గట్టిగా అరిచాడు ప్రతాప్.

అంతలో తమ బాష వాళ్ళకు అర్ధంకాదని గ్రహించి సైగలతో తాము స్నేహం చేసుకోవడానికి వచ్చామన్న విషయాన్ని సూచించటానికి ప్రయత్నం చెయ్యసాగాడు. అక్కడితో ఎక్కుపెట్టిన విల్లుకిందకు దింపారు కాని ఒక్కళ్ళు కూడా ముందుకు రాలేదు.

"లాభం లేదు! మనం అడుగు ముందుకేసే చంపేస్తారు!" అన్నాడు హేమంత్!

ఒక్కొక్కరు నెమ్మదిగా తమ బరువులు దింపు

కున్నారు. ఆయాసపడుతూ నిలబడ్డారు. ఆ గుడారాలనూ సంచులనూ, టిన్స్‌లోని ఆహారపదార్థాలను వింతగా, ఆశగా కుతూహలంగా చూడసాగారు. ఆ కొండజాతివారు అంతలో నీరు కాని రంగులోకి మారిన ధోవతి, కాస్త మాసిన చొక్కాతో, ఆకుచెప్పులు తొడుక్కుని అయిదు పదులు నిండిన మనిషి ఒక గుడిసెలోంచి బయటికి వచ్చి "ఎవరు మీరు!" అని అడిగాడు. ఆ పరిసరాల్లో ఆ మాత్రం మాట్లాడ గలిగిన సభ్యతా సంస్కారాలున్న మనిషిని చూసేసరికి, గ్రూప్‌లో అందరికీ ప్రాణం లేచివచ్చింది. అందరూ అతనికి నమస్కారం చేసారు. గ్రూప్ లీడర్ ప్రతాప్ ముందుకు వచ్చి తనకు తను పరిచయం చేసుకుని, తన గ్రూప్ పరిచయం చేసాడు.

"మాకు సంఘ విద్రోహక శక్తులతో కాని. ప్రభుత్వ వ్యతిరేకత శక్తులతో కాని, ఎలాంటి సంబంధమూ లేదు. ప్రత్యేకించి ఏదో ఒక రాజకీయ పార్టీని ప్రచారం చేసే వుద్దేశ్యంతో కూడా రాలేదు. బాగా వెనుకబడిన ప్రాంతాలలోని ప్రజలలో చైతన్యం కలిగించటమే మా ధ్యేయం! తమ చుట్టుపట్ల ఏం జరుగుతోందో వీళ్ళంతా తెలుసుకోవాలి! తమకు న్యాయంగా ఏం రావాలో తెలుసుకోవాలి. ఆ రావలసిన దానిని ఎలా పొందాలో నిర్ణయించుకోవాలి! వాళ్ళలో ఆలోచనలు కలిగించటం వరకే మేం చేస్తాం! మా నిర్ణయాలు వాళ్ళ మీద రుద్దం! ప్రభాకరరావు సార్ రూపొందించిన ప్రణాళిక. ఇది ఉత్సాహవంతులయిన విద్యార్థులం గ్రూప్స్‌గా ఏర్పడి ఒకొక్క గ్రూప్ వొకొక్క విలేజికి

వెళ్ళి మా లిటరేచర్ సాధ్యమైనంతగా జనసామాన్యంలోకి వ్యాపించేలాగ చూస్తాం!"

ఆయన సంతోషించి "నేనిక్కడ టీచర్ని- నా పేరు నిత్యానందం! ఇలాంటి కార్యక్రమం ఒకటి రూపొందు తూందని తెలుసుకో గలిగినందుకు చాలా సంతోషంగా వుంది" అన్నాడు. ఆ తరువాత వాళ్ళ సరంజామా చూసాడు. "చాలా ప్లాన్‌గా వచ్చారన్న మాట! అన్నాడు నవ్వుతూ అతను కొండజాతి వాళ్ళ వైపు తిరిగి వాళ్ళ బాషలో ఏదోచెప్పాడు. వాళ్ళంతా నెమ్మది నెమ్మదిగా, గ్రూప్ దగ్గరకు రాసాగారు. మొత్తం గ్రూప్‌లో మయూర ఒక్క చీర కట్టుకుని వుంది. మిగిలిన అందరూ పేంట్స్‌లోనే వున్నారు. ఆడవాళ్ళు మయూరనూ మిగిలినవాళ్ళనూ కుతూహలంగా చూడసాగారు. మోకాళ్ళకు పైగాకట్టుకొన్న ముతక నేతచీరలు చిన్న పిల్లలకు తప్ప పెద్దవాళ్ళకు ఎవరికీ రవికలులేవు. తలలు రేగి వున్నాయి.

మమత కాస్త చొరవగా ముందుకొచ్చింది. వాళ్ళతో మాట్లాడదామని పేట్స్‌లో వున్న మమతను జూసి, ఆడ వాళ్ళు వెనక్కు తగ్గారు. వాళ్ళలో ఒక పెద్దావిడ గుండెల మీద చేతులుంచుకొని సైగ చేస్తూ "మీరు ఆడవాళ్ళేనా!" అని అడిగింది సైగలతోనే! అంతా ఒకసారి నవ్వేసారు. ఆడ వాళ్ళు పైకోట్లు విప్పేసారు. మళ్ళీ నవ్వులు. వాతావరణం ఒక్కసారిగా ఆహ్లాదకరంగా మారిపోయింది. "మేము స్నానాలు చేస్తాం!" అన్నారు ప్రతాప్, హేమంత్‌లు, మాష్టారు కొండ కొమ్ము మీద నుంచి పడుతున్న నీటిధార చూపించారు. యువతీ యువకులు ఉత్సాహంతో చిందులు

వేసారు. వాళ్ళందరి దగ్గర రెండేసి జతల బట్టలు మాత్రమే ఉన్నాయి. వీలైనచోటల్లా ఒక జతవుతికి ఆరేసు కొంటారు. ఒకటి కట్టుకుంటారు.

పెద్ద పెద్ద లుంగీలు చుట్టుకుని అందరూ నీటిధారల క్రిందకు పరుగుతీసారు, సామానంతా మాస్టారి యింట్లో పడేసి. మయూర మాత్రమే అలా పరుగు తీయలేకపోయింది. కానీ, అంతలో తల సంకోచానికి తనమీద తనకే చికాకు కలిగింది. ఎంత స్వచ్ఛంగా ఉన్నారు ఈ యువతీ యువకులు. ఒక్కరి ముఖంలో నయినా వంకర చూపులున్నాయా? ఒక్కరయినా, మరొకరి వైపు దొంగచూపులు చూస్తున్నారా? అప్పుడే ప్రకృతి ఒళ్ళో కళ్ళు తెరిచిన పసిబిడ్డల్లా ఉన్నారు. వాళ్ళంతా...ఛీ తన కెందుకీ సంకోచం? కట్టుకున్న చీరతోనే తనూ నీటి ధారలకిందకు నడిచింది మయూర. మయూర అంతకుముందు రాలేదని కానీ, అప్పుడు వచ్చిందని కాని ఎవరూ పట్టించుకోలేదు.

ఎండలో నడిచి నడిచి వచ్చి ఎలాగో సాయంత్రానికి గమ్యం చేరుకొన్న అలసటతో వారంతా ఆ నీటి చల్లదనాన్ని హాయిగా అనుభవిస్తున్నారు. మగపిల్లలంతా ఒకవైపుకీ... ఆడపిల్లలంతా మరోవైపుకీ చేరి స్నానాలు చేస్తున్నారు. ఆ నీటి ధారలు తలమీద పడి చల్లగా తలను తడుపుతూంటే, తన అనారోగ్యమూ, అలసట అంతా మాయమైనట్లు అనిపించింది మయూరకు. పడమట దూరంగా ఏ కొండ చాటునో సూర్యుడస్త మిస్తున్నాడు. ఆ అరుణ రాగాలు ప్రకృతి అంతటా అలముకొంటూ ప్రకృతికే గిలిగింతలు పెడుతున్నాయి. తీవ్రమైన ఎండ తరువాత ఆ చల్లదనం ప్రకృతి

సమన్నయానికి ప్రత్యక్ష సాక్ష్యంలా చాలా హాయిగావుంది. ఏ కుత్సితాలూ లేకుండా ఉత్సాహంతో ఉరకలు వేస్తూ కర్తవ్య దీక్షతో ముందడుగు వేస్తున్న ఆ యువతీ యువకులు ప్రకృతి సంతానంలాగా వున్నారు. ఆ చన్నీటి ధారల్లో హాయిగా తడుస్తూనే ఆ యువతీ యువకులను చూడసాగింది మయూర వాళ్ళు స్నానాలు చేస్తూనే గోలగోలగా తమ కార్యక్రమం ఎలా అమలు పరచాలో చర్చించుకోసాగారు. ఎంత అందమైన జీవితం చూస్తోంది తను! అంతకు ముందు తను తిండీ, నిద్రాకూడా మానేసి ఎంతో ఆసక్తితో చదివిన నవలలూ, వాటిలో జీవితమూ గుర్తొచ్చాయి అబ్బాయీ-అమ్మాయీ ప్రేమించుకోవడమూ, పెళ్ళయ్యాకనో, కాక ముందో అపార్థాలు రావటం— భర్త భార్యను అనుమానించటం— భార్య తాను నిర్దోషినని నిరూపించుకోవటం. అటుతిరిగి ఇటు తిరిగి కొద్ది భేదాలతో ఇలాంటి నవలలే చదివింది అన్నీ. ఎంతో ఆసక్తితో చదివింది. కానీ విస్తృతంగా పరుచుకొన్న ఈనాటి జీవితానికీ, ఆ నవలలకూ ఏమైనా సంబంధముందా? ఇంత అందమయిన, ఇంత స్వచ్ఛమైన జీవితం ఏ నవలలో నైనా తాను చూడగలిగిందా? ఈ యువతీ యువకులంతా ముందుకు అడుగులేస్తూ నడుస్తోన్న నవతరం మనుష్యులు! రచయిత్రులూ, రచయితలూ అందరూ ఈ కాలంలోనే వున్నా మానసికంగా ఓ శతాబ్దం వెనుక జీవిస్తున్నవారు! అందుకే ఆ నవలల నిండా రూళ్ళకర్ర సిద్ధాంతాలు! యాంత్రికమైన నీతి సూత్రాలు! అగ్రహీనమైన పలికిమాలిన త్యాగాలు!

స్నానాలు ముగించుకొని మిగిలిన వాళ్ళందరూ ధారల క్రిందనుంచి బయటికి వచ్చాక తనూ వచ్చింది మయూర.

ఒళ్ళు తుడుచుకో నక్కర్లేకుండానే ఉధృతంగా వీచే అడవి గాలికి ఆరిపోయింది శరీరం.

మొగపిల్లలు క్షణాలలో రెండు గుడారాలు సిద్ధం చేసేసారు! అక్కడున్న గుడిసెలకంటే బాగున్నాయి ఆ గుడారాలు! నేలమీదకు కూడా గుడ్డ పరచుకుని క్రిమికీట కాలకారినుంచి రక్షణ ఏర్పాటు వుంది. ఆ గుడారాలలో. రెండు గుడారాలు ఏర్పాటు చేస్తున్నప్పుడు మొగపిల్లలంతా ఒకదానిలో, ఆడపిల్లలంతా మరొకదానిలో ఉంటారని అనుకుంది మయూర. కానీ, వాళ్ళంతా ఎవరి యిష్టం వచ్చినట్లు వాళ్ళు ఒకచోట చేరటం చూసి "ఛీ! ఛీ! నాకే అన్నీ సంకుచిత భావాలు! చదువుకున్న అమ్మలక్కల మధ్య నుంచి వచ్చి కాంతివంతమయిన, ఈ నూతన జగత్తును హాయిగా చూడలేక పోతున్నాను. చదువుతోపాటు సంస్కారం వున్న వ్యక్తులు వీళ్ళు. శరీరాలతో పాటు మనసులు కూడా ఎదిగిన వ్యక్తులు వీళ్ళు!

స్త్రీ పురుష సంబంధాలకు మించిన ఎంతో అందమైన జీవితం వుందని అర్థం చేసుకొని ఆచరణలో చూపుతున్న ఈ తరం వ్యక్తులు వీళ్ళు" అనుకొంది. మాస్టారువచ్చి బయట విలబడి "మీ గుడారాలలో నేను ప్రవేశించలేను, బయటకు రండి." అన్నారు-అందరూ వంగి బయటకు వచ్చారు. చెట్టు క్రింద వున్న సిమెంట్ అరుగును చూపిస్తూ "అదే నా బడి. అక్కడ కూర్చుందాం రండి." అన్నారు మాస్టారు-అంతా అక్కడ చేరారు. వింత వింత అడవి వాసనలతో చల్లగా వీస్తోంది గాలి!

"ఇదా బడి!" అన్నాడు ఉదయ్.

"పోదోయ్! కొత్తగా అడుగుతున్నావ్! ఇవన్నీ మనకి పాత కథలేగా!" అన్నాడు హేమంత్ విసుగ్గా.

"కొత్తకథ అసలు మొదలుకాదా అని" కష్టంగా అన్నాడు ప్రతాప్...

మాస్టారునవ్వి "మీరువచ్చారుగా కొత్తకథ మొదలు పెట్టండి!" అన్నారు. తరువాత "మీరు తెచ్చిన లిటరేచర్ చూసాను. చాలా బాగుంది. అలాంటి బుక్స్ తయారుచేయ టానికి మీ ప్రభాకరరావు సార్ చాలా శ్రమపడి వుండాలి! పైకి చిన్న పిల్లలకూ, చదువురానివాళ్ళకూ బోధించే వాచక పుస్తకాలలాగా వుంటూనే దాంట్లో విలువైన సమాచారం ఎంతో పొందు పరిచారు. ఇలాంటి మారుమూల గ్రామా లలో వున్న జనాలకు ప్రస్తుత సాంఘిక, రాజకీయ సమగ్ర స్వరూపం అర్థం కావటానికి ఎంతో వుపయోగపడతాయి ఆ పుస్తకాలు. కానీ మీ క్యాంప్ ఒక నెల రోజులంటున్నారు. నెలలో మీ రెంతవరకు చెప్పగలరు?" అన్నాడు.

మాస్టారి మాటలతో యువక బృందానికి వుత్సాహం వచ్చింది. మాస్టారిలాంటి వ్యక్తుల సహకారం అన్నిగ్రామా లలోనూ లభించదు. అనేక గ్రామాలలో బడి వుంటే, మాస్టారుండడు, మాస్టారుంటే బడివుండదు- మాస్టారూ, బడీ వున్నా చదువుకునే వాళ్ళు అసలు వుండరు. అంచేత మాస్టారి వ్యక్తిత్వమూ, ఆయన మాటలూ వాళ్ళకు మరింత వుత్సాహాన్ని కలిగించింది.

ఉదయ్ తమ ప్రణాళిక వివరించాడు.

"ఈ పుస్తకాలు కేవలం గైడ్ లైన్స్‌గా మాత్రమే వుంచుకొంటాము. సాధ్యమయినంత వరకు చదువులాగా

కాక బొమ్మలు చూపిస్తూ కథలు చెపుతున్నట్లు విషయం వివరించాటానికి ప్రయత్నిస్తాము. మా ప్రధానోద్దేశం మేం చెప్పదలచుకున్న విషయాలు, అందరికీ అర్థం కావాలి! చదువు చెప్పటం ప్రధానం కాదు. విషయం తెలియటం ప్రధానం. ఒక్కొక్క చోట నెలకంటే ఎక్కువ వుంటే ఏం చెయ్యగలం సార్? మేం ప్రారంభించింది మీ బోటివాళ్ళు మరింత పెంపొందించాలి!" గడుసుగా అన్నాడు ప్రతాప్.

మాస్టారు నవ్వారు. మాస్టారిని చూసి నిర్భయంగా కొండజనులు కూడా-ముఖ్యంగా మొగవాళ్ళు చాలామంది వచ్చి చేరారు. వాళ్ళలో కొందరికి యాసగా తెలుగుమాట్లాడటం వచ్చు. మాస్టారు అటు వాళ్ళకీ, ఇటు యువక బృందానికి దుబాసీగా వ్యవహరించారు.

నవనాగరీకంగా వున్న ఆ యువతీ యువకులు తమ మధ్యకు ఎందుకు వచ్చారో మాస్టారిద్వారా తెలుసుకున్నాక కొండ జనులకు ఆ యువక బృందంపట్ల ఆదరభావమే కలిగింది.

మాస్టారు "పాపం, వీళ్ళు మిమ్మల్ని చూసి బెదిరిపోవటంలో ఆశ్చర్యం ఏంలేదు. ఇంతవరకూ, వీళ్ళఅనుభవాలన్నీ అలాండివే మరి? బయటనుంచి వచ్చిన వాళ్ళు వీళ్ళ భూములు లాక్కుని వీళ్ళను కూలీలుగా వుపయోగించుకుని వెడిపించిన వాళ్ళే తప్ప స్నేహితులుగా వచ్చేవాళ్ళు చాలా అరుదైపోయారు. అంచేతనే వీళ్ళు ఎవరినీ నమ్మలేకపోతున్నారు" అన్నారు.

యువక బృందం తమ భుజాలపై వేసుకొన్న కార్యభారం రెండువిధాలుగా వుంది.

ఒకటి; అక్కడివారిని ప్రభాకరరావు సార్ రూపొందించిన లిటరేచర్ సహాయంతో చైతన్యవంతం చేయటం. రెండు అక్కడే జనుల జీవిత విధానాన్ని గురించీ వారి ఆలోచనా సరళిని గురించీ వారు ఎదుర్కొంటున్న సమస్యల గురించీ రిపోర్టు తయారుచేసి ప్రభాకరరావు సార్ కియ్యటం.

ఆ రోజే పాఠం ప్రారంభించారు. అందమైన చార్టులు తయారుచేసి, అవి చూపిస్తూ కథలలాగ విషయాలు వివరిస్తోంటే చాలామంది వచ్చి కూర్చున్నారు. మాస్టారి కృషి వల్ల అంతకుముందే అక్కడివారిలో చదువుపట్ల కొంతఆసక్తి కలిగిందని అర్థం చేసుకున్నారు యువకబృందం.

ఆ కార్యక్రమం పూర్తయ్యాక స్టౌ వెలిగించబోతుంటే మాస్టారు అడ్డుపడి "మీ రిక్కడకు వచ్చి మీ యిన్స్టెంట్ కాఫీలూ, టిన్స్ఫుడ్స్ తినటం కాదు. వీళ్ళతో కలిసి వీళ్ళేం తింటారో అది తినండి. అప్పుడుకాని వీళ్ళ జీవితం ఏమిటో మీకు పూర్తిగా అర్థంకాదు" అన్నారు. యువతీ యువకులు సంతోషంగా అందుకు ఒప్పుకున్నారు. వాళ్ళకు వరుచే విచారం కలిగించింది ఒకటే అంశం. ఒక్కొక్కరొ ఒక్కొక్క కుటుంబానికి అతిథి కావలసి వచ్చింది. ఆ కారణంచేత అందరూ కలిసి అల్లరి చేసుకుంటూ సరదాగా భోజనం చేసే అవకాశం తప్పిపోయింది. కానీ వారి ఆచారంవ్యవహారాలు మరింత సన్నిహితంగా పరిశీలించే అవకాశం వచ్చిందికదాఅని సంతృప్తి పడ్డారు. మయూర ఇల్లు

కొంత శుభ్రంగానే వుంది. ఆపిరిగడ్డితో నేసిన గుడిసె. ఈతాకుల చాపలు చుట్టలు చుట్టి వున్నాయి. గదులుగా విభజన ఏమీ లేదు. అక్కడే ఒకవారగా వండి అక్కడే తింటారు. అక్కడే పడుకుంటారు, లేకపోతే ఆరుబయట పడుకుంటారు. వంటపాత్రలు చాలావరకు కుండలే! కొన్ని అల్యూమినియం గిన్నె లున్నాయి. అల్యూమినియం కంచాలున్నాయి. అక్కడ ఆహారం తీసుకోవాలంటే, అనుకోకుండా మనసులో ఏదో కంపరం కలిగింది. అంతలోనే తన సంకుచితత్వానికి తానే సిగ్గుపడి, సాధ్యమయినంతవరకూ ఆ కుటుంబంలో ఒక వ్యక్తిలాగా కలిసి పోవడానికి సిద్ధపడింది. వంటిమీద బట్టలు లేకుండా ఆడుతున్న చిన్నపిల్లలను దగ్గరకు తీసి వాళ్ళకు బట్టలు తొడగాలని చూసింది! అసలు బట్టలే లేవని తెలుసుకుని నిర్ఘాంతపోయింది.

ఆ ఇంటి గృహిణి ఒక తామరాకులో ఏదో పిండితో చేసిన రొట్టె, అల్యూమినియం గిన్నెలో పులుసు పెట్టింది. ఆ పదార్థాలను తినలేకపోయింది మయూర. రుచీ పచీ లేదు. ఏదో ఆహారం అంతే! ఆ ఇల్లాలు మాత్రం సంకోచమనేది లేకుండా ఏడాది నిండిన బిడ్డకు స్తన్యమిస్తూ ఎదురుగా కూచుని నవ్వుతోంది!

మయూరకు మనసంతా కలచినట్లయింది. ఇంతవరకూ తానేదో కష్టపడ్డాననుకొంది. అసలు కష్టమంటే ఏమిటి? పసిబిడ్డకు తొడగడానికి బట్టలైనా లేకుండా ఇలాటి తిండి తింటూ సంతృప్తిగా నవ్వుతోంది ఆ ఇల్లాలు! అంత హాయిగా నవ్వుతోన్న ఆ అమాయకురాలికి తన అనుభవంలోకి రాని జీవితం ఎంత ఉందో తెలుసునా?

అతి ప్రయాసత్నంమీద ఆ పులుసుతో రొట్టె తిని బయటపడింది మయూర. అప్పటికే మిత్రబృందమంతా ఒక చోట గుమిగూడారు మయూర వాళ్ళ మధ్యకు వచ్చి కూచుంది.

"యెక్సలెంట్ ఫుడ్. న్యూట్రిషస్ డెలిషస్ ... చాలా బాగుంది!" బొజ్జ నిమురుకుంటూ అంటున్నాడు హేమంత్.

"అవునవును! ఇంకా ఆ రుచి గొంతులోనే వుంది."

"హాయ్! హాయ్! మరో ఇరవై తొమ్మిది రోజులు మన మహాభాగ్యం!"

ఒకరితో ఒకరు పోటీలు పడుతూ తాము తిన్న ఆహారాన్ని పొగుడుకుంటూన్న ఆ యువతీ యువకులను చూసి తెల్లబోయింది మయూర. "మీరు తిన్నచోట ఆహారం బాగుందా? నేను తిన్నచోట ఏం బాగోలేదు. ఎలాగో తిన్నాను" అంది.

మయూర మాటలకు వాళ్ళంతా మయూర ముఖంలోకి హేళనగా చూశారు. తరువాత ఒకరి ముఖాలు మరొకరు చూసుకున్నారు. ఒక్కసారిగా విరగబడి నవ్వేసారు. మయూరకు అగ్రమయింది. సిగ్గుతో ముఖం ఎర్రబడగా తల దించుకుంది. "అలా తల దించుకోవటం కాదు. ఇప్పుడు చెప్పండి. మీరు తిన్న తిండి ఎలా ఉందో!" నవ్వుతూనే అన్నాడు ఉదయ్.

మయూర తల ఎత్తి "చాలా బాగుంది!" అంది.

అందరూ మరోసారి నవ్వుకున్నారు.

నెలరోజులు చకచక గడిచిపోయాయి. నాయంత్రం పూట బోధనా కార్యక్రమం సాగేది. పగటివేళ వారి జీవన సరళిని గురించి రిపోర్ట్సు తయారు చేయటానికి వివరాలు సేకరించేవారు. దగ్గర దగ్గర అడవి ప్రాంతాలలో తిరిగేవారు. ఎండవేళల తప్ప తాగి పడుకునే మొగవాళ్ళనీ, ఆడవాళ్ళనీ చూసి లోలోపల బాధపడేవారు. మాస్టారు మాత్రం అందులో పెద్ద బాధ పడవలసింది లేదనీ, ఆ అడవులలో బతికే వాళ్ళకి అదే ఆరోగ్యమని చెప్పేవారు.

అనుభవం లేకపోవడంవల్ల మయూర పాఠాలు చెప్పలేకపోయేది. చెప్తోంటే తను వింటూ కూచునేది! పాఠాలు చెప్తున్నట్లుగా వాళ్ళు ఎన్నెన్ని విషయాలు చెప్తున్నారో చూసి విస్తుపోయేది. మెచ్చుకొనేది. రిపోర్ట్సు తయారు చెయ్యటంలో మాత్రం సహాయపడేది.

చదువు చెప్పటం అయిపోయాక, మాస్టారూ యువతీ యువకులూ కూచుని అనేక విషయాలు చర్చించుకొనేవారు.

మాస్టారు నవ్వుతూ "మీరు చదువుచెప్పే విధానం చూస్తోంటే, మీరు కేవలం విద్యావ్యాప్తికి వచ్చినట్లు లేదు" అన్నారు.

"కాదని చెప్పాం కదండీ! అలా అని మేం సాయుధ పోరాటాన్ని బలపరచటం లేదు. మా ప్రభాకరరావు సార్ ఫిలాసఫీ సంగ్రహంగా చెప్తాం వినండి. ప్రస్తుతం సాయుధ విప్లవానికి మనదేశంలో వెనుకబడ్డ ప్రాంతాలు సాంఘికంగానూ, వైజ్ఞానికంగానూ కూడా సిద్ధంగా లేవు. వారిని వెర్రి ఆవేశంతో ఉరకలెత్తించడం కాదు మనం చెయ్యవల

సింది. అలా చెయ్యటంవల్ల ఫలితం లేదని అనుభవపూర్వకంగా రుజువయింది. అంచేత ముందు పీడిత ప్రజానీకానికి తమ స్థితి ఏమిటో తాము తెలుసుకోనే వివేకం కలిగించాలి. ఆలోచించే చైతన్యం రగిలించాలి!"

"ఇదే క్రమంగా సాయుధ పోరాటానికి దారితీయవచ్చు కదా?"

"చెప్పలేం! మా కార్యక్రమాలు రహస్యంగా సాగుతున్నవి కావుకదా? అంచేత జాతి చైతన్యవంతమయి బహిరంగంగా ప్రజాస్వామ్య పద్ధతులలోనే స్వార్థపరులనూ, అవినీతినీఎదుర్కొని విజయం సాధించవచ్చు. లేదా సాయుధ పోరాటమే అనివార్యమయినా కావచ్చు. ఏది యేమయినా నియంతృత్వ విధానానికి అది ఏ విధమయినదయినా సరే!—మేమంతా వ్యతిరేకులమే!

ఆ సంభాషణలన్నీ వింటుంటే, మయూరకు మరో కొత్త ప్రపంచంలోకి అడుగు పెట్టినట్లుగా వుండేది. విచిత్రంగా మయూర అనారోగ్యం ఎక్కడికి దక్కడ ఎగిరిపోయింది. ఏదో చెయ్యాలనే ఆరాటమూ, ఎంతో కొంత చెయ్యగలుగుతున్నానన్న తృప్తి మయూర మనసుకు కొత్త బలాన్ని తెచ్చిపెట్టాయి.

నెలరోజులు గడిచిపోయాయి. మిత్ర బృందమంతా తిరుగుప్రయాణ మయ్యారు. కొండ జనులందరూ యెంతో స్నేహంతో వీడ్కోలుచెప్పారు. ఏవేవో పూసలూ, గవ్వలూ మొదలైనవి వాళ్లు బహుమానంగ యిచ్చారు. బిస్కట్ పకెట్స్- -స్వీట్స్పేకెట్స్ వీళ్ళు బహుమానంగాఇచ్చారు.

సంచులు భుజాలకు తగిలించుకుని ప్రయాణమయ్యారు. తిరుగు ప్రయాణంలో సంచులు చాలా తేలిగ్గానే వున్నాయి. అంతకంటే తేలిగ్గా వున్నాయి వాళ్ళ మనసులు. నెలరోజులుగా ఇళ్ళను వదిలిపెట్టిన వాళ్ళంతా తిరుగు ప్రయాణంలో ఇంటిని గురించీ, తలిదండ్రుల గురించీ, అక్కచెల్లెళ్ళ గురించీ అన్నదమ్ముల గురించీ ఎక్కువగా మాట్లాడుకో సాగారు. ఎప్పుడు ఇంటికి చేరుకుందామా అనే ఆరాటం అందరిలోనూ కనిపిస్తోంది. వాళ్ళలో మయూర ఒక్కతే ఏమీ మాట్లాడడంలేదు. ఆ విషయం గమనించింది మమత.

"మయూరా! మీరెక్కడికి వెళ్ళాలి?" అని అడిగింది. నడుస్తున్న మయూర నిలబడిపోయింది. ఏ సమాధానమూ రాలేదు. తేజస్వి వచ్చి మయూర భుజంమీద చెయ్యివేసి "మీకు యెక్కడికి వెళ్లాలని వుందో చెప్పండి- అక్కడ దింపి వెళ్తాం" అంది.

అప్పటికి మయూర కదిలి "యతి దగ్గరకి వెళ్తాను" అంది.

"యతి ఎవరూ?" అని అడిగాడు ఉదయ్.

"యతి...యతీంద్ర"

"ఓ! నెంబర్ టూ గ్రూప్‌లీడర్ యతీంద్ర కావచ్చు. అంతేనా? ప్రభాకర్ సార్ ఇంట్లో వుంటాడు- అతనేకదూ?"

"అవునవును!"

"అయితే మమ్మల్ని ప్రభాకర్‌సార్ యింట్లో దింపాలన్నమాట! మేము ముందుగా అక్కడకే వెళ్తాం!"

"కాదు! కాదు!"

"ఏమిటండీ? సరిగ్గా చెప్పండి ?"

"నేను ప్రభాకరరావుగారి యింటికి రాను. యతి ఇప్పుడక్కడ లేడు?"

"మీకెలా తెలుసు?"

మయూర మాట్లాడలేదు.

"యతీంద్ర ఇప్పుడెక్కడున్నాడో ఎలా తెలుసుకో వటం?"

ఏం చెప్పగలదు మయూర?

తేజస్వి ఆలోచించి "సరే! మీరు నాతో రండి? తరువాత చూసుకుందాం !" అంది. మయూర సంతోషంగా ఒప్పుకుంది.

# 23

రాష్ట్రంలో అనేక మార్పులొచ్చాయి. వెంకటయ్య మంత్రి కావటం అందులో ముఖ్యమైనది - అపోజిషన్‌లో వెంకటయ్యలాంటి ప్రముఖుడు వుండడం ముఖ్యమంత్రికి కత్తిమీదసాములా తయారయింది. ఎక్కడెక్కడి లోపాలూ కెలికి కెలికి బయటకు తీస్తున్నాడు. ఆ తరువాత ఆందోళనల పేరిట నానా అల్లరీ చేస్తున్నాడు. అతనితో పంతం పెంచుకోవటం కంటే తనవైపు తిప్పుకోవటమే మేలనిపించింది ముఖ్యమంత్రికి. వెంటనే మంతనాలు సాగినాయి.

వెంకటయ్య పార్టీ మారాడు. మంత్రికూడా అయిపోయాడు. అతని చిరకాల వాంఛితం నెరవేరింది.

మిసెస్ జ్వాలాకుమారి ప్రభుత్వానికి అనుబంధంగా ఏదో స్త్రీలకు సంబంధించిన శాఖకు చైర్మన్ అయింది. ఆవిడ ఆ పదవిని ఎలా సంపాదించిందీ అనేదానిపైన రకరకాల వార్తలు ప్రచారంలో వున్నాయి. ప్రస్తుతం స్త్రీలకు సంబంధించిన కొన్ని కొన్ని సంస్థలకు గ్రాంట్లు శాంక్షన్ చేసే అధికారం ఆవిడచేతుల్లో వుంది. ఆవిడ హుందాగాకుర్చీలో కూచుని, చుట్టూ ఒక పదిమంది గ్రాంటుకోసం చేతులు నలుపుకొంటూ నిరీక్షిస్తూవుండగా తన అధికారాన్ని అన్ని విధాలా 'సద్వినియోగం' చేసుకొంటూంది. తన పాతకారు అమ్మేసి కొత్త అంబాసిడర్ కొనుక్కుంది. కొడుకుపేర ఒక మేడ కట్టించింది. సొంతవూళ్ళో ఆస్తులు అమ్మి కట్టించానని చెప్పుకొంటుంది. అనేక మహిళా సంస్థలు ఆవిడను కాశ్మీరు శాలువాలతో సన్మానించాయి. ఆ సన్మానాలన్నీ తన సంఘసేవకూ, అభ్యుదయ దృక్పథానికి అని చాటుకొంటుంది ఆవిడ-"జ్వాలాకుమారా? ఆవిడను తలచుకోగానే "ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!" అనే సుమతీ శతకంలో పద్యం గుర్తుకొస్తుంది" అనేవాళ్ళ సంఖ్య తక్కువ లేదు. అయితేనేం? అనేక కారణాలవల్ల ఆవిడచుట్టూ తిరుగుతూ, ఆవిడ గొప్ప సంఘ సేవకురాలని ప్రచారం చేసే వాళ్ళు చాలామందే వున్నారు.

వెంకటయ్య పార్టీ మారాడనీ, మంత్రి అయ్యాడనీ తెలిసిన క్షణం నిర్ఘాంతపోయాడు యతి. ప్రభాకర్ ప్రబోధా

లలోని చేదు నిజాలన్నీ ప్రత్యక్షంగా ఎదుట నిలిచినట్లయింది. ఛీ! ఈ స్వార్థపరుడి మాయాజాలంలో పడి బంగారంలాంటి జీవితంలో ఎంత కాలం వ్యర్థంచేసుకున్నాడు? ఎన్ని జీవితాలు ఈ స్వార్థపరుడి సోపానాలుగా మారటానికి కారకుడయ్యాడు? ఈ దుర్మార్గులు మంత్రిపదవి అధిష్టించి బొజ్జ పెంచుకుంటూ కూచున్నాడు. ఇతని ఆదేశాలు పాటించి రామదండులో చేరి ఆందోళనలలో పాల్గొన్న విద్యార్థులు ఇంకా జైళ్ళలోనే మగ్గుతున్నారు! కనీసం వాళ్ళని విడిపించాలనే ఆలోచన అయినా రాలేదు ఆ దేశోద్ధారకుడికి! యతి మనసు మరిగి పోసాగింది. వెంకటయ్యతో మాట్లాడటానికి ప్రయత్నించాడు. కానీ అతనికి వెంకటయ్యతో ఇంటర్వ్యూ దొరక లేదు.

"ప్రభాకర్‌తో చేతులు కలిపిన ఉగ్రవాదులతో నాకు సంబంధాలు లేవు" అని వెంకటయ్య అన్నట్లు అతని కెవరో చెప్పారు. "ఉగ్రవాదులా" అంటే? యతి వుడికిపో యాడు. అతడు నిజంగా ఉగ్రమూర్తి అయిపోయాడు. "రామ దండు" అనే పేరుతో మొదటినుంచీ అన్ని వివరాలూ పత్రికాముఖంగా ప్రపంచానికి తెలియ జెయ్యాలనుకున్నాడు. ఒక మంత్రిగారికి వ్యతిరేకంగా జరిగే ఈ ప్రచారానికి పబ్లి సిటీ ఇవ్వటానికి చాలా పత్రికలు ముందుకు రాలేదు. ఎంతటి రిస్క్‌కైనా సిద్ధపడి ఇలాంటి విషయాలు బహిరంగం చేయ

టమే ధ్యేయంగా పెట్టుకొన్న ఒక పక్షపత్రిక ఆ వివరాలు ప్రచురించటానికి ముందుకు వచ్చింది. "రామదండు" శీర్షికలో ధారావాహికంగా వ్యాసాలు రాసాగాయి. జనం విరగబడి చదవసాగారు. వెంకటయ్య తనను కలుసుకోమని యతికి కబురు చేసాడు. "నేను ఉగ్రవాదిని. అధికార కాంక్షతో రంగులు మార్చేసే ఊసరవెల్లులతో నేను మాట్లాడను." అని సమాధానం పంపించాడు యతి.

తనపై రేగుతోన్న ఈ దుమారానికి హడిలిపోయాడు వెంకటయ్య. అతడు అత్యంత చతురుడైన రాజకీయవేత్త. తాను అంతకాలంగా నిర్లక్ష్యం చేసిన జైళ్ళలో మగ్గుతోన్న రామదండులోని విద్యార్థులను విడుదల చేయించాడు. "రాజకీయ బాధితులు"గా ముద్రవేయించి అందరికీ వారి వారి అర్హతలకు తగిన ఉద్యోగా లిప్పించేసాడు. ఖనూరుమనిపోయాడు యతి! ఏమిటి జాతి! ఒక బొమికముక్క పడేయగానే తోకాడించుకుంటూ కుక్కల్లా అయిపోతారు. వెంకటయ్య ఉద్యోగా లిప్పించగానే, అప్పటివరకూ అతడు తమకూ, దేశానికీ చేసిన అపచారం మరిచిపోయారు. ఉద్యోగాల కుర్చీలలో కూచుని పూర్తిగా యంత్రాలయిపోయారు. అంతే! ఎవరైనా తాత్కాలిక ప్రయోజనమే ఆశిస్తున్నారు. ఎలా బాగుపడుతుంది ఈ జాతి?

"రామదండు"లో ఆ తరువాతి వ్యాసం వ్రాయాలని కాగితాలు ముందు వేసుకు కూచున్నాడు యతి.

తేజస్వి, మమత, హేమంత్, ప్రతాప్ మొదలైన వాళ్ళంతా వచ్చేసరికి, "హలో!" అంటూ లేచిన యతి అలాగే నిబలడిపోయాడు. వాళ్ళలో మయూరకూడా వుంది. "హాయ్ యతీ! ఏమిటలా నిలబడిపోయావ్? వుండుండి ఎలా మాయమైపోయావ్? చచ్చామనుకో! నీ అడ్రస్ కనుక్కో-లేక! నీ "రామదండు" వ్యాసాల కారణంగా వెతుక్కొంటూ రాగలిగాం! భలేదులిపేస్తున్నావులే! బైదిబై! ఈ మయూర సంగతేమిటి? "నీ కెవరున్నారు?" అంటే "యతి-యతీంద్ర" అని చెప్పింది. అనుకోకుండా లక్కీగా మాకు కలిసింది. సో మీట్ యువర్ మయూరా"

గడగడ మాట్లాడేస్తోంది మమత. మయూర, యతి ఒకరి నొకరు చూసుకొంటూ అలాగే నిలబడిపోయారు— ఇద్దరిలో ఒక్కరు కూడా ఒక్కడుగు ముందుకు వెయ్యలేక పోయారు.

తేజస్వి యతిని చూసి "డు యు లొ హార్?" అని అడిగింది.

"యస్!" అన్నాడు యతి వెంటనే. మయూర దగ్గరగా వచ్చి మయూర చేతులు పట్టుకుని మంచంమీద కూచో బెట్టాడు. ఆ గదిలో కుర్చీ ఒక్కటే వుండడం వల్ల మిగిలిన అందరూ ఆ మంచం మీదే కూచున్నారు.

"నీ వంట్లో ఎలావుంది మయూరా? ఇంట్లోంచి ఎలా వచ్చేశావు? ఎంతరిస్క్" అన్నాడు యతి...

"నిన్ను శంకించేసి వేణు నా మీద దెబ్బతీశానను

కున్నాడు. అతనికి ఆ ఛాన్స్ ఇవ్వలేదు. ఎంత రిస్క్ అయినా తీసుకోటానికి సిద్ధపడ్డాను. కానీ నిన్ను పంపేసి నను విడి పించగలిగాననే ఆనందం అతనికి దక్కనీయ కూడదను కున్నాను."

మయూర తమను ఎలా కలిసిందో, తమతో పాటు ఎలా పనిచేసిందో వివరంగా చెప్పింది తేజస్వి. చాలా ఆశ్చర్య పోయాడు యతి.

"అంత అనారోగ్యంలో..." అన్నాడు! అప్పటికీ తనను తను నమ్మించుకోలేక.

"చూడు నన్ను! ఆరోగ్యంగా లేనూ?" నవ్వుతూ అంది మయూర. నిజమే! మయూర ఇంకా సన్నగా బలహీ నంగానే వుంది. అయినా ఇదివరకులా, యంత్రంలా లేదు. ఆ ముఖంలోకి జీవకళ వచ్చింది. కళ్ళలోకి ఉత్సాహం వచ్చింది.

"వాట్ నెక్స్ట్?" అన్నాడు యతి బాధగా తలపట్టు కొంటూ. ఆ ప్రశ్న వినగానే మయూరముఖం పాలిపోయింది.

తేజస్వి కలిపించుకొని "అదేం ప్రశ్న? మీరిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకుంటున్నామని ఒప్పుకుంటున్నారు కదా? పెళ్ళి చేసుకోండి!" అంది.

"ఆవిడకు ఇదివరకే పెళ్ళయింది!" అన్నాడు యతి

మమత నిర్లక్ష్యంగా భుజాలు ఎగరేసి "అయితే ఏం? ఆ భర్తకు ఈవిడకు పడటంలేదని అర్థమవుతోంది కదా?

ఇష్టంలేని సంసారం చచ్చినట్లు ఎందుకు చెయ్యాలి? అతనికి విడాకులు ఇచ్చేస్తుంది. నిన్ను పెళ్ళి చేసుకుంటుందా?" అంది. అదేదో అత్యంత సామాన్యమైన విషయం అన్నట్లు.

"మీ కందరకు తెలియని విషయం ఒకటుంది. ఈవిడ మన ప్రభాకర్‌సార్ కోడలు!" అన్నాడు యతి.

గదంతా ఒక్క సారిగా నిశ్శబ్దమయిపోయి యెవరూ మాట్లాడలేక పోయారు. మయూర జాలిగా అందరినీ చూడ సాగింది. ఆ చూపులకు మనసు కరిగిపోయింది తేజస్వికి. అందరిలో ఆవిడే ఒక నిర్ణయానికి రాగలిగింది.

"మన కందరికీ ప్రభాకర్‌సార్ అంటే చాలా గౌరవం. ఆయన న్యాయబుద్ధిలోనూ, వివేకంలోనూ కూడా మనకంద రికీ విశ్వాసం వుంది. ఈ సమస్యను ఇలా రహస్యంగా వుంచి ప్రయోజనం లేదు. సమస్యను ప్రభాకరరావు సార్ ముందే వుంచుదాం?"

మయూర, యతి ఒకరి నొకరు చూసుకున్నారు.

"నాకు అభ్యంతరం లేదు" అన్నాడు యతి. ఊపిరి బిగబట్టి తలవూపింది మయూర.

# 24

వంటింటిలో కూరలు తరుగుతోంది కమల. అడుగుల చప్పుడు విని తలెత్తింది. ప్రభాకర్ వచ్చాడు. ఇంచుమించు

రోజూ అడుగుతున్న ప్రశ్న అలవాటుగా అడిగింది- "యతి వచ్చాడా?" ప్రభాకర్ నవ్వాడు. ఆ నవ్వు, ఆ ముఖమూ కూడా వింతగా తోచాయి కమలకి. చిన్నప్పుడు హరిశ్చంద్ర నాటకంలో చూసిన కాటికాపరి హరిశ్చంద్ర ముఖం గుర్తొచ్చింది.

"అలా వున్నారేం? యతి యింకా కనపడలేదా?"

"మనింటికే వచ్చాడు!"

"ఆ! వచ్చాడా!" తరుగుతున్న కూరలు అక్కడే పడేసి లేచి నిలబడింది కమల, సంభ్రమంగా "యేమిటో ఉన్నది కొంచెం రోజులే అయినా, సొంతబిడ్డలాగా అలవాటు పడిపోయాడు బెంగపడిపోయాను. నిన్న కల్లోకికూడావచ్చాడు. "అమ్మా!" అని పిలిచినట్లే అనిపించింది. పదండి చూద్దాం! ఎవరో పరాయి మనిషిలా బయట నిలబడటం దేనికి? లోపలికి రాకూడదూ?" అని బయలుదేరబోయింది.

ప్రభాకర్ కమల భుజాలు పట్టుకొని ఆపుచేసాడు. "కొంచెం ఆగు వెళ్దువుగాని, అతడొక్కడే కాదు, వచ్చింది మన మయూరకూడా అతనితో వుంది!" అన్నాడు.

అతడు మాట్లాడుతున్న దేమిటో అర్థంకాని దానిలా కొంచెంసేపు పిచ్చి చూపులు చూసింది కమల. అంతలో పాలిపోయిన ముఖంలోకి జీవం తెచ్చుకొంటూ "ఓహో! యతి మన మయూరను వెదికి తీసుకొచ్చాడా? బంగారు తండ్రి!

పాపం! మనకోసం ఎంత శ్రమైనా పడతాడు. ఎలా వుంది మయూర? ఎక్కడా దొరకలేదన్నారు? పాపం వాళ్ళ తల్లి దండ్రులు ఎంత బాధపడ్డారో? ఏడ్చారో? మతిస్థిమితం లేకుండా వెళ్ళిపోయిందా? చూద్దాం పదండి! పసిపిల్ల ఏం అవస్థలు పడిందో?" అంటూ బయలుదేర బోతున్న కమలని మళ్ళీ భుజాలు పట్టుకున్నాడు.

"ఏమిటండీ? ఎందుకు నన్నిలా ఆపేస్తున్నారు? మీరెం దుకిలా అయిపోతున్నారు? ఏం జరిగింది?"

ప్రభాకర్ కి మాటలు రావటం కష్టమవుతోంది.

"కమలా! యతి, మయూర వచ్చారు. వాళ్ళు ... వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవాలను కొంటున్నారు" అనేశాడు. "ఆ!" అంది నిర్ఘాంతపోతూ కమల. అంతలో ఆమె కడుపు మంట శోకంగా మారింది.

"ఇదెక్కడి అన్యాయమండి! మీరు వాళ్ళకెంత చేసారు? దానికిదా ప్రతిఫలం? దాన్ని— ఆ చెడిపోయిన దాన్ని కొడుక్కిచ్చి పెళ్ళి చేసారు. మతీ మన్నూ లేకుండా పడివుంటే, మనిషిని చేసారు. వాడు ... పోలీసులు తరుము కొస్తుంటే, చావుబ్రతుకుల మధ్య ఇంటికొస్తే చావబోతున్న వాడికి ప్రాణం పోశారు. దోసిళ్ళతో డబ్బు గుమ్మరించి పోలీసుల బారినుంచి కాపాడారు. కన్నకొడుకులా చూసారు. అందుకు ఇదా ప్రతిఫలం! వాళ్ళని...వాళ్ళని ... యేడుస్తూ

శాపనార్థాలు అసబోతున్న కమల నోరు మూసేసాడు ప్రభాకర్.

"ఊరుకో! కమలా! కొంచెం ఆవేశం తగ్గించుకో? అర్థంచేసుకో! నేను మయూరకేం చేసాను? నా కొడుకు చేసిన అన్యాయానికి పరిహారం చెల్లించడానికి మాత్రమే ప్రయత్నించాను. యతి ప్రాణాలు కాపాడాను. పోలీసుల బారినుండీ కాపాడాను. రెండూనిజమే! కానీ అందుకు బదులుగా యతి నా కెంత చేసాడో నీకు చెప్పినా అర్థంకాదు. మనం పెళ్ళి చేసామేకాని, మయూర వేణు దంపతుల్లాగ ఒక్కనాడైనా జీవించలేదు. ఇకముందు జీవించరు. మయూర, యతి చిన్నతనంనుండే ప్రేమించుకొన్నారట! ఆ సంగతి నాకు తెలియదు. ఒక దుర్మార్గుడు పాడుచేసిన స్త్రీని, ఒకసారి పెళ్ళయినదాన్ని స్వీకరించటానికి సిద్ధకగా వున్నాడండే అతని మనసు యెంత ఉదాత్తమయినదో! ఆ ప్రేమ యెంత గాఢమైనదో ఊహించుకో! అయినా మన ఇంట్లో వున్నన్నిరోజులూ, ఆ ఇద్దరిలో ఏ ఒక్కరూ గాడితప్పి ప్రవర్తించలేదు. ఆ ఇద్దరికీ మనమీద వున్న గౌరవం అలాంటిది. ఇప్పుడయినా వాళ్ళు స్వతంత్రించి ఏం చెయ్యటంలేదు. నా దగ్గరకే వచ్చారు. సమస్యను నన్నే పరిష్కరించమని అడిగారు."

"హమ్మయ్య! అయితే యికనేం వాడిని ఆ చెంపా, ఈ చెంపా వాయగొట్టి పంపించేసి. దాన్ని యింట్లో పడేయండి. కొన్నాళ్ళుగడిచిపోతే. అన్నీ అవే సర్దుకుపోతాయి." గబగబా అంది కమల.

లాలనగా కమల కన్నీళ్ళు తుడిచాడు ప్రభాకర్.

"కమలా! పిచ్చిదానివయిపోకు. అలా చెయ్యటం వల్ల ఎవరూ సుఖపడలేరు. చిన్న పిల్లలంతా చేరి నాకు పెద్దరికం నిలిపినందుకు, ఇది కాదు నేను చేయవలసింది! మన వేణుతో మయూరకు విడాకులిప్పిస్తాను. యతికీ, మయూరకూ పెళ్ళి చేస్తాను."

"అయ్యో!" ముఖం చేతుల్లో కప్పుకుని కూలబడింది కమల. "ఇదెక్కడి అన్యాయమండీ! కన్న కొడుక్కి కోడలిచేత విడాకులిప్పించి కోడల్ని మరెవరికో ఇచ్చి పెళ్ళిచేస్తారా? ఇంత ఘోరం లోకంలో ఎక్కడన్నా వుంటుందా?"

"కమలా! మనం ఘోరం అనుకుంటే అన్నీ ఘోరంగానే కనిపిస్తాయి. అర్థం చేసుకోగలిగితే అన్నీ సవ్యంగానే వుంటాయి. ఆ నాడు నేను నిన్ను పెళ్ళి చేసుకున్నప్పుడూ అందరూ ఘోరమనే గుండె బాదుకున్నారు. "బాల వితంతువయినా కాదు. పెళ్ళయి పిల్లలున్న ఆడది" అన్నారు! కన్నతండ్రి ముఖం చూడకుండా వెలివేసాడు.

ఆ నాడు నేను నా గుండెబలంతో అదే సరయిన మార్గమని నిర్ణయించుకుని నిన్ను పెళ్ళి చేసుకున్నాను. కాలం గడిచిన కొద్దీ మనను వెలివేసిన వారే మనను అభినందించారు. ఇప్పుడూ అంతే! నా నిర్ణయం ప్రస్తుతం కొంత మందికి ఘోరంగా తోస్తే తోస్తుంది. కానీ, ఈ నిర్ణయం ఎంతో సమంజసమైనదనీ, సంఘంలో ఈ మార్పు అవసరమేననీ, కాలమే రుజువు చేస్తుంది."

"ఏమోనండీ: నాకు మతి పోతోంది- గుండె దడదడ లాడుతోంది. ఈ ఘోరం నేను చూడలేనండీ!"

"అలాకాదు కమలా! కష్టసుఖాలన్నిట్లో నా పక్కన నిలబడ్డావు రా! యతినీ మయూరను పలకరించు." అని కమలను చెయ్యి పట్టుకుని నడిపించుకొని వచ్చాడు యతి పక్కన వంటినిండా పైట కప్పుకొని నిలబడింది మయూర. ప్రభాకర్‌తో కమల బయటికిరాగానే కమల పాదాలకు నమస్కారం చేసింది. మయూర కళ్ళలోనూ నీళ్ళు నిండుకున్నాయి. చెమ్మగిల్లిన కళ్ళతో ఆ కన్నీళ్ళు తుడిచి "ఎందుకమ్మా ఏడుస్తావు? సుఖంగా ఉండు!" అంది కమల. తేజస్వి, మమత, ప్రతాప్, ఉదయ్ మొదలయినవాళ్ళు కూడా వచ్చారు. అంతా కూచుని మాటల్లో పడ్డారు. ఏమీ జరగనట్లుగా మాట్లాడటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు ప్రభాకర్. యతి, మయూర వంచిన తలలు ఎత్తలేకపోతున్నారు.

వేణు వచ్చాడు-ఎప్పటిలాగ తప్పతాగే వచ్చాడు. జరిగింది తెలుసుకున్నాడు. ఈ పరిణామం అతడు ఊహించలేనిది - ఏమాత్రం భరించలేనిది.

"నో! నో! నేను మయూరకు విడాకులియ్యను. ఆ దెయ్యాన్ని సుఖంగా, సంతోషంగా బతకనియ్యను. ఆ యతిగాడిని చంపి ముక్కలు చేస్తాను." అని అరిచాడు వేణు. ప్రభాకర్ శాంతంగానే కఠినంగా "వేణూ! బుద్ధిగా లాయరుగారు చెప్పినచోట సంతకాలు పెట్టు, లేకపోతే కోర్టులో నీ బండారమంతా బయటపడుతుంది. అప్పుడు మయూరకు

విడాకులూ వస్తాయి. నువ్వు పబ్లిక్‌గా నవ్వులపాలూ అవుతావు" అన్నాడు.

తండ్రి కంఠంలో కాఠిన్యం గుర్తించాడు వేణు. ఆ కంఠం అలా పలికినపుడు దానిని ఎదిరించి ఎవరూ ఏమీ చెయ్యలేరని తెలుసు! ఎఱ్ఱబడ్డ ముఖంతో ముక్కుపుటాలు అదురుతుండగా లాయరు పెట్టమన్నచోట సంతకాలు పెట్టేసాడు.

చిన్నప్పటినుండీ "మా ఫాదరు తలుచుకుంటే...." అంటూ ప్రభాకర్ పరపతి పరోక్షంగా ఉపయోగించుకొంటూ వేణు చేసిన ఆగడాలు గుర్తుకొచ్చాయి యతికి. ఆ రోజుల్లో ఒకనాడు "మీ ఫాదరు తలుచుకుంటే ఏమైనా చెయ్యగలరు. కాని, పశువులా మారిన నిన్ను మనిషిగా చెయ్యలేరు" అనటంకూడా గుర్తుకొచ్చింది. ఎలాంటి మహానుభావుడి కడుపున ఎలాంటివాడు పుట్టాడు!

ఇదంతా జరిగిన తరువాత కొద్ది రోజుల్లోనే మయూరకు లీగల్‌గా విడాకులు లభించాయి. అంతవరకూ మయూర తల్లిదండ్రుల దగ్గరే ఉంది. అటుమయూర తల్లిదండ్రులూ, ఇటు యతి తల్లిదండ్రులూకూడ ఈ పరిణామాలకు పెద్దగా సంతోషించలేదు. తమబిడ్డ ఒక పెళ్ళి కాదని మరోపెళ్ళి చేసుకుంటే నలుగురూ ఏమనుకుంటారో అనీ మయూర తల్లిదండ్రులు భయపడ్డారు. తన కొడుక్కు "లక్షణమైన సంబంధం" తెచ్చి చెయ్యలేకపోయానే" అని యతి తల్లి బాధపడింది. మొత్తంమీద అందరూ సర్దుకోక తప్పలేదు. యతి,మయూర రిజిష్టరుమేరేజ్ చేసుకున్నారు. పెళ్ళి కాగానే మయూర

యతితో కలిసి యతి గ్రామంలో ఉన్న కోవెలకు వెళ్ళింది. ఆనాడు భగవంతుణ్ని నిందించింది. ప్రభాకర్ భగవంతుణ్ని ప్రార్థిస్తున్నప్పుడు కూడా మనసు బాధపొందినట్లు ఉండేది. విధి లీలలు ఎంతచిత్రమైనవి! జీవితంలో ఒడిదుడుకులు ఎవరికైనా తప్పవు. ఈ సంఘర్షణే జీవితంలో మంచి జరగగానే దేవుణ్ని మెచ్చుకొని ఆపద రాగానే నిందించడం ఎంత మూర్ఖం? ఏ శక్తి ప్రభాకర్ లాంటివ్యక్తుల హృదయాలను అంత ఉదాత్తంగా వెలిగించగలుగుతోందో ఆ శక్తే భగవంతుడు తన మనసు ఉన్నతంగా, ఉదాత్తంగా ఉంటే చాలు! జీవితంలోని సంఘర్షణలను ఎన్నైనా ఎదుర్కొనగలదు. అదే జీవితానికి అర్థం.

మయూర చెయ్యి పట్టి లాగుతూ "ప్రార్థన ముగిసిందా?" అన్నాడు యతి.

"లేదు! ప్రారంభమయింది!" నవ్వింది మయూర

సమాప్తం —